# శ్రీరామకర్ణామృతము

పూర్వకవి:

ఆదిశంకరుని విరచితము.



ప్రకాశకుఁడు:

కొండపల్లి వీరవెంకయ్యా

బుక్సెల్లరు, రాజమండ్రి.



రాజమహేంద్రవరము:

శ్రీసత్యానందప్రెస్‌నందు

ముద్రింపఁబడినది.

1932



వెల రు 1—0—0

# పీఠిక.



ఇయ్యది పీఠాధిపతులలో మొట్టమొదటివారగు శ్రీజగద్గురు శంకరాచార్యగురువరేణ్యులచే రచియింపఁబడినది. ఈశ్లోకములు నారికేళపాకములో సర్వజనవిదితంబుగా రచించగలిగిన మేధాశక్తిగల శంకరాచార్య శక్తిధీయుక్తులు పాఠకులకు పూర్వపరిచితములే! యెచ్చట జూచినను భక్తియే తాండవించుచున్నది. యేపదంబుగనుగొన్నను భక్తియే. అద్వితీయ వీరాధివీరుండగు రామునికథ మనశంకరాచార్యవాగ్ధోరణిలో తాండవించినది. దీనికి సిద్ధకవియను పూర్వమహాత్ముండు తెలుగు పద్యంబులు తననేర్పుమెయిగూర్చి కృతార్థత్వమునొందినాడు. ఈయనకవిత్వముకూడా నారికేళపాకమునే యనుసరించుచున్నది. ఇట్టి చిత్తశుద్ధిగల మహాత్ములు రచియించిన కావ్యములు యాంధ్రదేశమున యడుగునబడి, యే మదరాసు చెత్తపుస్తకాలయములలోనే తప్పులు కుప్పలుఁగా యచ్చొత్తింపఁబడి యూరును బేరునులేని పద్ధతులతో స్వల్పక్రయమునకు విక్రయింపఁబడుచున్నవి. వెలసులభమైనదనుటతోడనే మనవారలకమితసంతోషము. అంతియేకాని యందుల గలతప్పులు గమనించువారరుదు. ఈపొత్తమట్లుగాక తప్పులుసరిజూడబడి, గంగాఝుర్ఝరీ ప్రవాహవేగముగల ఆదిశంకరుని శ్లోకములతో సిద్ధకవి తెనుగుపద్యములతో, తాత్పర్యసహితముగా యచ్చొత్తించి పాఠకమహాశయులకరకమలంబులందుంచితిమి. ఇందలి రామనామామృతసుధాపేశలంబుల గ్రోలి ధన్యత్వంబు నొందు పాఠకులకు ధన్యవాదంబు లర్పించుచున్నారము.

అట్టియఖండ శేషముషీవిభవంబులగు శంకరుని శ్లోకములు జదివి నంతనే ప్రతిమానవుండును తన్మయత్వంబును జెందకమానడు. అద్భుతంబుగా రసోచితం బలపరచి, భక్తిచిత్తంబుల కత్తునట్లు, చిత్తచాంచల్యము నశించునట్లు, మనోహంకారముల యవసరము ద్రోసివేసి, జ్ఞాన వైరాగ్యంబులకు నిధికివలె రచనముగించి కృతకృత్యత్వంబునొందిన శంకరుని దివ్యజ్ఞాన సంపన్నము పాఠకులు భట్టీబట్టుట కవసర మయ్యె పద్ధతి యనియే మాయూహ. మాయూహాకతీతంబులగు నవియే సిద్ధకవి తెలుగుపద్యంబులు. ఇట్టి లోకోత్తరములగు ప్రబంధములే యిప్పుడు మనభాషాపోషకు ముఖ్యావసరము. ఇట్టియుద్గ్రంథములన్నియు సాధ్యమైనంత త్వరలో ముద్రింపఁగలమని మనవి.





శ్రీరస్తు.

# శ్రీ రామ కర్ణామృతము.



## మంగళశ్లోకములు.

మంగళం భగవాన్విష్ణో ర్మంగళం మధు సూదనః
మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః.

శా. శ్రీరామున్ భువనాభిరాము ఘనరాజీవాప్తధామున్ పరం
ధాముఁ బావననాము పాలితమునీంద్రస్తోము నీలాంబుద
శ్యామున్ సన్నుతనాము భానుకులదుగ్ధాంబోధిసోముఁ మహో
ద్ధాముఁ బ్రాభవ దైత్యభీము నతసుత్రామున్ మదిన్ గొల్చెదన్.

తా॥ శ్రీలచేరమ్యంబైనవాడును షడ్గుణైశ్వర్య సంపన్నుండును మధ్వాసురునకు శత్రుండును తెల్లతామరపద్మంబుల వంటినేత్రం బులుకలవాడును గరుడధ్వజుండును నగునీలమేఘంబురీతి చామనచాయకలవాడును సూర్యకులంబను సముద్రంబునకు చంద్రుడువంటివాడునునగు శ్రీరాముని నాహృదయంబున గొల్చెదను. 1

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్ధయే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళం
వేదవేదాంత వేద్యాయ మేఘశ్యామల మూర్తయే
పుంసాంమోహన రూపాయ పుణ్యశ్లోకాయ మంగళం.

ప్రకటితకోసలేంద్రునకు భవ్యగుణాబ్ధికి జక్రవర్తిపు
త్రకునకు సార్వభౌమునకు రామునకున్ నిగమాంతవేదికి

సకమల మేఘవర్ణునకు సర్వజగజ్జన మోహనస్వరూ
పకునకు బుణ్యకీర్తికి గృపానిధి కెప్పుడు భద్రమయ్యెడున్.

తా॥ కోసలదేశంబునకధీశ్వరుండును గొప్పగుణంబులుకలవాడు నుచక్రవర్తిపుత్రుండును సార్వభౌముండునువేదంబులనువేదార్థంబులను నెఱింగినవారికి దెలియువాడును జగంబులమోహపెట్టు రూపసియు దయాసముద్రుండును నగు శ్రీరామునకు మంగళమగుగాక :— 2

శ్లో॥ విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళం.
పితృభక్తాయసతతం భాతృభిస్సహసీతయా
నందితాఖిలలోకాయ రామచంద్రాయమంగళం.

చ. ప్రకటవిదేహభాగ్య పరిపాలునకున్ ముదితాంతరంగకౌ
శికునకు పితృభక్తునకు శీలికి భూమిసుతా సుమిత్రపు
త్రకసహితప్రకాశునకు ప్రస్తుతసాధుజనైకభవ్యమూ
ర్తికిరఘురామచంద్రున కరిస్ఫులపాణికి భద్రమయ్యెడున్.

తా॥ విశ్వామిత్రుని సంతోషపెట్టినవాడును జనకునిభాగ్యమునకు బరిపాకమైనవాడును మంగళస్వరూపుండును తల్లితండ్రులందుభక్తికలవాడును నెల్లప్పుడు తమ్ములతోనుభార్యలతోను గూడియుండువాడునునగు రామచంద్రునకు మంగళమగుగాక :— 3

శ్లో॥ త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే
సేవ్యాయసర్వయమినాం ధీరోధారాయ మంగళం.
సౌమిత్రిణాచజానక్యా చాపబాణాభిధారిణే
సంసేవ్యాయ సదాభక్త్యా సానుజాయాస్తు మంగళం.

ఉ. హారికయోధ్యసౌఖ్య పరిహారికినంచిత చిత్రకూటసం
చారికుదారికిన్ వినుతసంయమికిన్ శరచాపధారికిన్

త్సౌరమణీజలక్ష్మణ సమన్వితమూర్తికి భవ్యకీర్తికిన్
శ్రీరఘురామచంద్రునకు సేవకసేవధికిన్ శుభంబగున్.

తా॥ అయోధ్యయందలిసౌఖ్యములను విడిచిచిత్రకూటంబున సంచరించువాడును మునులసేవించువాడును సీతాలక్ష్మణులతోసదాకూడియుండువాడును నగుశ్రీరామమూర్తికి మంగళంబగుగాక :— 4

శ్లో॥ దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తుమంగళం.
సాదరంశబరీదత్త ఫలమూలాభిలాషిణే
సౌలభ్యపరిపూర్ణాయ సత్వోద్రిక్తాయమంగళం.

మ. అరివిధ్వంసికి దండకానన విహారామోదికిన్ గృధ్రశే
ఖర నిశ్శ్రేయసదాయికిన్ శబరి సాకాఙ్క్షార్పి తారణ్యమా
ధురిశోధ్యత్ఫల భోక్తన్ ప్రవిలసద్దోస్సారికిన్ శౌరికిన్
వరసౌలభ్యగుణప్రపూర్ణునకు నానాభద్రముల్ జేకురున్.

తా॥ దండకారణ్యమునందుండియనేక రాక్షసులజంపినవాడును జటాయువునకు ముక్తినిచ్చినవాడును శబరియొసగిన కందమూలఫలాదులను దినువాడునుమిగులబలవంతుడును నగురామచంద్రమూర్తికి మంగళమగుగాక :— 5

శ్లో॥ హనూమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయమంగళం.
శ్రీమతేరఘువీరాయ సేతూల్లంఘితసింధవే
జితరాక్షసరాజాయ రణధీరాయమంగళం.

ఉ. పాలితవాయుసూనునకు భక్తకపిప్రవరేష్టదాయికిన్
వాలివిదారికిన్ ధృతికివారిధిసేతునిబంధనక్రియా
శాలికివీరరామునకుచండపరాక్రమఘంటికంఠని
ర్మూలనకేళికిన్ నృపతిముఖ్యులలామునకున్ శుభంబగున్.

తా॥ హనుమంతుడు మొదలగు తనభక్తులైన కోతులకు వరంబులొసంగినవాడును వాలిని జంపినవాడును మహాధైర్యవంతుడును సముద్రంబునకు సేతువు గట్టినవాడును నగు రామచంద్రునకు మంగళమగుగాక :— 9

శ్లో॥ ఆసాద్యనగరీందివ్యా మభిషిక్తాయసీతయా
రాజాధిరాజరాజాయ రామభద్రాయమంగళం
విభీషణకృతేప్రీత్యా విశ్వాభిష్టప్రదాయినే
జానకీప్రాణనాథాయ సదారామాయ మంగళం.



# శ్రీ రామ కర్ణామృతము.

## ప్రథమాశ్వాసము.

మ. ప్రకటాయోధ్యపురిన్ ధరాత్మతనయతో బాలించి రాజాధినా
యకసంసూయధరాభిషేకమునిజంబయియున్న లోకాధినా
యకరత్నంబునకున్ విభీషణప్రపంచాభీష్ట సంధాయికిన్
మకుటాకల్పవిభూషితాంగునకు నానాభద్రముల్ జేకురున్.

తా॥ సీతతోనయోధ్యాపురంబున పట్టాభిషేకమైనవాడును విభీషణునకు లంకారాజ్యము నొసంగినవాడును జానకీ ప్రియుండును నగు రామునకు మంగళమగుగాక :— 7

శ్లో॥ శ్రీరామం త్రిజగద్గురుం సురవరం సీతామనో నాయకం
శ్యామాంగం శశికోటి పూర్ణవదనం చంచత్కలాకౌస్తుభం
సౌమ్యంసత్వగుణోత్తమం సరయూతీరేవసంతం ప్రభుం
త్రాతారంసకలార్థ సిద్ధిసహితం వందేరఘూణాంపతిం. ౧

శా. శ్రీరామున్ శతకోటికాంతివదనున్ సీతామనోనాయకున్
ధీరున్ విశ్వగురున్ బరేశుసరయూతీరప్రచారిన్ హారిన్
ధారాభృత్సమనీలుకౌస్తుభధరున్ ద్రాతన్ సుపర్వేశ్వరున్
శౌరిన్ శర్వఫలప్రదున్ గొలిచెదన్ సత్యాత్మసౌమ్యాకృతిన్. ౧

తా॥ మూడులోకంబులకు గురుండు సీతాపతియును ప్రపంచమునకు గురుడైనవాడును, సరయూతీరంబున సంచరించువాడును నగు శ్రీరామమూర్తికిదే నమస్కరించుచున్నాను. 1

శ్లో॥ శ్రీరాఘవందశరథాత్మజమప్రమేయం
సీతాపతింరఘువరాన్వయరత్నదీపం

ఆజానుబాహుమరవింద దళాయతాక్షం
రామంనిశాచరవినాశకరంనమామి. ౧

ఉ. శ్రీరఘువీరుదాశరథి జన్మయసూర్యకులప్రదీపకున్
సారసపత్రనేత్రుదితిసంభవజైత్రుమహీసుతాననాం
భోరుహమిత్రుదీర్ఘకరు పుణ్యచరిత్రుజగత్పవిత్రు శృం
గారగుణాభిరాము త్రిజగత్ప్రభునెంతు హృదంతరంబున. ౧

తా॥ రఘుకులసంజనితుండును దశరథపుత్రుండును సీతకుభర్త యు రఘువంశంబునకు దీపమువంటివాడును మోకాలివఱకు వ్రేలాడు చేతులు కలవాడును పద్మదళంబులవంటి నేత్రంబులుకలవాడును రాక్షసులకు నాశన కరుండునగు రామచంద్రునకు నమస్కరించుచున్నాను. 2

శ్లో॥ శ్రీరామంబలవైరినీలచికురం స్మేరాననం శ్యామలం
కర్ణాంతాయతలోచనంసురవరం కారుణ్యపాథోనిధిం
శోణాంభోరుహపాదపల్లవయుగం క్షోణీతనూజాయుతం
రాజత్కుండలగండభాగయుగళం రామంసదాహంభజే. 3

మ. వారినీలాలకుసంస్మితాననుఘనశ్యామాంగు దేవేశునం
వరణాంతవిలోచనున్ రఘువరున్ ధాత్రీతనూజాధిపుం
గరుణాంభోనిధిరత్నకుండల లసద్గండస్థలుం నన్యభా
సురతామ్రాంబుజ పల్లవాంఘ్రియగుసుశ్లోకుం బ్రశంసించెదన్. 3

తా॥ మేఘునివలె నల్లనగుముంగురులుకలిగి చిఱునవ్వుతోనొప్పు మొగంబుకలవాడునునల్లనిదేహంబుకలవాడును చెవులవరకుపొడవుగానున్న నేత్రంబులు కలవాడును దేవతలలో నుత్తముండును దయాసముద్రుండును ఎఱ్ఱనితామర పద్మములవలె మృదువగుపాదంబులును కుండలములుగలవాడును నగు రామునియెల్లప్పుడు సేవించుచున్నాను. 3

శ్లో॥ శ్రీరామంజగదేకవీరమమలం సీతామనోరంజనం
సల్యావరనందనంరఘుపతిం కాకుత్థ్సవంశోద్భవం
లోకానామభిరామమంగళఘనవ్యాపారపారాయణం
వందేహంజనఘోరపాపనికర ధ్వంసంవిభుంరాఘవం. ౪

శా. శ్రీరాముఁ జగదేకవీరునమరున్ సీతామనోరంజనున్
కారుణ్యాకరుగోసలేశ్వరసుతాగర్భాబ్ధిచంద్రోదయున్
ఘోరాఘౌఘతమిస్రకంజసఖు గాకుత్థ్సాన్వయుఁ రాఘవుఁ
శూరున్లోకపవిత్రురామ విభుసుశ్లోకున్మదిన్ గొల్చెదఁ. ౪

తా॥ జగంబునందలి వీరులలో ముఖ్యుండును సీతామనో హరుండును కౌసల్యకు గారాబుబిడ్డఁడును కాకుత్థ్సవంశంబున పుట్టినవాఁడును మనోహరమగు శుభంకరమగు వ్యాపారంబుకలవాఁడును గొప్పపాపంబుల పోగొట్టువాఁడును నగు రామునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ శ్రీరామంజగదీశ్వరంజనకజా జానింజనానందనం
జంతూనాంజనకంజనార్తిహరణం లోకేశ్వరంశాశ్వతం
ఆబాల్యాదిమునీశ్వరైః పరివృతం జాజ్వల్యమానంసదా
జంఘాలంజమదగ్నిసూనుహరణం జాతానుకంపంభజే. ౫

శా. శ్రీరాముఁ జగదీశ్వరున్ జనకపుత్రీనాదుమానీంద్ర సం
ఘూరూణామృతుసజ్జనార్తిఁ హరిజంగాలున్ పరీభావ కృ
ద్ధూర్తీప్రాభవభార్గవున్ సకలజంతుప్రాణ రక్షున్నప
ర్వారాధ్యున్ రఘువర్యుశాశ్వత జనాహారుఁ భజింతుఁ మదిన్ ౫

తా॥ జనకునల్లుండును జగత్తులకు ప్రభుండును జనులకు సంతోషంబు కలుగజేయువాఁడును జనులకష్టములను బోగొట్టువాఁడును బాల్యమునుండియు మునులతో పరిచయంబు కలవాఁడును సదాకాంతి కలవాఁడును పరశురాముని జంపినవాఁడును నగు రాముని నాహృదయంబున దలంచుచున్నాను.

శ్లో॥ శ్రీరామోరఘునాయకోరఘువరోరాజీవ నేత్రాంచితో
రాజేంద్రోరఘుపుంగవోరఘుకులోత్తంసోరఘూణాంపతిః
రామోరాక్షసనాశనోమితబలోరాకేందుపూర్ణాననో
రాజత్కింకిణికంకణాంకితకరోరామస్సదాపాతునః. ౬

శా॥ రాజీవాయతపత్రనేత్రు విలసద్రాకేందుబింబాననున్
రాజేంద్రున్ రఘుపుంగవున్ రఘుకులున్ రాత్రించరారిన్ మహా
తేజున్ రాఘవునప్రమేయబల సందీప్తున్ రఘూత్తంసునిన్
రాజత్కింకిణికంకణాంకితకరున్ రామప్రభున్ గొల్చెదన్. ౬

తా॥ రఘువంశమున కలంకారుండును పద్మంబులవంటి నేత్రంబులు కలవాఁడును రఘువంశమున బుట్టినవారిలో నుత్తముండును రాక్షసులను జంపువాఁడును చేతులందు రత్నంబులను స్థాపించిన కంకణంబులుకలవాఁడునునగు రాముఁడెప్పుడును నన్నురక్షించుగాక. 6

శ్లో॥ శ్రీరామచంద్ర కరుణాకరరాఘవేంద్ర
రాజేంద్రచంద్ర రఘువంశసముద్రచంద్ర
సుగ్రీవనేత్రయుగళోత్పలపూర్ణచంద్ర
సీతామనఃకుముదచంద్రనమోనమస్తే. ౭

చ. మనుకులవార్ధిప్రాగుదిత మానితపూర్ణిమ చంద్ర సర్వస
జ్జనునుతకీర్తిసాంద్రు మహిజానయనోత్పల పూర్ణచంద్రు శో
భనగుణరామచంద్రుని విభాకరజాక్షకుబాలచంద్రు
సన్మునినుతురాఘవేంద్రు భవమోచనుగారుణికున్ భజించెదన్. 7

తా॥ మనువంశంబను సముద్రంబున నుదయించిన పౌర్ణమినాటిచంద్రునివంటివాఁడును, సజ్జనులు పొగడఁదగిన కీర్తి కలవాఁడును, సుగ్రీవుని నేత్రంబులకు చంద్రునివంటివాఁడును సీతాదేవిహృదయపద్మంబునకు చంద్రునివంటివాఁడును నగు రామునకు నమస్కారము. 7

శ్లో॥ శ్రీరామంకరుణాకరంగుణనిధిం సీతాపతింశాశ్వతం
పారావారగభీరమబ్జనయనం ప్రావృడ్ఘనశ్యామలం
వీరశ్రేష్ఠమనామయం విజయదం విశ్వప్రకాశాత్మకం
ఘోరారిప్రహరాధికప్రహరణం కోదండరామంభజే. ౬

శా. వీరశ్రేష్ఠుననామయుఁ జయకరుఁ విశ్వప్రకాశాత్మకున్
పారావారగభీరుఁ గంజనయనుఁ ప్రావృడ్ఘనశ్యామలుఁ
ఘోరారిందముశాశ్వతుఁ రఘువరుఁ కోదండదీక్షాగురుఁ
శ్రీరాముఁ గరుణాకరున్ గుణనిధిఁ సీతేశుఁ బ్రార్థించెదన్. ౭

తా॥ దయకలిగి గుణంబులతో నొప్పి శాశ్వతుండై సముద్రునివంటి గంభీరత్వంబును పద్మంబులవంటి నేత్రంబులును వర్షాకాలమేఘమువంటి దేహంబును కలిగి వీరుడనుపించుకొనుచు జగంబునంతను కాంతింపజేయు కోదండరాముని సేవించుచున్నాను. 8

శ్లో॥ శ్రీరామచంద్రేతిసలక్ష్మణేతి నీలోత్పలశ్యామలకోమలేతి
ఆక్రోశతామస్త్వమధునైవజిహ్వే సీతాపతేరాఘవరాఘవేతి

ఉ. శ్రీరఘురామరాఘవ వశిష్ఠపవిత్రచరిత్రసద్యబృం
దాకరనాథనీలసమధామ సుమిత్రసుతానుయుక్తధా
త్రీరమణీసుతాధిపసుధీజనవందిత పాదపద్మశ్రృం
గారనిధీయటంచు గలకాలమహోరసనాస్మరింపుమా. ౯

తా॥ ఓ నాలుకా ! నీవెప్పుడును ఆరామచంద్రుని, రామచంద్రాయనియు లక్ష్మణునితో నున్నవాడాయనియు, నల్లకలువలవలె కోమలమై చామనచాయతో నొప్పుదేహము కలవాడా యనియు, రాఘవ, రాఘవాయనియు, సీతాపతేయనియు స్మరింపుచుండుము.

శ్లో॥ శ్రీరామచంద్రేరమతాంమనోమే, రమాంగనాగోవిపదాంవిరామే
జితారిరామేప్రణతారిరామే, గుణాభిరామే భువనైకరామే. ౧౦

చ. వరనుగుణాభిరాముడు భవస్తవనాహ్వయుడాపదాటవీ
స్ఫురదనలుండువైరిజన పుణ్యాసతీప్రణతుండుశత్రు బం

ధురవిభవావహుండును దోర్బలు డబ్జకరాభిరాముడున్
హరిరఘురాముడై వరము నందనిశంబురమింపుచిత్తమా. ౧౦

తా॥ ఓ మనస్సా; సుగుణాభిరాముండును లోకంబులునుతింపదగిన పేరుకలవాడును కష్టంబులను నడవులకు దావాగ్నివంటివాడును వైరిజనులును పుణ్యస్త్రీలును నమస్కరింప తగినవాడును భుజబలంబుకలవాడును నగు రాముని సదా స్మరించుచుండుము.

శ్లో॥ శ్రీరామచంద్ర రఘుపుంగవ రాజవర్య
రాజేంద్ర రాజ సురనాయక రాఘవేశ
రాజాధిరాజ రఘునందన రామభద్ర
దాసోస్మ్యహంచ భవతశ్శరణాగతోస్మి. ౧౧

మ. ధరణీనాథశిరస్స్ఫురన్మకుట రత్నోంతనిరాజితా
కరపాదాంబురుహద్వయున్ సకలలోకస్వామిరామ ప్రభున్
సకలున్ రాఘవుదేవతా విబుధ స్తవ్య ప్రచారున్ బరా
త్పరురాజేంద్రు రఘూద్వహుఁ దలచి తద్దాసుండనై యుండెదన్.

తా॥ భూమండలమందలి రాజులకిరీటములందలి రత్నంబులచే ప్రకాశించుపాదంబులు కలిగి సమస్తలోకములకు ప్రభువై దేవతల పొగడ్తలకు పాత్రుడై రఘుకులంబునకు మాణిక్యమువంటివాడై నరసుండగు రాముని నాహృదయంబున తలచుచు నతనికి దాసుడనై సేవచేతును.

11

శ్లో॥ శ్రీరామంనరసీరుహాక్షమమలం దూర్వాంకురశ్యామలం
విద్యుత్కోటినిభప్రభాంబరధరం వీరాసనాధిష్ఠితం
వామాంకోపరిసంస్థితాంజనకజా మాలింగ్యతాంబాహునా
తత్వంచాపరపాణినామునిగణా నాజ్ఞాపయంతంభజే. ౧౨

శా. వామాంకస్థపతిన్ ప్రవేష్టమున భావంబొప్పసంశ్లేషుడై
తామానీంద్రులకొక్కహస్తమున తత్త్వంబేర్పడన్ దెల్పు శ్రీ

రాముని సారసపత్రనేత్రుఁ రఘును వీరఖ్యాసనాధిష్ఠితుఁ
శ్యామాంగుని దపనీయచేలుని రఘుస్వామిన్ ప్రశంసించెదన్. ౧౨

తా॥ ఒక బాహువుచే దన కెడమువైపున గూర్చుండియున్న సీతను కౌఁగిలించి రెండవచేతితో తనచుట్టునున్న మునులకు తత్వశాస్త్రరహస్యములను దెల్పుచునుండి పద్మములవంటి కన్నులతోను దూర్వాంకురంబువలె చామనచాయ నొప్పు శరీరముతోనుండు రామచంద్రుని నేకొనియాడెదను. 12

శ్లో॥ శ్రీరామ స్సకలేశ్వరో మమపితా మాతాచ సీతామమ
భ్రాతా బ్రహ్మసఖా ప్రభంజనసుతః పత్నీవిరక్తిః ప్రియా
విశ్వామిత్ర విభీషణాదివశగా మిత్రాణిభోదస్సుతో
విభక్తి శ్రీహరిసంగదారతిసుఖం వైకుంఠమస్మత్పదం. ౧౩

శా. రామస్వామియె తండ్రి సీతజననీ భ్రాతాబ్జజాతుండు వి
శ్వామిత్రాఖ్యవిభీషణాదులుహితుల్ సద్బోధపుత్రుండు స
ద్భామారత్నము శాంతిసఖ్యుడు జగత్ప్రాణాత్మజుం డచ్యుత
ప్రేమాశక్తిసుఖంబుమత్పదనమై బెంపొందు వైకుంఠముల్. ౧౩

తా॥ నాకురాముడేతండ్రి. తల్లియేసీత. అన్న బ్రహ్మ. హనుమంతుడు వేడుకచెలికాడు. విశ్వామిత్రవిభీషణాదులు మిత్రులు. సద్బోధపుత్రుడు. విరక్తియేభార్య. అచ్యుతునియందు ప్రేమాసక్తియే నాకుసుఖము. నేను వైకుంఠమునందే యుందును. 13

శ్లో॥ శ్రీరామానుల పుండరీకనయన శ్రీరామ సీతాపతే
గోవిందాచ్యుతనన్దనన్దన ముకున్దానంద దామోదరా
విష్ణో రాఘువవాసుదేవనృహరే దేవౌఘచూడామణే
సంసారార్ణవకర్ణధారకహరే కృష్ణాయతుభ్యంనమః ౧౪

శా. ధీరాగేసరనందనందనహరీ దేవౌఘచూడామణే
ఘోరరాఘపుగహరా ముకుందనృహరీ గోవింద శ్రీకృష్ణ సం

సారాంభోనిధిధీజర్ణధారకమలాత్మాశౌరి దామోదరా
శ్రీరామాచ్యుతజానకీరమణ నిన్సేవింతు నిష్ఠాప్తికిన్. ౧౪

తా॥ తెల్లతామరపద్మంబులవంటి కన్నులునుకలవాడా ; సీతాప్రియుడా ; నందునికుమారుడా; దేవోత్తముడా ; ముకుందుడా; దామోదరా; వాసుదేవా; సంసార సముద్రంబును దాటించువాడా ; రామా ; నీకిదేనమస్కారము. 14

శ్లో॥ రామంలక్ష్మణ పూర్వజంరఘువరం సీతాపతింసుందరం
కాకుస్థంకరుణాకరంగుణనిధిం విప్రప్రియం ధార్మికం
రాజత్కుండలమండితాననరుచిం రాత్రించరధ్వంసినం
శంపాకోటి సమానకాంతి విలసన్మాయామృగఘ్నంభజే.

మ. ధరణీజాధిపతిన్ల సద్గుణుబరంధామున్ బ్రసూనాస్త్రసుం
దరుగాకుత్థ్సుని ధార్మికున్ రఘువరున్ దైత్యారివిప్రక్రియన్
గురుచంచత్కమనీయ శంబరహరద్ఘోరాస్త్ర సత్కుండలా
భరణున్ రామునిలక్ష్మణా గ్రజుకృపాభ్రాజిష్ణు గీర్తించెదన్. ౧౫

తా॥ లక్ష్మణునికన్నయు సీతకుపతియుకరుణాకరుణుండును గుణనిధియుబ్రాహ్మణప్రియుండును ధర్మాత్ముండును కుండలములకాంతిచే ప్రకాశించుమొగంబుకలవాడును రాక్షసహారియు బరంధాముండును నగురామునిసదాస్తుతింతును. 15

శ్లో॥ రామంరత్నకిరీటకుండలధరం కేయూరహారాన్వితం
సీతాలంకృతవామభాగమతులం సింహాసనస్థంప్రభుం
సుగ్రీవాదిసమస్తవానరనుతం సంసేవ్యమానంసదా
విశ్వామిత్రపరాశరాదిమునిభి స్సంస్తూయమానంభజే. ౧౬

చ. క్షితిసుతవామభాగమునఁ జేరివసింపవసిష్టకౌశికా
ద్యతితతిప్రస్తుతింపరవిజాదిబలీముఖులెల్లఁ గొల్వగా

భ్రాతనకిరీటకుండల విభాసితసుందరభవ్యమూర్తియై
వితతకరిద్విరాసన ప్రతిష్ఠిత జెల్వగురామునెన్నెదన్. ౧౬

తా॥ సీతాదేవివామభాగంబుననుండ వశిష్టవిశ్వామిత్రాదిము
నులుచుట్టును జేరిపొగడుచుండ సుగ్రీవాదివానరులెల్ల భయభక్తులతో
వినయముగ ప్రక్కనిలచియుండ కిరీటకుండలాదులు ప్రభాకలితంబై
యుండ నుండురామునిసదా సేవింతును. 16

శ్లో॥ రామస్సీతాసమేతో నివసతుహృదయే సామంజరామమీడే
రామేణక్షుణపాపస్త్రి విధమపికృతం కర్మరామాయదద్యాం
రామాదన్యంనజానేనహికమపి మహారామనామ్నస్సమానం
రామేపశ్యామివిశ్వం భువనమనుదినం పాహిమాంవీరరామం. ౧౭

ఉ. రాముడుబ్రోచుసంతతము రామునుతింతునురాముచేత మ
త్కామితమున్ ఫలించు నిరతంబును రామునకేను మ్రొక్కెదన్
రామునకెవ్వఁడెవ్వఁడికి రామునిపాదమునెంతు రాముపై
ప్రేమజెలంగుమద్హృదయ పీఠివసింపుము రామవేడెదన్. ౧౭

తా॥ శ్రీరాముడుసీతాసమేతుడై నాహృదయంబుననిలుచుగా
క. రామునినేసేవించెద. రామునిచేనాకార్యంబులఫలింపజేసుకొందును
నాపనిరామునికేవినియోగింతును. రామునికంటెయితరుని సేవింపను.
రామునియొక్కపేరుతో సమానమైనదిలేదు. రామునియందఖిలప్రపంచమును చూచుచున్నాను. రామా ; నన్నురక్షింపుము. 17

శ్లో॥ రామం రాజశిఖామణిం రఘుపతిం దేజారిదర్పాపహం
లోకానాంహితకారిణం గుణనిధిం కారుణ్యపుణ్యోదయం
ముక్తావిద్రుమ రత్నశోభితతనుం సౌందర్యహస్తాంబుజం
కౌసల్యాతనయంభజామిసతతం శ్రీజానకీనాయకం. ౧౮

చ. మరకతముఖ్యరత్నసుషమాన్విత నిగ్రహుగౌసలేయుదు
ర్భరదనుజప్రహారురఘురాజ శిఖామణిజానకీమనో

హారుద్రిజగద్ధితున్శమదమాద్య ఖిలైకగుణాకరుఁ డసురే
శ్వరనుతురాజచంద్రుబుధవత్సలు ధార్మికునాశ్రయించెదన్. ౧౭

తా॥ మరకతరత్నాదులచే కాంతించుదేహంబుకలిగి సుందరమగుచేతులతో నొప్పుచు రాజశ్రేష్ఠుడై తేజంబుచే శత్రులగర్వంబు నణంచుచు లోకులనిష్టంబుచేయుచు దయానిధియై కౌసల్యకుప్రియపుత్రుండగు రామునినేనాశ్రయింతును. 18

శ్లో॥ రామంవీరాసనస్థం హృదయగతకరో దంచితజ్ఞానముద్రం
జానున్యాసక్తహస్తం క్షితివరతనయా భూషితంవామభాగే
షట్కోణేవ్యాహరంతం పవనసుతయుతం మానసే మానయంతం
సుగ్రీవేసేవమానేదృఢశరధను పాదతః లక్ష్మణేన. ౧౯

మ. శరచాపాన్వితమైనలక్ష్మణుడు నాత్మాప్తుత్రిపార్శ్వస్థుడై
కరమొప్పఁ రవిజనుడుగొల్వగను వాఖ్యానంబు సామీరిన్
పరషట్కోణనివాసియై తెలుపుసర్వజ్ఞఁ సువీరాసన
స్థిరుహృత్సంస్థితబోధ ముద్రకరుస్నిగ్ధోరుపరోజ్జ్వల
త్కరపద్ముఁ రఘురామచంద్రుమనసా కాంచన్విలోకింపుమా. ౧౯

తా॥ ధనుర్బాణంబులు ధరించి లక్ష్మణుండును అంజలిని ఘటించి సీతయుపార్శ్వభాములందుండ సుగ్రీవుఁడు సేవచేయుచుండహనుమంతుండు సమీపమున తత్వవ్యాఖ్యానముచేయుచు నిలచియుండ వీరాసనము వైచికొని జ్ఞానముద్రహృదయంబున ప్రకాశించియుండ నొప్పురాముని నాహృత్పద్మంబున గాంచుచున్నాను.

శ్లో॥ రామంసౌమిత్రిమిత్రం రఘుపతిమమలం రామచంద్రంరమేశం
రమ్యం శ్రీరాఘవేశం శుభలలితముఖం శుద్ధసత్వంసువీరం
సీతాసౌందర్యపాత్రం సురమునివినుతం నీరదేందీవరాభం
వందేవందారుపాలం రజనిచరహరం రమ్యకోదండరామం. ౨౦

శా. రాముఁ సత్యపరాక్రముఁ వరసుమిత్రాపుత్రమిత్రుఁ రఘు
స్వామిఁ భూమిసుతాధినాథుని బుధస్తవ్యుఁ బరేశున్బరం

ధామున్ రాఘవురాఘవు రామచంద్రునిసుధాధామాననున్
శ్యామున్ దైత్యవిరాముగార్ముకధరున్ సద్భక్తింగీర్తించెదన్. ౨౦

తా॥ సత్యపరాక్రముండును శుభలక్షణ యుతమగు మోము కలవాడును సీతసౌందర్యమునకు తగినవాడును దేవతలచే మునులచే పొగడ్తనొందినవాడును మంచిధనస్సు హస్తంబునుండి నల్లకలువలవంటినేత్రంబులతో నొప్పువాడు నగురామునిభక్తితో సేవింతును. 20

శ్లో॥ రామంచందనశీతలం క్షితిసుతామోహాకరంశ్రీకరం
వైదేహీనయనారవిందమిహిరం సంపూర్ణచంద్రాననం
రాజానం కరుణాసమేతనయనం సీతామనస్స్యందనం
సీతాదర్పణచారుగండలలితం వందేసదా రాఘవం. ౨౧

మ. పరశ్రీచందనశీతలున్ శుభకరున్ వైదేహిమోహాకరున్
ధరణీజాల సకంజహితు సీతామానసస్యందనున్
గరుణాసంయుతలోచను న్మిథిలరాట్కన్యామణీదర్పణ
సురదత్యున్నగండభాగు రఘువంశున్ రామునేవించెదన్. ౨౧

తా॥ మంచిగంధపుపోలిక చల్లదనంబు కలిగి భూదేవికిమోహంబును బుట్టించుచు నామె కన్నులనియెడి పద్మంబులకు సూర్యుని భాతిగనుపించుచు దయకల నేత్రంబులుకలిగి సీతాదేవి గండస్థలంబుల నుఅద్దములకు కాంతినొసంగు రాముని సేవింతును. 21

శ్లో॥ రామంశ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యందివ్యాస్త్రపాణింశరముఖశరధి చారుకోదండహస్తం
కాలంకాలాగ్నిరుద్రం రిపుకులదహనం విఘ్నవిచ్ఛేదదక్షం
భీమంభీమాట్టహాసం సకలభయహరం రామచంద్రంభజేహం.

మ. శరచాపోజ్జ్వలహస్తుశత్రుకుల నిస్తారున్సహస్రాంశుకో
టీరమాభ్రాజితు శోషణుని కోటీరార్కచంద్రార్కభా

స్వైరదక్షద్వయువిఘ్నసంహారు ఘనశ్యామాంగున్ మాట్లహో
సరసోద్దీపితుసాద్వసావహరఘుస్వామిన్ మదిఁ భజింతున్.

తా॥ చామనచాయయు సూర్యచంద్రులు నేత్రములుగను దివ్యాస్త్రంబులు చేతులందుకలవాఁడును ధనస్సు హస్తమందుకలవాడును కాలాగ్ని రుద్రుండును శత్రువులకు నగ్నివంటివాఁడును నగురాముని సేవింతును. 22

శ్లో॥ రామచంద్రచరితాకథామృత లక్ష్మణాగ్రజగుణానుకీర్తనం
రాఘవేశతవపాదసేవనం సంభవంతుమమజన్మజన్మని. ౨౩

ఉ. రామభవత్కథామృతము రమ్యతగ్రోలగనామతకీర్తనల్
ప్రేమనొనర్పనీదు గుణలీలలుసంస్మరణంబు సేయమే
ధామతినీదుపావన పదద్వయసేవయొనర్చునట్లుగా ౨౩
మానకజన్మజన్మముల మానకకృపనిమ్మువేడెదన్.

తా॥ ఓరాముడా ; నీకథలమృతము వంటివనియు నీలీలలు నీకీర్తనలు పాపంబులను హరించునని మానకనన్నిజన్మంబులందు నిన్నే సేవింతును. 23

శ్లో॥ రామోమత్కులదైవతంసకరుణం రామంభజేసాదరం
రామేణాఖిలఘోరపాపనిహతం రామాయతస్మైనమః
రామాన్నాస్తిజగత్త్రయైకసులభో రామస్యదాసోస్మ్యహం
రామేప్రీతిరతీవమేకులగురో శ్రీరామరక్షస్వమాం. ౨౪

ఉ. రాముడభీష్టదైవత సురామునిభావనజేయుచుందు శ్రీ
రామునిచేతిమద్దురితరాసు లడంగునురామభర్తకే
న్నేమనమస్కరింతు రఘువీరునికంటె బరంబులేదు శ్రీ
రామునకేనుదాసుడను రామునియందున భక్తినాకగున్. ౨౪

తా॥ రాముడు నాకులదేవత. నేను రాముని సేవింతును. రాముని చేనన్ని పాపంబులును మాసిపోవును. రామునికొఱకువందనము. రా

మునికంటె సులభుడు మూడులోకంబులందును లేడు. నేను రాముని యొక్క దాసుడను. రామునియందు నాకెంతేని ప్రేమకలదు. అతడే నన్నురక్షించును. 24

మూ. శ్రీరామచంద్రవరకీర్తిసురద్రుమస్య । తారాగణస్సుమనసః
ఫలమిందుబింబం । మూలంఫణాఫణిగతం గగనంచమధ్యం
శాఖాదిశో భువనమండలమాలవాలం. ౨౫

ఉ. రాముని కీర్తికల్పకము రమ్యసుమంబులు తారకల్సుధా
ధాముడుతత్ఫలంబు విధితంబగుశాఖలు దిగ్వితానము
ల్భూమితనాదిభోగవతి మూలముమధ్యముపుష్కరంబగున్
రామునుతింప నేరికిదరంబు కరంబతిభక్తిగొల్చెదన్. ౨౫

తా॥ ఎవనికీర్తి కల్పవృక్షము వంటిదిగనుండి నక్షత్రములు పూలుగనుండి చంద్రబింబము ఫలముగానుండి దిక్కులు శాఖలుగనుండి మొదలు పాతాళంబును మధ్యము ఆకాశముగనుండి ప్రకాశించునో ఆరాముని నుతింపనేరికిని శక్యంబుకాదు. 25

మూ. వైదేహీంముదితోభిజాతపులకాం గాఢంసమాలింగయ
వామేనస్తనచూచుకంపులకితం వామాంకరేణస్పృశ
తత్త్వందక్షిణపాణినాకలితయా చిన్ముద్రయాబోధయ
రామోమారుతిసేవితస్మరతుమాం సామ్రాజ్యసింహాసనే. ౨౬

శా. సీతన్మోదమునొందవామకర సంశ్లేషంబుగావింపుచున్
బ్రీతిన్ దక్కుచమంటిదక్షిణపు పాణిదత్వముందెల్పుచు
న్వాతోత్పన్నునిసేవగైకొనుచు నానందంబునన్ లోకవి
ఖ్యాతిన్ పంచముఖాసనస్థుడగురామాధీశు బ్రార్థించెదన్. ౨౬

తా॥ ఎవడు సీతనెడమచేతితో కౌగలించుకొనుచు కుడిచేతిని పులకరించిన సీతచను మొనలమీదనుంచి హనుమంతుని సేవనందుచు

నానందముతో సామ్రాజ్యసింహాసనంబుననుండునో ఆరాముని సదా ప్రార్థింతును. 26

మూ. వామాంకస్థితజానకీపరిలస త్కోదండదండంకరే
చక్రంచోర్ధ్వకరేణబాహుయుగళే శంఖంశరందక్షిణే
బిభ్రాణంజలజాతపత్రనయనం భద్రాద్రిమూర్ధ్నిస్థితం
కేయూరాదివిభూషితంరఘుపతిం రామంభజేశ్యామలం. ౨౭

మ. శరచాపాబ్జరథాంగమల్కర చతుష్కప్రాప్తమైయుండ సు
స్థిరవామాంకమునందుసీతనియతిన్ సేవింపభద్రాద్రిపై
నిరవైనట్టిసరోజనేత్రుఁబరు యోగీంద్రేంద్రసంస్తోత్రుభా
సురకేయూరవిభూషణున్దలచెదన్ శుద్ధాంతరంగంబునన్. ౨౭

తా॥ నాలుగుచేతులందును శంకచక్రగదాపద్మంబులుండి సీత యెడమవైపున నొయ్యారముగ గూరుచుండ భద్రాద్రియందు వసించుశ్రీరామచంద్రుని నాహృదయంబున సేవింతును. 27

మూ. వామేభూమిసుతాపురస్తుహనుమా న్పశ్చాత్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నోభరతశ్చ పార్శ్వదళయోర్వాయ్వాదికోణేషుచ
సుగ్రీవశ్చవిభీషణశ్చయువరాట్ తారాసుతోజాంబవాన్
మధ్యేనీలసరోజకోమలరుచిం రామంభజేశ్యామలం. ౨౮

మ. తనవామాంకమునందుసీత చెలువొందన్ వెన్కసౌమిత్రిపా
వనియున్ ముంగళ శత్రుఘాతిభరతుల్ పార్శ్వంబులన్ భానునం
దనసీలాంగదముఖ్యులన్యమగు దిక్స్థానంబులందుండగా
ఘననీలాంగుడ దంతరస్థితుమదిఁ గాంచింతురామప్రభున్. ౨౮

తా॥ ఎడమవైపున సీతయు ముందుహనుమంతుడును వెనుక లక్ష్మణుండును భరతశత్రుఘ్నులు రెండువైపులను మధ్య సుగ్రీవ విభీషణాంగద జాంబవంతులును నుండ వైభవముననుండు రాముని సేవింతును. 28

మూ. వైదేహీ సహితంసురద్రుమతలే హైమేమహామంటపే
మధ్యేపుష్పకమాసనేమణిమయే వీరాసనేసుస్థితం
అగ్రేవాచయతిప్రభంజనసుతే తత్వంమునిభ్యఃపరం
వ్యాఖ్యాతంభరతాదిభిఃపరివృతం రామంభజేశ్యామలం. ౨౯

ఉ. భాసురకల్పమూలమున భర్మగృహంబున బుష్పకాంతరో
పాసితనూత్నరత్నమయ పంచముఖాసన మందుముఖ్యనీ
రాసనుడై సతీసహితుడై పరతత్వము సోదరాన్వితుం
డై సరసన్మరుత్సుప సమర్చితుడైన విభుకా భజించెదన్. ౨౯

తా॥ కల్పవృక్షంబు మొదట బంగారుమండపమున మణిమయాసనమున వీరాసనంబువై చికొని భార్యయు భరతాదిసోదరులును గొలువ హనుమంతుడు కొనియాడుచుండ మునులయెదుట పరతత్వ వ్యాఖ్యానముచేయు రాముని సేవింతును. 29

మూ. వైదేహీంపరిరభ్యజాతపులకాం లజ్జావతీంసుస్మితాం
కాంచీనూపురహారకంకణల సత్కర్ణావతంసోజ్వలాం
కస్తూరీఘనసారచర్చితకుచాం చంద్రాననాంశ్యామలం
కందర్పాధికసుందరం రఘుపతిం శ్రీరామచంద్రంభజే. ౩౦

చ. దరహసితాననున్ బులకితన్ ఘనసారమృగీమదాగరు
స్ఫురదనులేపనన్ గనకభూషణ భూషితబాణచంద్రచం
ద్రికవదనన్ విదేహనిసుతన్ మదిరంజిల్లగఁజేయునట్టికం
ధరసమవర్ణునంగజ శతప్రతిమానుని రామునెన్నెదన్. ౩౦

తా॥ చిరునవ్వుమొగంబున వెలయు మంచిగంధాదులను శరీరమునసలదుకొని బంగారునగల నొడలనలంకరించుకొని సీతకు మోదంబుగూర్చు రాముని సేవింతును. 30

మూ. వైదేహీరమణంవిభీషణవిభుం విష్ణుస్వరూపంహరిం
విశ్వోత్పత్తివిపత్తిపోషణకరం విద్యాధరైరర్చితం

వైరిధ్వంసకరంవిరించిజనకం విశ్వాత్మకంవ్యాపకం
వ్యాసాంగీరసనారదాదివినుతం వందామహేరాఘవం.

చ. జనకసుతాధినాథుఁపుజైత్రు సురార్చితవిశ్వవిశ్వసం
జననవినాశకారణప్రశస్తచరిత్రు విభీషణావనున్
సనకసనందనాద్యఖిల సన్మునిసన్మనివిష్ణురూపునిఁ
వనరుహసూతితండ్రి రఘువర్యుహరిన్ శరణంబువేఁడెదన్.

తా॥ విభీషణప్రభుండును ప్రపంచముఁ పుట్టించుట
చుటకు నశింపుచేయుటకు కారకుండును విద్యాధరపూజితుండ
సాదులచేఁగొనియాడబడువాఁడును నగురామచంద్రునిశరణంబువే

సూ. మైథిల్యానగరేవివాహశమయే కల్యాణవేద్యంతరే
సామంతేవిమలేందురత్నఖచితే పీఠేవసంతౌశుభే
శృణ్వంతౌనిగమార్థవేదవిదుషా మాశీర్గిరోరాజితౌ
పాయాస్తాంసు వధూవరౌరఘుపతీ శ్రీజానకీరాఘవౌ.

చ. పరిణయవేళ మైథిలనృపాలగృహాంతర రత్నవేదికన్
సురుచిరవేదవిద్బుధను సూక్తులువించుసమంచితంబుగా
పరగవధూవరత్వమున భాసిలిభూవర సేవ్యులైనయా
ధరణిసుతారఘూద్వహులు దారమతిన్ మముఁబ్రోతురెప్పు

తా॥ వివాహకాలమున యేపుణ్యాత్ములు జనకమః
గృహంబునందలి రత్నంపుటరుగునందు వేదవాక్కులను వినుచు
వరులను పేర్లతో రాజులచే సేవింపబడిరో యాసీతారాములు
రక్షింతురుగాక.

శ్లో॥ అసితకమలభాసా భాసయంతంత్రిలోకం
దశరథకులదీపం దైవతాంభోజభానుం
దినకరకులబాలం దివ్యకోదండపాణిం
కనకఖచితరత్నాలంకృతం రామమీడే.

మ. ఘననీలాంబుదవర్ణదేహు భువనైకభ్రాజితున్ దేవతా
వనజాతాంబుజమిత్రమిత్రకుల భాస్వత్కీర్తిసాంద్రు శరా
సన బాణోజ్జ్వలహస్తు రత్నవిలసత్సౌవర్ణసద్భూషణున్
మునిసంస్తోత్రచరిత్రు దాశరథిరాముం గొల్తునెల్లప్పుడున్ 33

తా॥ నల్లనిమేఘమువంటి శరీరంబుకలవాడును మూడులోకంబులందు ప్రకాశించువాడును దశరథుని వంశమునకు దీపమువంటివాడును సూర్యవంశమునకు వృద్ధినిదెచ్చినవాడును హస్తమున దివ్యశరంబులున్నవాడును బంగారు నగలను ధరించి వెలయువాడునగు రాముని సేవింతును. 33

శ్లో॥ సుస్నిగ్ధంనీలకేశం స్ఫుటమధురముఖం సుందరభ్రూలలాటం
దీర్ఘాక్షంచారునాసాపుట మమలమణిశ్రేణికాదంతపంక్తిం
బింబోష్ఠంకంబుకంఠం కఠినతరమహోరస్క మాజానుబాహుం
ముష్టిగ్రాహావలగ్నంపృథుజఘనముదారోరుజంఘాంఘ్రియుగ్మం 34

ఉ. చారువిశాలనేత్రు విలసన్మధురానను నీలకేశు శృం
గారలలాటదీర్ఘకరుఁ గంబుగళున్ రమణీయనాసికుం
గ్రూరభుజాంతరున్ సరస కుందరదున్ దనుమధ్యసుందరుం
సారసనైకతాంఘ్రి విలసజ్జఘనునున్ రఘురాముఁగొల్చెదన్. 34

తా॥ విశాలమైన నేత్రంబులును తియ్యనిమాటలును నల్లనికేశంబులును చక్కని నుదురును పొడవగు చేతులును శంఖమువంటి కంఠంబును నందమగు ముక్కు తెల్లనిపండ్లునుసన్ననినడుము రంభాతరువులవంటితొడలును పద్మంబులవలెనున్న పాదంబులునుకలిగియుండురాముని స్తుతించెదను. 34

శ్లో॥ వందామహేమహేశానచండకోదండఖండనం
జానకీహృదయానంద చందనంరఘునందనం. 35

చ. జలనిధివేష్టితాఖిలరసాభృదహీంద్ర విభూషణాది కో
జ్జ్వలహారచాపఖండన విశాలభుజాబలశాలికిం దయా

జలధికిభూమిజాహృదయ సారసహేళికిశిలికిన్మహా
బలతనయార్చితాంఘ్రినవపద్మునకుం శరణంబొనర్చెదన్. ౩౪

తా॥ సమస్తభూషణంబులును కలిగి మహాద్దండ కోదండ
ముండి సీతహృదయంబునకు నిరంతరము చల్లదనంబు నిచ్చురఘునంద
నుడే నాకురక్షకుడు. 35

శ్లో॥ జానాతిరామతవనామరుచిర్మహేశో జానాతిగౌతమసతీ
చరణప్రభావం। జానాతిదోర్బల పరాక్రమ మీశచాపో
జానాత్యమోఘపటుబాణగతింపయోధిః. ౩౬

ఉ. తారకనామమంత్రరుచిదక్షుతారమణుండెఱుంగునీ
పావనపాదపంకజ ప్రభావమహల్యయెఱుంగుమిక్కిలిన్
దేవరదోర్బలంబు శివదేవునిచాప మెఱుంగునీదు మే
ధావిభవంబుగల్గు శరధాటిసముద్రుఁడెఱుంగురాఘవా. ౩౬

తా॥ ఓరామచంద్రా; నీనామమహాత్వమును శివుండును నీ
పాదవిధత్రత నహల్యయు నీభుజబలంబును శివధనువును నీబాణముల
మహాత్వము సముద్రుండును యెఱుంగుదురుగాని యితరులెరుగరు. అ
ట్టినిన్ను నేగొలుతును. 36

శ్లో॥ దివ్యస్యందనమధ్యగంరణరణచ్చాపాన్వితంభీషణం
కాలాగ్నిప్రతిమానబాణకలితం ఘోరాస్త్రతూణీద్వయం
సుగ్రీవాంగదరావణానుజమరుత్పుత్రాదిసంసేవితం
రామంరాక్షసవీరకోటిహరణం రక్తాంబుజాక్షంభజే. ౩౭

శా. శౌర్యస్యందనమధ్యగుఁ రణరణచ్చాపాన్వితున్ రాఘవున్
ఘోరాగ్నిప్రతిమానబాణకలితున్ గ్రూరాస్త్రతూణీద్వయున్
శూరాత్మోద్భవరావణానుజమరుత్సూనాదిసంసేవితున్
వీరున్రక్తసరోజనేత్రుహతవిద్వేషున్ బ్రశంసించెదన్. ౩౭

తా॥ గొప్పరథంబుమధ్యచేత ధనువునుంచుకొని కాలాగ్నివలె

శత్రుఘ్నులకుగానంబడుచు సుగ్రీవాంగద విభీషణహనుమంతులు చుట్టు
కొలువ రాజ్యసముహకను చెండాడురామునికీర్తించెద. 37

మూ. బ్రహ్మాద్యామరసిద్ధజన్మభువనం యన్నాభిపంకేరుహాం
శ్రీనిర్వాణనికేతనంయదుదరం లోకైకశయ్యాగృహాం
యఃకమలాక్షవిలాసభావభవనం యన్నామమంత్రంసదాం
వాసాగారమఖండమండలనిధిః పాయాత్సనోరాఘవ. 3౮

ఉ. ఎవ్వడనాదిపద్మమున రహి న్విధిముఖ్యుల జన్మకారణం
బెవ్వని వక్షమిందిరకు నింపగునట్టి విలాసమందిరం
బెవ్వడుముక్తికిన్న దనమెవ్వఁడ శేష జగద్విధాయకుం
డెవ్వనినామమెంతురు మునీశ్వరులా రఘురాముగొల్చెదన్. 3౮

తా॥ ఎవని నాభికమలంబు బ్రహ్మాదుల జననంబునకు కారణ
మో యెవనివక్షస్థలంబున లక్ష్మి నివాసముండునో యెవడు ముక్తికి
సదనమో యెవని నామమును మునులు నిరంతరము స్మరింతురో యా
రఘురామునే నేను సేవింతును. 38

శ్లో॥ శృంగారక్షితినందనీని వారణేవీరంధనుర్భంజనే
కారుణ్యంబలిభోజనేద్భుత రసంసింధౌగిరిస్థాపనే
హాస్యంశూర్పణఖాముఖే భయనుఘేభీభత్సమన్యాముఖే
రౌద్రంరావణమర్దనేమునిజనే సాంతంవపుఃపాతునః. 3౯

మ. ధరణీపుత్రి మునీంద్ర శంకర ధనుర్దైత్యారిలంకాపురీ
శ్వరవైరోచనరావణాదులకు స్సాధారణపౌర్షిచే
వరశృంగారముశాంతవీరభయ భీభత్సాద్భుతోగ్రంబు
గరుణాహాస్యరసంబులుప్పతిలురాడ్గాత్రంబు భావించెదన్. 3౯

తా॥ ఎవనిదేహము సీతకు శృంగారరసంబును శివధనువునకు
వీరరసంబును సుగ్రీవునకు కరుణారసంబును సముద్రున కద్భుతరసం
బును గిరిస్థాపనకు హాస్యరసంబును శూర్పణఖముఖంబునకు భయా

నకరసంబును శత్రువులకు భీభత్సరసంబును రావణునకు రౌద్రరసంబును మునులకుశాంతరసంబును కలిగింపజేసెనో యట్టిరాముని దేహంబును నామదిలో నెంతును. 39

శ్లో॥ మాతారామోమత్పితా రామచంద్రో భ్రాతా రామో మత్సఖారాఘవేశః। సర్వస్వంమే రామచంద్రోదయాళుః నాన్యందైవం నైవజానేనజానే.

ఉ. రాముఁడుతండ్రి మజ్జనని భ్రాతయు రాముచంద్రుఁడే
రాముఁడెమిత్రుఁడుంగురుడు రాముఁడెసర్వధనంబు రాముడే
రాముఁడెసత్కృపాకరుఁడు రామునితోసరియన్యదైవమున్
వేమరులేదులేదనుచు వేఁడ్కభజించెద నిష్టసిద్ధికిన్. ౪౦

తా॥ రామా ! నీవేనాకు తండ్రివి. తల్లివి. అన్నవు. స్నేహితుడవు. గురుడవు. ధనంబవు. నీవేనాయందుదయకలవాడవు. యితరదైవముల నేసేవింపకసదానిన్నే సేవించి నాకోరికలనెరవేరుచుకొందును. 40

శ్లో॥ మూలేకల్ప ద్రుమస్యాఖిలమణి విలసద్రత్నసింహాసనస్థం కోదండద్వంద్వభాస్త్రైః కలితకరయుగేనార్పితం లక్ష్మణేన వామాంకన్యస్తసీతం భరతధృతమహామాత్తికచ్ఛత్రకాంతిం శత్రుఘ్నంచామరాభ్యాం విలసితమనిశం రామచంద్రం భజేహం.

చ. సురతరుమూలమందు మణిశోభిత పీఠనిసీతతోవసిం
పరహిసుమిత్రపుత్రకుఁడుమార్గణచాపము లందియివ్వఁగా
భరతుడుపుండరీకము శుభస్థితిఁదాల్పఁగఁశత్రుఘాతిచా
మరలనువీవఁజెన్నగు సమస్తజకత్ప్రభు రామునెన్నెదన్. ౪౧

తా॥ కల్పవృక్షముమొదట రత్నపీఠముననుండి లక్ష్మణుడుధనస్సునుచేతికీయగా భరతుడు తెల్లగొడుగుపట్ట శత్రుఘ్నుడు వింజామరవీవగా సీతయెడమవైపుననుండగా ప్రకాశించురాముని సదా స్మరింతును. 41

శ్లో॥ వామే కోదండదండం నిజకరకమలే దక్షిణే బాణమేకం
పశ్చాద్భాగే చ నిత్యం దధత మభిమతం సానుతూణీరభారం
వామే వామే లసద్భ్యాం సహమిళితతనుం జానకిలక్ష్మణాభ్యాం
రామం స్యామం భజేహం ప్రణతజనమనః ఖేదవిచ్ఛేదదక్షం. ౪౨

మ. ఇరుగడలందు లక్ష్మణమహీసుతలుం జెలువొందఁ దూణము
న్శరము శరాసనంబు వరుసన్గరమౌంగ కరంబులందు వి
స్ఫురతం దనర్చ భక్తజన పుంజవిపద్ధరుఁడయిన రామభూ
వరుఁడు జగద్గురుండు భగవంతుఁడనంతుఁడు నన్నుఁ బ్రోవుతన్. ౪౨

తా॥ రెండువైపుల సీతాలక్ష్మణులుండి ధనుర్బాణంబులు రెండు హస్తంబులనిండుచేయ భక్తులకష్టముల వారింపనుండు రాముఁడే నన్ను రక్షించును. 42

శ్లో॥ అంభోధరశ్యామళమంబుజాక్షం । ధనుర్ధరం వీరజటాకలాపం
పార్శ్వద్వయే లక్ష్మణమైథిలీభ్యాం। నిషేవ్యమాణం ప్రణమామి రామం

మ. శరదశ్యామల గాత్రు పార్శ్వయుగళస్థానావనీజానుజుం
గురుతామ్రాంశుజటాకలాపు విలసత్కోదండ హస్తన్సరా
త్పరుఁ బంకేరుహపత్రనేత్రుఁ గరుణాపాత్రున్సుధస్తోత్రు ఖే
చరసత్పుత్రు సురారిజైత్రు రఘువంశస్వామి గీర్తించెదన్. ౪౩

తా॥ మేఘమురీతి నల్లనైన దేహమును పద్మములవంటి కన్నులును ధనువుతోఁ గాంతించు చేతులును రెండువైపుల సీతాలక్ష్మణులును సేవింపనుండు రాముని సేవింతును. 43

శ్లో॥ కోదండదీక్షాగురుమప్రమేయం సలక్ష్మణం దాశరథిం దయాళుం
ఆజానుబాహుం జగదేకవీరమనాథనాథం రఘునాథమీడే. ౪౪

మ. గురుకారుణ్యపయోనిధాను విలసత్కోదండదీక్షాగురు
న్వరకల్యాణగుణాకరున్సుభకరున్వైదేహిసంయుక్తుదా

శరధిన్ లక్ష్మణసేవ్యునార్తజన రక్షాదక్షుదీక్షాకరు
స్ఫురునాజానకరుఁ జగద్గురుహరిన్ భక్తిన్ ప్రశంసించెదన్. ౪౪

తా॥ గొప్పధనుర్విద్య నెఱింగినవాఁడును లక్ష్మణసహితుండును దశరధునికులంబునకు మణియు కరుణాలవాలుండును మోకాలివఱకు వ్రేలాడు బాహువులుకలవాఁడును జగదేకవీరుండును దీనులకుదిక్కగు వాఁడునగు రాముని సదాసేవింతును. 44

శ్లో॥ కర్పూరాంగవిలేపనంరఘువరం రాజీవనేత్రం ప్రభుం
కస్తూరీనికరాకృతింఖరధృతి ప్రధ్వంసినంశ్రీహరిం
కందర్పాయుతకోటిసుందరతనుం కామారిసేవ్యంగురుం
కాంతాకామదమప్రమేయ మమలంసీతాసమేతంభజే. ౪౫

మ. ఘనకర్పూరవిలేపనున్ రఘువరుం గామారిసేవ్యున్ఘనా
ఘనగాత్రు న్సరసిజనేత్రుఖరరక్షః ధ్వంసరాముున్సనా
తనుఁగందర్ప శతోనిమాకృతినిగాంతాకామదున్ శ్రీహరి
న్జనకక్ష్మారమణాసుతాననసరోజా తార్కుభావించెదన్. ౪౫

తా॥ శరీరమున కర్పూరములదుకొని రఘువంశమునకు మణి యుపద్మనేత్రుండును కోటిమన్మథుల సౌందర్యమువంటి యందము కలవాఁడును ఖరాసురుని జంపినవాఁడును శివునిచే సేవింపబడువాఁడును సీతముఖపద్మమునకు సూర్యుని వంటివాఁడునునగు కాంతలకుకామముల రెట్టించు వాఁడును నగురామునిసేవింతును. 45

మా. నీలాభ్రబృందసదృశంపరిపూర్ణ దేహం దిక్పాలకాది
సురసేవితపాదపద్మం । పీతాంబరం కనకకుండలశోభి
తాంగం సీతాపతింరఘుపతిం సతతంభజామి. ౪౬

మ. మృగనాభీనిభసుందరాంగు భవన్మిత్రున్ బవిత్రుఁ లస
న్నిగమాంతార్థవిచారవర్యురత వాణీనాథుంబీతాంబరున్
దిగధీశానముఖామరావరుని ధాత్రీపుత్రికాధీశ్వరుఁ
భగవంతున్మణిమండలాభరణు సంభావింతునశ్రాంతముఁ. ౪౬

తా॥ నల్లనమేఘకళవంటి దేహంబుకలిగి యష్టదిక్పాలకులు పాదంబులొత్త బంగారుకుండలములతో పీతాంబరముతోను వైచవంననుండు రామచంద్రునే నిరంతరము సేవింతును. 46

మూ. భర్గబ్రహ్మసురేంద్రముఖ్య దివిజప్రాంచత్కిరీటగ్రసం
సర్గానేకమణిప్రభాకరసహస్రాభంపదాంభోరుహా
దుగానసంతతసంస్తుతాంఘ్రికమలం దుర్వారకోదండినం
గంగావిస్ఫుటమౌళిమానసహరం కళ్యాణరామంభజే. ౪౫

శా. భర్గాంభోజభవేంద్ర ముఖ్యదివిజప్రాంచత్కిరీటాగ్ర సం
సగానేకమణిప్రభాకర సముంచత్పాదపంకేరుహున్
దుగానసంతతసన్నుతాంఘ్రియుగళున్ దోషావహున్ మానిరా
డ్వర్గప్రస్తుతుశంభుమానసహరున్ వైకుంఠుఁబ్రార్థించెదన్. ౪౭

తా॥ బ్రహ్మయు శివుడు యింద్రుడు మొదలగు దేవతల కిరీటములందలి మాణిక్యములచే సేవింపబడు పాదంబులును సీతచే నొత్తబడు పాదపద్మంబులును కలిగి యీశ్వరుని మానసమును హరించిన రాముని సేవింతును. 47

మూ. అగ్రేప్రాంజలిమాంజనేయమనిశం వీరంచతారాసుతం
పార్శ్వేపంక్తిముఖానుజంపరిసరే సుగ్రీవముగ్రాసనే
పశ్చాల్లక్ష్మణమంతికేజనకజాం మధ్యేస్థితం రాఘవం
చింతాతూలికయాలిఖంధితినుయశ్చిత్తేషుపీతాంబరం ౪౮

చ. పవనజుడంగదుండెదుటఁ బ్రాంజలులై వినుతింపఁజెంగటన్
రవిసుతరావణానుజులు రంజిలఁ వెన్కసుమిత్రసూతితా
నివసుతుడై చెలంగ నవనీసుతుడావల నుండసింహపీ
ఠివెలయుభాతినెప్పుడుజటీహృదయోజ్జ్వలు రామునెన్నెదన్. ౪౮

తా॥ హనుమదాంగదులు యెదుటదోసిలి మోడ్చి నిలచియుండగా సుగ్రీవ విభీషణులు వెనుకవైపున నుండగా లక్ష్మణుడు

సమీపమున నుండగా సీత వెంటనంటి యుండ సింహపీఠముననుండు రాముని గొల్చెదను. 48

శ్లో॥ క్షీరాంభోనిధిమధ్యవర్తినిసితే ద్వీపేసువర్ణాచలే
రత్నోల్లాసితకల్పభూరుహతలే జాంబూనదేమంటపే
తేజోభ్రాజితవేదికేసురుచిరే మాణిక్యసింహాసనే
హేమాంభోరుహకర్ణికోపరితలే వీరాసనస్థంభజే. ౪౯

మ. తెలిదీవిం గనకాద్రిదుగ్ధనిధి సుద్దీప్తామనోకహ
స్థలజాంబూనదమంటపంబునవిభాస్వద్వేది కారుజితో
జ్జ్వలసింహాసనజాతరూపముయకం జాతస్ఫురత్కర్ణికా
స్థలిశ్రీరాసనయుక్తుడైన రఘువంశస్వామింగీర్తింంచెదన్. ౪౯

తా॥ పాలసముద్ర మధ్యమున తెల్లనిదీవియందు సువర్ణపర్వత మున రత్నములచే కాంతించు కల్పవృక్షముల మొదటజాంబూనద మండపమునందలి యరుగుపైనున్న మాణిక్యసింహాసనమున వీరాసనంబుననుండు రాముని సేవింతును. 49

శ్లో॥ దోర్దండైకక మండలీకృతమహాకోదండచండాశుగై
ర్నిర్ఘాతై రవికోటితుల్యవిశిఖై ర్బ్రహ్మాది ము ఖ్యైస్తుతైః
సుగ్రీవాదిసమస్తవానర వరానాజ్ఞాపయంతంగిరా
తత్వంతాడయతాడయేత్యనుపదం శ్రీరామచంద్రంభజే. ౫౦

మ. కరదండంబునమండలీకృతమహాకాండాసనోన్ముక్తభా
స్వరకోటిప్రకటప్రభానిశిత నిర్ఘాతంబులై పద్మజా
మరసంస్తోత్రములయినబాణములచే మర్దింపుదుర్వేగవా
నరసంఘంబులతోడదైత్యవరులన్ మర్దింపుమర్దింపు మం
చురయంబొప్పగదెల్పురామ వసుధీశుండిచ్చునిష్టార్థముల్. ౫౦

తా॥ ఏపుణ్యమూర్తి తనహస్తమునందు కాంతించు ధనువు నందలి బాణంబులచే రాక్షసులను జంపుచు హనుమదాది వానరులకు

త్వరగా చంపుడుచంపుడని చెప్పుచుండెనో యారాముని నేను సేవింతును

శ్లో॥ భూకంపంజనయన్నభోవిదళయన్నంభోనిధింక్షోభయన్
దైతేయాంశ్చవిమర్దయన్ గిరివరాన్ భిందన్ దిశంపూరయన్
వైదేహీంమతిమోదయన్ సకల గీర్వాణాన్ శిరఃకంపయన్
కల్యాణోరఘురామబాణవిలసత్కోదండచండధ్వనిః. ౫౧

ఉ. రాముని చాపమౌర్విశుభదావమునన్ తలలూపు దేవతా
స్తోమముదైత్యులాత్మగని సోలుదురబ్ధులు మ్రోయుమైథిలీ
భామినిసంతసించుపడి బ్రద్దలగున్ వసుధాధరంబులున్
భూమిజలించునంబరము బూరటిలున్ దిశలెల్లఘూర్ణిలున్. ౫౧

తా॥ ఎవని చేతియందలి ధనుస్సుయొక్కధ్వని భూమినికంపింప జేయుచు నాకాశమును బ్రద్దలగొట్టుచు సముద్రమును క్షోభింపజేయుచు రాక్షసుల కాశ్చర్యముగొల్పుచు దేవతలకు వింతసేయుచు సీతను సంతోషపెట్టుచు దిక్కులనిండించుచు పర్వతముల బడగొట్టుచుండునో యారాముని సేవింతును. 51

శ్లో॥ విమలకమలనేత్రం విస్ఫురన్నీలగాత్రం
తపనకులపవిత్రం దానవధ్వాంతమిత్రం
భువనశుభచరిత్ర భూమిపుత్రీకళత్రం
దశరథవరపుత్రం నౌమిరామాఖ్యమిత్రం ౫౨

చ. సరసిజపత్రనేత్రుసురశాత్రవజైత్రుపతత్రిపుత్రునిన్
ధరణిసుతాకళత్రుజనతానుతిగాత్రుని రాజపుత్రభా
సురచరిత్రు నీలమణి శోభితగాత్రు మహేశమిత్రుభా
స్కరకులసత్పవిత్రుగుణసాంద్రు రఘూద్వహునాశ్రయించెదన్.

తా॥ విడిచిన తామరరేకులవంటి కన్నులును నల్లనిదేహంబును గలిగి సూర్యకులమున కలంకారమై లోకములోని కెల్ల శుభచరిత్రకలిగి సీతకుభర్తయై దశరథపుత్రుడైన రామునికివందనము. 52

శ్లో॥ జననీజానకీసాక్షాజ్జనకో రఘునందనః
లక్ష్మణో మిత్రమస్మాకం కోవిచారః కుతోభయం
జననీ రామచంద్రో మే జననీజనకాత్మజా
హనుమత్ప్రముఖా స్సర్వే హరయో మమబంధవః. ౫౩

చ. జనకుడు రామచంద్రుడగు జానకితల్లిసుమిత్రసూతిమా
కనయముమిత్రుండంగద మహాబలపుత్ర విభీషణార్కనం
దనముఖులాత్మబాంధవ జనంబులుగాననిచారముక్ భయం
బునుకలుహంబుదీనతయు బొందునే మానక మానసంబునన్. ౫౩

తా॥ రాముడు నాకుతండ్రి. సీతతల్లి. లక్ష్మణుడున్నేహితుడు. హనుమద్విభీషణాంగద సుగ్రీవులు బంధువులు. నాకెందునుభయంబు లేదు. 53

శ్లో॥ జగతివిశదమంత్రంజానకీ ప్రాణమంత్రం
విబుధవినుతమంత్రం విశ్వవిఖ్యాతమంత్రం
దశరథసుతమంత్రం దైత్యసంహారమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రం. ౫౪

చ. సకలజగత్పవిత్ర మునిశారచజైత్రము ధారుణీసుతా
ధికప్రదమప్రదం బఖిలదిక్పరిపాలనా పాలనంబునే
వకజనకల్పకంబు భయవారణకే సరోపమం
బకలుషమద్వితీయమఖిలార్తిన్ విరామము రామమంత్రమున్.

తా॥ లోకమున ప్రసిద్ధినొంది సీతకుప్రాణమై దేవతలచే పొగడ్తనుండి జగంబులనెల్ల నిండియుండి రాక్షసులకు నాశంకారమైన రామమంత్రమును నేజపింతును. 54

శ్లో॥ సీతాయాదక్షిణే పార్శ్వేలక్ష్మణస్యచ పార్శ్వతః
తన్మధ్యే రాఘవంవందే ధనుర్బాణధరంహరిం
చంద్రోపమంమలయచందన చర్చితాంగం
మందారపుష్ప పరిపూజిత పాదపద్మం. 55

బ్రహ్మేంద్రవంద్యమనిశంమునిబృందసేవ్యం
వందేరవిందనయనం రఘురామచంద్రం. ౫౫

చ. సరసవిదేహరాజతను సంభవలక్ష్మణయుక్తుదేవతా
తరుసుతపూజితాంఘ్రి నవతామరసద్వితయున్ సరస్వతీ
శ్వరసుర వర్యమానిజన వందితుఁజనచ్చితుఁ లస
ద్గురుశరచాపధారణురఘూద్వహు రాముని నెంతు నెంతయున్.

తా॥ సీతను గుడివైపునను లక్ష్మణుం డెడమవైపునను౦డ ధనుర్ధరుడై శరీరమునకు కర్పూరముపూసికొని బ్రహ్మాదులకు వందనీయుడైన రఘురాముని సేవింతును. 55

శ్లో॥ ఇక్ష్వాకునందనంసుగ్రీవపూజితంత్రైలోక్యరక్షకంసత్యసంధంసదా
రాఘవంరఘుపతింరాజీవలోచనంరామచంద్రంభజేరాఘవేశంభజే.

మ. మనువంశాంబుధి పూర్ణచంద్రు రఘురామస్వామిఁ త్రైలోక్యపా
వనుసుగ్రీవసమర్చితాంఘ్రికమలున్ లక్ష్మీధరున్ సత్యసం
ధునికంజాయతనేత్రువీరరఘునాథున్ రాఘవున్ రామచం
ద్రునిభక్తాంగనకల్పకంబు మదిసంతోషంబునం గొల్చెదన్. ౫౬

తా॥ ఇక్ష్వాకువంశమునకు కీర్తి తెచ్చి సుగ్రీవునిచే పూజలందిమూడులోకంబులను రక్షించుచు సత్యసంధుండైన రామచంద్రునినే సేవించుచున్నాను. 56

శ్లో॥ బ్రహ్మామృతానందఫలప్రదాయినం । వేదాంతవిజ్ఞానసుగంధ
పుష్పితం । సీతాశుభాంగాంచితబాహుశాఖినం । శ్రీరామ
కల్పద్రుమమాశ్రయామః. ౫౭

మ. అలసీతాంగన సత్కరోరువిటపంబై భవ్యవేదాంతని
ర్మలవిజ్ఞానసుగంధపుష్పయుతమై బ్రహ్మామృతనందన
త్ఫలదంబై పరతత్త్వ విద్వరులకున్ భావింపభాధాన్యమై
యలరున్ శ్రీరఘురామకల్పకము నేనశ్రాంతమున్ గొల్చెదన్ ౫౭

తా॥ సీతఅవయవంబులను శాఖలచేతను జ్ఞానంబను సుగంధపుష్పంబులచేతను బ్రహ్మానందమను ఫలంబుచేతను నుండితత్వవేత్తలకు భావింపునదైన శ్రీరామయను కల్పవృక్షమును నేనుసేవింతును. 57

శ్లో॥ కనకనికషభాసా సీతయాలింగితాంగో
నవకువలయదామశ్యామ వర్ణాభిరామః
అభినవయుత విద్యున్మండితో మేఘఖండ
శ్శమయతుమమతాంసర్వదా రామచంద్రః ౫౮

చ. ఉరుతరతప్తభర్మనికషోజ్వలమైన ధరాతనూభవన్
సరసతగూడినీలమణి జాలవిరాజితుడై తటిల్లతా
స్ఫురతసితాబ్రమోయనగ బొల్పువహించిన రాఘవుండు మ
ద్దురితసముద్భవంబైనదుస్తరతాపము బాపి బ్రోవుతన్. ౫౮

తా. బంగారువరపుడు రాయితో కాంతించు సీతతోగూడి మెఱపులతోనొప్పు మేఘంబులరీతి నొప్పురామునినే సేవింతును. 58

శ్లో॥ అలంశాస్త్రాభ్యాసైరల మసకృదామ్నాయపరనై
రలంతీర్థస్నానై రలమఖిలయాగవ్రతజపైః
అలంయోగాభ్యాసైరల మపిమహాపాతకధియా
యదస్మాకంరామస్మరణ మహిమాసావిజయతే. ౫౯

ఉ. చాలును శాస్త్రపాఠములుచాలును వేదములభ్యసించుటల్
చాలుజపంబులుండపముచాలు వ్రతంబులుతీర్థయాత్రలున్
జాలునదోపవాసములు సత్క్రతువుల్ ఘనయోగనిష్ఠలున్
జాలగభీతిమాన్పరఘుసత్తము సంస్మరణంబు గల్గుటన్. ౫౯

తా॥ శాస్త్రంబుల నభ్యసించియు వేదంబులను బఠించియు జపతపంబులచేయుటయు వ్రతంబుల నాచరించుటయు తీర్థయాత్రల గావించుటయు నుపవాసంబు లొనర్చుటయు యోగాభ్యాసముం జేయుచు కాలముపాడుచేయుటకంటె రామస్మరణచేయుట మంచిది. 59

శ్లో॥ సీతామనోమానసరాజహంస ! సంసారసంతాపహరక్షమాళో
శ్రీరామదైత్యాంతకశాంతరూప । శ్రీతారకబ్రహ్మనమోనమస్తే.

మ. కమనీయావనిజాతమానశమనుః కాసారహంసుఁ హిత
క్షముదైత్యాంతకుశాంతరూపిని బృహ స్సంసారసంతాపఘో
రమహాంభోనిధితారణున్ రఘువరున్ రాజీవపత్రేక్షణున్
విమలుఁ దారకబ్రహ్మముఁ దలచి సేవింతున్ గృపాకాంక్షినై.

తా॥ సీతమనంబునకు రాజహంసయు సంసారమునకునావయు
దైత్యాంతకశాంత రూపంబును నగు రామతారక మంత్రంబును
స్మరింతును. 60

శ్లో॥ కదావాసాకేతేవిమల సరయూతీరపులినేసమాసీనశ్శ్రీమ
ద్రఘుపతిపదాబ్జేహృదిభజన్ । అయేరామస్వామిన్ జన
కతనయావల్లభవిభో ప్రసీదే నుక్రోశనిన్నిమిషమివ నేష్యా
మిదివసాన్. ౬౧

మ. గురుసాకేతపురీసమీపసరయూకూలంబునన్ సైకతో
పరియందొక్కతటిన్ వసించినమహాభాగాం ఘ్రిపంకేజముల్
స్థిరవృత్తిఁ భజియింపుచున్ వరదయోసీతేశ ప్రత్యక్షమై
కరుణింపం దగునన్న ఘస్రములునిక్కంబుల్ నిమేషం బగున్. ౬౧

తా॥ రామా ; సరయూనదీ తీరంబునందలి యిసుకతిన్నెలం
దు వసించి వానిని పవిత్రంబొనర్చిన నీపాదపద్మంబులను సేవింపుచు
దినంబులను నిమిషములుగా గడపెదను. 61

శ్లో॥ కదావాసాకేతే తరుణతులసీకాన నవనేనివిష్టి
స్సంపశ్యన్నవిదితవిశాలోర్ధ్వతిలకం
అయేసీతానాథస్మృతిజనపతేదానవజయిన్న్వ
సీతేతిక్రోశన్నిమిషమివ నేష్యామి దివసాన్. ౬౨

శా. సాకేతంబున నొక్కవేళ తులసీసంతానమధ్యస్థుఁడై
శ్రీకల్యాణముఖంబునన్ దిలకముల్ జెల్వొందు నారము హే
కాకుత్స్థేశవిదేహజాధిపతియో హాయాసు ప్రసన్నుండవౌ
మాకన్నట్టిదినంబులు న్నిమిషమాత్రంబుగా ద్రోచెదన్. ౬౨

తా॥ ఓరామా; సాకేతపురంబున తులసీవనమధ్యంబునహోమంబు లొనర్చుచు నీనామంబును స్మరించుదినంబులు మాకునిముషంబులయ్యెనుగదా? 62

శ్లో॥ కదావాసాకేతే మణిఖచితసింహాసనతలే
సమాసీనంరామంజనకతన యాలింగితతనుం
అయేసీతారామ త్రుటితహరధన్వి న్రఘుపతే
ప్రసీదేతి క్రోసన్నిమిషమివ నేష్యామిదివసాన్. ౬౩

మ. తనసాకేతసభాంతరస్థలిలసద్రత్నోజ్జ్వలత్పీఠిభూ
తనయాలింగితుఁడై యొకప్పుడును మోదంబొప్పనున్నట్టిరా
మునినోహాశివచాపఖండనధరావృత్రిపతిన్ ముంగలన్
గనుపట్టంపగునన్నఘుస్రములు నిక్కంబున్ నిమేషంబగున్. ౬౩

తా॥ ఓరామా; అయోధ్యలో రాజసభయందు సీతనుగౌగిలించికొని యొకమారును మునితత్త్వోపదేశంబున నొక్కమారును నున్న నిన్నుజూచిన దినంబులు నిమిషంబులై పోయెనుగదా? 63

శ్లో॥ మాగేమాగేశాఖినాంరత్న వేదీ వేద్యాంవేద్యాంకిన్నరీ
బృందగీతం। గీతేగీతేమంజుళాలాపగోష్ఠి। గోష్ఠ్యాంగోష్ఠ్యాం
త్వత్కథారామచంద్ర. ౬౪

చ. పొలుపగుమార్గ మార్గముల భూజములందలి రత్నవేదికా
స్థలమునకిన్నరీతతులు తానలయాన్వితగానవైఖరిన్
సలలితమైనగోష్ఠి యెడసన్నుతిఁజేతురు రామచంద్రనీ
విలసితసత్కథామృతమువేడ్క లిగిర్చినది త్వత్కృతులై. ౬౪

తా॥ ఓరామా ; ప్రతిమార్గమందును కిన్నరులతో గూడ గానంబొనర్చుచు నీనామంబు ననేకవిధంబుల బాడుదురు. 64

శ్లో॥ వృక్షేవృక్షేవీక్షితాః పక్షిసంఘాః
సంఘేసంఘేమంజులా మోదవాక్యం
వాక్యేవాక్యేమంజులా లాపగోష్ఠి
గోష్ఠ్యాంగోష్ఠ్యాం త్వత్కథారామచంద్ర. ౬౫

ఉ. భూరుహాభూరుహంబులను బొల్పుగనున్న ఖగవ్రజంబులిం
పారగమంజులోత్కరములైన సుభాషలయందు వేడ్క బెం
పారినరమ్యగోష్ఠియెడసంచితమైన భవత్కథాసుధా
సారమేకర్ణపర్వముగసన్నుతిజేయును రాఘవేశ్వరా. ౬౫

తా॥ ఓరామా ; ప్రతివృక్షంబునందును పక్షులు చక్కనివాక్యములతో నీకథామృతంబునే గోష్ఠిగా చెప్పకొనుచుండును. 65

శ్లో॥ శ్వేతపుష్పకమారుహ్యసీత యాసహరాఘవ
సుగ్రీవాదిభవద్భక్తైర్మనోమధ్యే రమస్వమే. ౬౬

మ. సితవిభ్రాజితపుష్పకంబున ధరాసీమంతినీపుత్రికా
శ్రితవామాంకుడవై రఘూద్వహరమాచిత్తేశదైత్యేశమా
రుతపుత్రాదిసమస్తభక్తజనులారూఢిన్ బ్రవేష్టింపన
ద్భుతరమ్యాకృతివై మదీయమగుచేతోవీధి గ్రీడింపవే. ౬౬

తా॥ ఓరామా ; నీవు సుగ్రీవాది వానరసమేతుండవై సీతనీకు వామపార్శ్వంబుననుండ శ్వేతపుష్పకము నెక్కి నామనోవీధియందు తిరుగుమా. 66

శ్లో॥ దోర్భిఃఖడ్గత్రిశూలండమరుమసిధనుశ్చారు బాణంకుఠారం
శంఖంచక్రంచఖేటం హలముసల గదాభిండివాలంచ పాశం
విద్యుద్వహ్నింశ్చముష్టి సత్వభయవరకరంబిభ్రతంశుభ్రవర్ణం
వందేరామంత్రినేత్రంసకలరిపుకులం మర్దయంతంప్రతాపైః ౬౭

మ. శరచాపాసికుఠారముద్గర గదాచక్రంబు భూభిండివా
లరుచిస్ఫారకృశాను ముష్టిహలశూలప్రాసఖేటాదులున్
గరసంఘంబులఁదాల్చినిర్భయకరాఖ్యంబున్ ప్రకాశింపపాం
డురవర్ణంబుద్రినేత్రమున్ గలిగితోడ్తోశత్రులంద్రుంచు శ్రీ
కరుడవ్వురామునకెల్ల కాలమునమస్కారంబు లర్పించెదన్. ౬౭

తా॥ ఓ రామచంద్రా; శరచాపకుఠారాదులను చేతులందు ధరించి కేవలము నీలమేఘమురీతి నొప్పుచు రాక్షసులను సంహారించు నీకిదే వందనము. 67

మూ. దురితతిమిరచంద్రో దుష్టికంజాతచంద్రః
సురకువలయచంద్ర స్సూర్యవంశాబ్ధిచంద్రః
స్వజననివహచంద్ర శ్శత్రు రాజీవచంద్రః
ప్రణతకుముదచంద్రః పాతుమాం రామచంద్రః ౬౮

చ. కలుషతమిస్రతంద్రుదరి కంజసుధాంశుడు దేవకైరవో
జ్జ్వలశశిసారసాప్తకులవార్ధి మృగాంకుఁడు సంశ్రితోత్కరో
త్పలవిధుడల్పకందసితభానుఁడు నైజజనయికసేవ్యుడున్
విలసితవీరుడయిన రఘువీరుఁడు సత్కృప నన్ను బ్రోవుతన్. ౬౮

తా॥ పాపవినాశకుండును సూర్యవంశోద్ధారకుండును మహావీరుండవునగు నిన్ను సదా స్మరింతును. 68

మూ. కల్యాణదం కౌశికయజ్ఞపాలం। కళానిధింకాంచనశైలధీరం
కంజాతనేత్రంకరుణాసముద్రం । కాకుత్థ్సరామంకలయామిచిత్తే.

ఉ. చారుకళానిధిన్ విమలసారసపత్రవిశాలనేత్రుబృం
దారకశత్రుజైత్రు శుభదాయకు కౌశికయజ్ఞరక్షకున్
గారుణికాగ్రగణ్యుం బరు గాంచనభూధరధీరు శూరునిన్
శ్రీరఘురాముని న్హృదయసీమ గనుంగొనుచుండుఁబొందుగన్.

తా॥ శుభప్రదుడును విశ్వామిత్ర యాగరక్షకుండును మేరువ

ర్వతమువంటి ధైర్యంబుగలవాడును పద్మనేత్రుండును దయాళుండును
నగు రాముని నాహృదయంబున స్మరింతును. 69

మూ. వాల్మీకిస్మృతిమందరేణమథిత స్సీతారమాసంభవః
సుగ్రీవాంగదజాంబవాదిపతగ సౌమిత్రిచంద్రోదయః
వాతోత్పన్నమణిర్విభీషణసుధః పౌలస్త్యహాలాహలో
శ్రీరామాయణదుగ్ధవార్ధిరమతే భూయాత్సుఖ శ్రేయసే. ౭౦

శా. ఆవాల్మీకివచోగిరి ప్రమథితంబయి సీతయేలక్ష్మిను
గ్రీవాదుల్సుర భూరుహాదులు దశగ్రీవుండు హాలాహలం
బావాతాత్మభవుండు రత్నముసుమిత్రాపత్యముంజంద్రుడా
దేవారాతిసహోదరుండు సుధయైదీపించు రామాయణం
బేవిఖ్యాతిసుధాబ్ధియై యొసగు సత్ప్రేమాభిలాషార్థముల్. ౭౦

తా॥ ఆవాల్మీకి వాక్యంబుచే మథనచేయబడి సీత లక్ష్మిగాను సుగ్రీవాదులు కల్పవృక్షాదులుగను రావణుడు విషంబుగను హనుమంతుడు రత్నముగాను లక్ష్మణుడు చంద్రుడుగాను విభీషణుండమృతముగాను నుండు రామాయణమను క్షీరసముద్రము ప్రేమనిమిత్తము వృద్ధియగుగాక. ౭౦

మూ. రఘునందనఏవదైవతంనో రఘువంశోద్భవఏవదైవతంనః
భరతాగ్రజఏవదైవతంనో భగవాన్ రాఘవ ఏవదైవతంనః.

శా. నరవరశేఖరుండు రఘునందనుడే పరదైవతంబు శ్రీ
వరుడుపరేశుడైన రఘువంశుడేమాపరదైవతంబు శ్రీ
హరిభగవంతుడైన భరతాగ్రజుడేపరదయివతంబుమా
కరయగరామభూవరుడహర్నిశలుం బరదైవతంబగున్. ౭౧

తా॥ మాకారాముడేదేవుడు. రఘువంశసంభవుడే యాధారము. ఆభరతాగ్రజుడే నాకుదిక్కు. 71

మూ. ఉత్ఫుల్లామలకోమలోత్పలదళ శ్యామాయరామాయమన
శ్చంద్రాయ ప్రశమాయనిర్మల గుణారామాయరామాత్మనే
ధ్యానారూఢమునీంద్రమానస సరోహంసాయ సంసారవి
ధ్వంసాయాద్భుతతేజసే రఘుకులోత్తంసాయ పుంసేనమః. ౭౨

మ. తతనీలోత్పల కోమలాంగునకు కాయసన్మనోహారికిం
చితమానీంద్రమనస్సరోవరల సత్సేవ్యతస్ఫురన్మూర్తికిన్
ధృతికిన్ సద్గుణశాలికిన్ దురితసందోహాటవీవహ్నికి
ద్భుతతేజస్కునకాజిశూరునకు సంతోషంబునన్ మ్రొక్కెదన్.

తా॥ వికసించిన పద్మంబులవంటి నేత్రంబులును సీతామనో నాథుండును మునిమానస సరోరుహ హంసుండును సద్గుణశాలియున ద్భుతతేజంబును నగురామునకు నమస్కారము. 72

మూ. రాజీవాయతలోచనం రఘువరం నీలోత్పలశ్యామలం
మందారాంచితమంటపేసులలితే సౌవర్ణకేపుష్పకే
ఆస్థానేనవరత్నరాజిఖచితే సింహాసనేసంస్థితం
సీతాలక్ష్మణలోకపాల సహితంవందేమునీంద్రాస్పదం. ౭౩

శా. మందారస్థల హేమరత్నమయ సద్మద్యోతసత్పుష్పకం
బంధున్నైజసభా శుభాసనమునందా సీనుడై మానిస
ద్బృందాశాధిపలక్ష్మణాస్పదుడు నయిపృథ్వీసుతాయుక్తుడై
కుందేందీవరవర్ణుడారఘువరున్ కంజాక్షుసేవించెదన్. ౭౩

తా॥ విశాలలోచనుండును నల్లకలువరీతి చామనచాయకలవా డును మంచారమంటపమున బంగారువిమానమున గూరుచుండునా రా ముని సేవింతును. 73

మూ. వల్లీప్రవాళనవపల్లవపాదపద్మం। కంజేక్షణంజలజనీలసరో
రుహాభం। సీమంతినీనయనమోహన మూలమంత్రం।
రామంనమామి మునిమానస రాజహంసం. ౭౪

మ. కిసలయవిద్రుమారుణము గేరుపదాంబుజయుగ్మమానిమా
ననసరసీనురాలము ఘనప్రతిమానవి నీలుమానునీ
విసరవిలోచనాంబురుహావిశ్రుతమోహాన మంత్రమున్మహో
త్కృసరసిజాక్షుభక్తజనతోషకరున్ రఘురాముగొల్చెదన్. ౨౮

తా॥ కొత్తగాచిగిర్చిన చిగుళ్ళవలె మెత్తనై పగడంబులరీతి నెఱ్ఱపాదంబులు కలిగి పద్మదళేక్షుండై స్త్రీలకు సమ్మోహనాస్త్రము వంటివాడగు రామచంద్రునకు వందనములు. 74

మూ. అలంవివాదేననమానుషోయం। రామాత్మనా రాక్షసమర్దనాయ
భుజంగశయ్యాంపరిముచ్యసాక్షా। న్నారాయణోభూతలమాజగామ

చ. కలహముపేళ మానవుడుగాఁడుసుమీ రఘురామచంద్రుఁడీ
య్యిలజనియించెరాక్షసులనే పడిగింపభుజంగతల్పముఀ
దొలగిజగన్నియంతయగుతో యజనాభుఁడుదృష్టిపాత్రుఁడై
సలలితమామహోహిమ సర్వజగంబులుసన్నుతింపగఀ. ౨౯

తా॥ జనులారా? కలహమేల? రాముడు మనుష్యుడుగాడు. రాక్షసులనుజంపి లోకులను రక్షించుటకు శేషశయ్యనువీడి భూమికవతరించిన విష్ణువు. ఆరామునే సేవించుదము. 75

మూ. లోకత్రాణానుకారీ దశవదనశిరఃఖండవిచ్ఛేదకారీ
లంకాలంకాలహారీభృగుతనయ మనస్సర్వగర్వాపహారీ
సీరాసిమంతకారీ మణిమయమకుటోద్దివ్య కోదండధారి
శ్రీరామఃపాపహారి శమయతుదురితం భూమిభారాపహారీ. ౩౦

మ. భువనత్రాణుదశాస్యకంఠవిలురద్భూరి ప్రభావాన్యదా
నవరాట్పట్టణవయిభవాపహరు సన్మాణిక్యకోటీరుభా
గఀవగర్వాపహరున్ ధనుర్ధఀరుధరాకన్యానుసారిఀహారిఀ
భువిభావాపహరాముగొల్తు దురితంబుల్ బాపి రక్షింపగన్. ౩౦

తా॥ లోకరక్షకుండును రావణుని శిరంబుల ఛేదించిన వాడును

లంకాపురవైభవహారుండును పరశురాముని గర్వమును హరించినవా
డును నగురాముడు నాపాపంబులను శాంతింపజేయుగాక. 76

మూ. బ్రహ్మాదియోగి మునిపూజితసిద్ధమంత్రం
దారిద్ర్యదుఃఖ భవరోగ వినాశమంత్రం
సంసారసాగర సముత్తరణైకమంత్రం
వందేమహాభయహరం రఘురామమంత్రం. 22

ఉ. సారసగర్భయోగిమునిసంస్మరణీయముదుఃఖరోగసం
హారకముఁదరిద్రకలుషాపహముఁ భయవారకంబుసం
సారపయోధితారకము సర్వసుపర్వమనోవిహారముఁ
శ్రీరఘురామమంత్రముగురించి నమస్కృతులాచరించెదన్. 22

తా॥ బ్రహ్మమొదలగు యోగులకు సిద్ధమంత్రమువంటిదియు
దరిద్రదుఃఖమును నశింపజేయునదియు సంసారసముద్రమును దాటిం
చునదియు నగు రామమంత్రమునే సేవింతును. 77

మూ. శత్రుచ్ఛేదైకమంత్రంసకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తరమంత్రం సముచితసమయే సంగనిర్యాణమంత్రం
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగ సందష్టసంత్రాణమంత్రం
జిహ్వేశ్రీరామమంత్రం జపజపసతతం జన్మసాఫల్యమంత్రం

మ. ఉరుసంసారసముత్తరంబు నిగమాంతోక్తార్చితంబున్ సమ
స్తరిపుధ్వంసముజన్మపావనముగా తత్రాగవేళాసము
చ్చరితంబున్ వ్యసనాహిదష్ట జనరక్షామైశ్వర్యదం
బరుదా శ్రీరఘురామమంత్రమునుజిహ్వాభక్తిఁగీర్తింపుమా.

తా॥ శత్రునాశనకారకంబు నుపనిషత్తులచే పూజింపబడునది
యుసంసారమును తరింపజేయునదియు సర్వైశ్వర్యములకు పూజనీయం
బును వ్యసనంబుల పోగొట్టునదియు జన్మసాఫల్యమైనదియు నగురామ
మంత్రమును సేవింతును.
78

శా. ఆడకణన్మారూఢధనుర్గుణాఢ్యం। బ్రహ్మాస్త్రముండీకృతరాక్షసేం
రథాధిరూఢంరణరంగధీరం । రామంభజేరక్తసరోరుహాక్షం. ౭౯

మ. పాకారాతిశతాంగమెక్కి రణభూభాగంబుగంపింపగా
నాకర్ణాంతధనుర్విముక్తదృఢబ్రహ్మాస్త్రంబునన్ రావణుః
లోకశ్రేణినుతింపఁద్రుంచినబుధశ్లోకున్ సరోషాంబకుఁ
గాకుత్థాన్వయదుగ్ధవారినిధిరాకాకాంతుఁ జంద్రుంగీర్తింతుం జెదఁ. ౭౯

తా॥ ఇంద్రుని రథంబునెక్కి భూమిచెల్లాచెదరై ధనువు నాక
ర్ణాంతము సారించి బ్రహ్మాస్త్రంబుచే రావణుని జంపిన రఘుకులచం
ద్రుండగు శ్రీరాముని సేవింతును. 79

మా. ఏతౌలాదశకంఠకంఠకదళీ కాంతారజాంతిచ్ఛిదౌ
వైదేహీకుచకుంభకుంకుమరజః పంకారుణాలంకృతౌ
విశ్వత్రాణవిదానసాధు సరసప్రారంభయూపౌ భుజౌ
దేయాస్తామురువిక్రమౌరఘుపతేశ్శ్రేయాంసి భూయాంసినః. ౮౦

ఉ. కలుషనిశాచరేంద్రదశకంధరకంధరకాననచ్ఛిదో
జ్జ్వలితములుర్విజోరుకుచచర్చితకుంకుమపంకిలారుణం
బులుభువనావన ప్రకటభూరిమహాధ్వరయూపముల్ జనే
ట్కులభవదీయబాహువులు కోరినకోర్కులు నిచ్చునిచ్చలున్. ౮౦

తా॥ ఎవనిబాహువులు దుష్టరాక్షసులను సంహరించుటకు క
ఠోరమగు కుఠారములను ధరించినవియు లోకములను రక్షించుయా
గంబులకు యూపస్తంభంబులును నైనవో వానిని నేనునాకోర్కెలు
దీరగొల్తును. 80

శ్లో॥ వామాంకోదరిసంస్థితావనిసుతా మాముక్తభూషోజ్జ్వలాం
పశ్యంతంపరిపూర్ణచంద్రవదనం భ్రాజత్కిరీటోజ్జ్వలం
అసీనంనవరత్నరాజిఖచితే సింహాసనేరాఘవం
సుగ్రీవాంగదలక్ష్మణానిలసుతైరా సేవ్యమానంభజే. ౮౧

మ. తనవామాంకమునందలంకరణ సీతాలోకనాసక్తుడై
ఘనరత్నోజ్జ్వలసత్కిరీటధరురాకా చంద్రబింబాస్యుగాం
చనసింహాసన సంస్థితున్ రవిజపజన్యాత్మసత్సౌత్రపా
వనిసౌమిత్రిప్రసేవితుండగు రఘుస్వామిన్ భజింతున్ మదిన్. ౮౧

తా॥ సీతయలంకరించుకొని యెడమవైపుననుండ రత్నస్థగితకిరీటమును ధరించి సింహాసనస్థుడైయుండి సుగ్రీవాది వానరవీరుల రక్షించు రాముని నామదిలో దలంతును. 81

శ్లో॥ జానక్యాః కమలాంజలిపుటేయాః పద్మరాగాయితాః
న్యస్తా రాఘవమస్తకేతువిలసత్కుంద ప్రసూనాయితాః
స్రస్తాశ్యామలకాయకాంతికలితాః యాయింద్రనీలాయితాః
ముక్తాస్తాశ్శుభదాభవంతుభవతాం శ్రీరామవైవాహికాః. ౮౨

చ. పరిణయవేళ సీతకరపద్మయుగ స్థితమౌక్తికాలిక
య్యరుణమణిప్రభ న్వెలసెయాజితనూజుశిరంబునందుకుం
దరుచులఁగల్గెరామతనుధామముచేత వినీలరత్నవి
స్ఫురితములయ్యె దన్మనులుసుస్థిర సంపదలిచ్చునిచ్చలున్. ౮౨

తా॥ వివాహవేళ సీత చేతులందలి మాణిక్యంబులును ముత్తెములును కాంతినీయ రాముని కంఠమాలచే మునులశిరంబునందు కుందరదులు కల్గగా నామునులకు స్థిరసంపదల నొసంగును. 82

శ్లో॥ నిత్యం శ్రీరామమంత్రం నిరుపమధికం నీతివిజ్ఞానమంత్రం
స్తుత్యం శ్రీరామమంత్రం సదమలహృదయే సర్వదారోగ్య మంత్రం
సత్య శ్రీరామమంత్రం సులలితసుమనస్సౌఖ్య సౌభాగ్యమంత్రం
పఠ్యం శ్రీరామమంత్రం పవనజవరదం పాతుమాం రామమంత్రం.

ఉ. నిత్యమునిశ్చమానమును నీతివివేకము నిర్మలంబునా
దివ్యశుభప్రదాయదము దీనజనార్తికరంబు యోగిసం

స్తుత్యముసజ్జనప్రకటరోషకరంబు వరంబునంజనా
పత్యవరప్రదంబురఘువర్యుని మంత్రమునన్ను బ్రోవుతన్. ౮౩

తా॥ సిద్ధినిధియు హృదయంబున కారోగ్యవిధియు మనసౌ ఖ్యంబులకు సౌభాగ్యనిధానంబును హనుమంతునకు వరంబిచ్చునదియు నిత్యమైనదియు నిరుపమానమైనదియు నగు శ్రీరామ మంత్రమును నేసేవింతును. 83

శ్లో॥ వ్యామోహప్రధమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యోన్మూలకరౌషధం భవభయప్రధ్వంస నయిరౌషధం
భక్తానందకరౌషధం ప్రభువనేసంజీవ నయిరౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబమనః శ్రీరామనామౌషధం. ౮౪

చ. భవభయభేషజం బురిభంజనమాశ్రిత తోషణంబుదా
నవవరసర్వహారణంబు మునీశ్వరసేవితంబుమో
హవిదళనంబులోకనివహప్రకటోజ్జ్వల జీవనంబెనౌ
రవికులరామనామకమహౌషధమున్ కృపనన్ను బ్రోవుతన్. ౮౪

తా॥ సంసారభయనాశకుండును మునులమనంబుల కౌషధం బును రాక్షస నాశంకరుడును భక్తులకానందదాయియు మంగళప్రాప్తి కరుండును శ్రీరాముని నామం బను నౌషధము నన్ను రక్షించుగాత.

శ్లో॥ ధ్యాయేత్త్రాతస్సురేశం రవికులతిలకం రంజితానందలోకం
బాలంజాలారుణాక్షం భవముఖవినుతం భావగమ్యంభవఘ్నం
దీప్యంతంస్వర్ణకేయూరైర్మణిగణనికరైర్భూషణైరుజ్జ్వలాంగం
కౌసల్యాదేహజాతం మమహృదయంగతం రామమీషత్స్మితాస్యం.

మ. స్మితవక్త్రిన్ గలుషాపహున్ సురమునిశ్రేష్ఠస్తుతున్
శంకరార్చితపాదుఁ బరు గౌసలేయునుజనప్రీతిప్రదుఁ భూషణాం
చితుబాలారుణనేత్రుభాస్కరకులుఁ శ్రీరాఘవున్ లోకరం
జితునిన్హృత్సరసీరుహాంతరగతుఁ నేవింతుఁ బ్రాహ్మంబున్. ౮౫

తా॥ రవికులతిలకుండును లోకుల నానందింప జేయువాడును బాలుండును సంసారనాశకుండును మణిగణ నికరంబులను ధరించిన వాడును నాహృదయము నందున్న వాడును నగు రాముని నే నుతింతును. 85

శ్లో॥ మధ్యాహ్నే రామచంద్రంమణిగణలలితంమందహాసావలోకం
మార్తాండానేకభాసం మరకతనికరాకార మానందమూర్తిం
సీతావామాంకసంస్థం సరసిజనయనం పీతవాసోపనాసం
వందేహంవానుదేవం పరదశరథనుషంమానసేమేవిభాంతం. ౮౬

మ. దరహాసేక్షణత ప్తకాంచనలసద్రత్నోజ్జ్వలాకల్పునిన్
శరకోదండకరాంబుజుఁ మరకతచ్ఛాయాభిరాముఁ విభా
స్వరకోటిద్యుతుజానకీసహితు రాజశ్రేష్ఠుజ్యాయోనదాం
బరుశ్రీరామునిమధ్యమాహ్న్యమునసంభావించినేమ్రొక్కెదన్. ౮౬

తా॥ మణిగణలలితుండును చిఱునవ్వుచూపులు కలవాడును సూర్యకాంతివంటి కాంతికలవాడును, పీతాంబరధరుండును వసుదేవాత్మజుండును నగురాముని నాహృదయంబున స్మరింతును. 86

శ్లో॥ ధ్యాయేద్రామసుధాంశునంత సకలభవారణ్యాతా ప్రహారం
శ్యామంశాంతసురేంద్ర సురమునివినుతంకోటిసూర్యప్రకాశం
సీతాసౌమిత్రిసేవ్యం సురనరసుగమం దివ్యసింహాసనస్థం
సాయాహ్నేరామచంద్రంస్మితరుచిరముఖంసర్వదామేప్రసన్నం.

మ. శ్రితపాపాటవివహ్నిలక్ష్మణ ధరిత్రీపుత్రికాయుక్తునం
చితచంద్రాననుశాంతుదేవ మునిసంసేవ్యుఁ వినీలాకృతిఁ
స్మితవక్త్రున్ రవికోటిసన్నిభమణీసింహాసనస్థాసనం
స్థితుశ్రీరామదినాంతమందుమదినే జింతింపనిష్టాప్తికిన్ ౮౭

తా॥ సంసారసాగరతారకుండును శాంతయుతుండును సురమునివినుతుండును దేవమానవసుగముండును దివ్యసింహాసనస్థుండునునగు రామునిహృదయంబున స్మరింతును. 87

శ్లో॥ కేయూరాంగదకంకణై ర్మణిగణై ర్వైరోచమానంసదా
రాకాపర్వణిచంద్రకోటిసదృశం ఛత్రేణవై రాజితం
హేమస్తంభసహస్రషోడశయుతే మధ్యేమహామంటపే
దేవేశంభరతాదిభిఃపరివృతం రామంభజేశ్యామలం. ౮౮

మ. పదియాఱ్వేల పసిండికంబములచే భాసిల్లుగేహంబునం
దుదయోత్తప్రచురచ్ఛతాయుతసముద్యోగాబ్జసంకాశునం
గదకోటీరవిభూషణుఁ భరతముఖ్యభ్రాతృ సంసేవితున్
సదయాత్ముఁన్ రఘురామునీరదఘుపశ్యాముఁ దలంతుఁ మదిఁ ౮౮

తా॥ పదారువేల బంగారుస్తంభములచేకాంతించుగృహంబునం
దు కోటిసూర్య ప్రకాశమానంబుగ భరతుండు మొదలగు వారిచేసేవింప
బడుచునుండు రఘురాముని నాహృదయంబున తలంతును. 88

శ్లో॥ విహాయకోదండమిమంము హుఃశర్తగృహాణపాణౌమణిచారువేణి
మయూరబర్హంచనిజోత్తమాంగే సీతాపతేరాఘువరామచంద్ర.

మ. శరచాపంబులుమానబర్హణుని వంశంబుల్ శిరంబందు స
త్కరయుగ్మంబున బూనగాదగు ముహూర్తంబురఘూత్తం సభా
స్కరవంశాబుధిపూర్ణ చంద్రు నగరశ్రీకంజాతుభూ
శరమాళీస్థకిరీటరత్నవిలసత్పాదాబ్జ రామప్రభో. ౮౯

తా॥ ఓరామచంద్రా; నీవీకోదండమునువిడిచిచేతియందుమా
ణిక్యముల స్థాపించిన పిల్లనగ్రోవిని శిరంబున నెమలిపింఛంబును నొక
మారు ధరించినాకు దర్శనమిమ్ము. 89

శ్లో॥ శుద్ధాంతేమాతృమధ్యేదశరథపురతః సంచరంతం పరంతం
కాంచీదామానుబిద్ధంపతిమణిబిల సత్కింకిణీనిక్వణాంగం
ఫాలేముక్తాలలామంపదయుగనినద న్నూపురంచారుహాసం
బాలంరామంభజేహం ప్రణతజనమః భేదవిచ్ఛేదదక్షం. ౯౦

ఉ. అంతిపురంబునందశరథాధిపుముంగల మాతృమధ్యమం
దెంతయుమాటలాడుతరి హేమమణీ పదనూపురంబులా

క్రాంతనితంబఘంటికలు రంజిలముత్యపు రావిరేకయుః
వింతగజెన్నుమీరు రఘువీరుకుమారును దారునెన్నెదన్. ౯౦

తా॥ అంతఃపురమునందు దశరథునిముందు తల్లులముందును నీవుమాటలాడునప్పుడు బంగారు అందెలును బంగారుమొలనూలును ముత్యాల రావిరేకయు ముదంబుగొల్పునట్లుండు రాముని సేవింతును.

శ్లో॥ సంపూర్ణచంద్రవదనం సరసీరుహాక్షం । మాణిక్యకుండలధరం మ
కుటాభిరామం । చాంపేయగౌరవదనం శరచాపహస్తం శ్రీరామ
చంద్రమనిశం మనసాస్మరామి । ఇంద్రనీలమణిసన్నిభదేహం వం
దనీయమనకృన్మునిబృందైః లంబమానతులసీవలమాలం । చింత
యామిసతతం రఘువీరం. ౯౧

చ. సురచిరపూర్ణచంద్రముఖ శోభితరత్నకిరీటకుండలా
భరణసువర్ణచేలునకుచివత్రుసారసపత్రనేత్రుభా
సురశరచాపహస్తు నతనూరివిమానువనీ గాత్రు సు
స్థిరవమాలికంరఘుపతిన్నియతిన్మనసా స్మరింపుమా. ౯౧

తా॥ పూర్ణచంద్రవదనుండును సరసీరుహాక్షుండును మణికుండల ధరుండును శరమును శరచాపహస్తుండును యింద్రనీల మాణిక్యముల తోసమమగు దేహముకలవాడును మునివంద్యుండును తులసీమాధరుం డును నగురాముని మనంబున స్మరింతును. 91

శ్లో॥ రామచంద్ర దయసాంద్ర రఘువీరనృపోత్తమ
లోచనాభ్యాంకృపాపూర్ణ పూరణాభ్యాంవిలోకం ౯౨

మ. శ్రీరఘురామచంద్ర సుచరిత్రకృపాకరాజశేఖరా
సూరిజనస్తుతాంఘ్రి యుగసుందరగాత్ర ధరానుతాధిపా
చారువిలోచనంబునను సత్కరుణాపరిపూర్ణదృష్టిచే
నారయుమయ్యనన్ను నిరతాశ్రయుడంచు దలంచుమక్కువన్.

తా॥ ఓరామచంద్రా; దయాసాంద్రా; నీపరిపూర్ణకటాక్ష వీక్షణంబుల నన్నొకసారిచూడుము. 92

మూ. రామేతివర్ణద్వయమాదరేణ । సదాస్మరన్ ముక్తిముపైతి
జంతుః । కలౌయుగేకల్మషమానుషాణా । మన్వత్రధర్మేఖి
లునాధికారః । భక్తప్రియంభక్తసమాధిగమ్యం । చింతా
హారంచింతితకామధేను । సూర్యేందుకోటిద్యుతిభాస్వ
రంతం । రామంభజే రాఘవ రామచంద్రం. ౯3

చ. సలలితరామవర్ణయుగ సంస్మరణంబునముక్తి చేకురు
న్కలియుగమందునస్యమగు కర్మములందతికాంక్షలేటికి
న్మలనసఖాబ్జకోటిరుచి నమ్రజనప్రియు నార్తికల్పకం
బిలనుజనవ్యథాపహరు నిష్టఫలప్రదురాము నెన్నెదన్. ౯3

తా॥ "రామ" అను రెండక్షరములనుస్మరించినంతమాత్రము నముక్తి కలుగును కలియుగమునందు పాపంబులన్నియు నశించును. కర్మముల విడువుము. ఆర్తులపాపంబులను హరించువాడును జనులదుఃఖముల బాపువాడునునగు రాముని వేడుడు. 93

మూ. సకలభువనరత్నం సర్వశాస్త్రార్థరత్నం
సమరవిజయరత్నం సచ్చిదానందరత్నం
దశముఖహరరత్నం దానవారాతిరత్నం
రఘుకులరూపరత్నం పాతుమాం రామరత్నం. ౯3

చ. ఇనకులరాజరత్నమసురేశ్వర మర్ధనరత్నము వ్రణా
వనిజయరత్నమున్నిగమ వర్ణితరత్న మమేయరత్నము
న్దనుజవినాశరత్నమువిధాత సమర్పితరత్నమున్ జగ
జ్జనుతరామరత్న మనిశంబుకృపామతినన్బ్రోవుతన్. ౯3

తా॥ సకలలోకరత్నంబును సర్వశాస్త్రంబులను అర్థంబులకు రత్నంబును సమరవిజయరత్నంబును రావణునిహరించిన రత్నంబును నగురామరత్నము మాపాపంబులను పోగొట్టుగాక. 93

మా. మాతుఃపార్శ్వే చరంతం మణిమయశయనే మంజుభూ
షాంచితాంగం । మందంమందంపిబంతం ముకుళితనయన
స్తన్యమన్యస్తనాగ్రం । అంగుళ్యగ్రైస్స్పృశంతంసుఖపర
వశయాసుస్మితాలింగితాంగం । గాఢంగాఢంజనన్యాఃకల
యతుహృదయేమామకంరాజబాలం. ౯౪

చ. సరసతరత్నతల్పమున సైరణభూషణభూషితాంగుడై
దరహసితంబునన్ జనని స్తన్యముగ్రోలుచునొక్క కేలనా
దరణకుచాగ్రమంటి ప్రమదంబునకన్నులు మూసికౌగిటన్
పరవశసౌఖ్యమొందు పసిబాలునిరాముని గాంతునెమ్మదిన్. ౯౪

తా॥ సరసమగు పాన్పుపై తల్లిప్రక్కను పరుండి చిరునవ్వునవ్వు
చు నొకప్రక్కపాలుద్రావుచు రెండవచంటిమీద చేతితోనెమ్మదిగధ్వ
నిచేయుచు సంతోషంబున కన్నులుమూసికొని కౌగిలియందు సౌఖ్యప
డురాముని బాల్యమును స్మరింతును. 95

శ్లో॥ రామాభిరామనయభిరామం వాచాభిరామం వదనాభిరామం
సర్వాభిరామందసదాభిరామం వందేసదాదాశరథించరామం. ౯౬

ఉ. రాముసదాభిరాముదిన రాజకులాంబుధి సోముజానకీ
రాముసురారిభీము వరరాజలరాము వినీల నీరద
శ్యాముపవిత్రనాము విలసన్మణిదాము సమర్చితామర
స్తోముగుణాభిరాము నతసోముదలంచి నమస్కరించెదన్. ౯౬

తా॥ మనోహరరూపంబున రమ్యమానుడై వాక్కుల కగో
చరుడై యందరకు నింపుచేయువాడై యుండు రఘురామునికి వంద
నములు.

శ్లో॥ జయజయరఘురామ శ్రీముఖాంభోజభానో
జయజయరఘువీర శ్రీమదంభోజనేత్ర

జయజయరఘునాథ శ్రీకరాభ్యర్చితాంఘ్రే
జయజయరఘువర్య శ్రీశకారుణ్యసింధో. ౯౭

చ. జయజయరామచంద్ర విలసత్కమలాసన కంజభాస్కరా
జయజయరాఘవేంద్ర మునుచంద్రసమర్చితపాదపంకజా
జయజయజానకీరమణ సారసపత్రవిశాలలోచనా
జయరఘువీరదాసనుత సత్కరుణావరుణాలనచ్యుతా. ౯౭

తా॥ ఓరామా ? విలసత్కమలాసనా ? కంజభాస్కరుడా ; జానకీరమణా ; సారసపత్రవిశాలలోచనుడా ? సత్కరుణాలవాలుడా? నాకు దర్శనమిమ్ము. 97

శ్లో॥ జయాజయవరశంఖ శ్రీగదాచక్రధారి
జయజయనిజదాస ప్రాప్యదుర్లభ్యకామం
త్రిభువనమయసర్వ ప్రాణిభావజ్ఞ విష్ణో
శ్శరణముపగతోహం త్వాంశరణ్యంవరేణ్యం. ౯౮

చ. జయజయశంఖచక్ర వరశార్ఙ్గ గదావిలసత్కరాంబుజా
జయనిజసేవకేప్సితప్రశస్త దురాసదకార్యదాయకా
జయభువనత్రయప్రచుర జంతుమనోజ్ఞరమేశరాఘవా
జయరఘురామచంద్రగుణ సాంద్రనిరూఢశరణంబువేడెదన్. ౯౮

తా॥ వేదవేద్యుండును పరాత్పరుండును దశరథాత్మజుండును నగు రాముడువాల్మీకి కవిత్వమున ప్రసన్నుడై భక్తులకు నిష్టఫలంబులను సమకూర్చుగాక. 98

శ్లో॥ వేదవేద్యేపరేపుంసి జాతేదశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షాద్రామాయణాత్మనా. ౯౯

ఉ. ఆగమవేద్యుడైన హరుడాజితనూభవుడై జనించునో
నాగమసంచయంబుచిత మయ్యెనురామకథాస్వరూపమై

బాగుగ వామలూరుభవ భవ్యకవిత్వమునన్ ప్రసన్నమై
భాగవతాగ్రగణ్యులకు పథ్యమునై శ్రవణార్హమైతగన్. ౯౯

తా॥ ఓరామచంద్రా; శంఖచక్రగదా పద్మాదిధరుండవై నిజ సేవకుల యిష్టకార్యముల దీర్చువాడవై చెడుకార్యములను తొలంగించువాడై సద్గుణ సాంద్రుండవైన నిన్ను శరణంబు వేడెదను. 99

శ్లో॥ శ్రీరామేత్యేకదా వక్తుం మనోయస్య ప్రవర్తతే
వైకుంఠవాసి సస్తుల్యకులమేకోత్తరంశతం ౧౦౦

ఉ. శ్రీరఘువీరుపేరుతన చిత్తమునందొకవేళభక్తినిం
పారభజింపనెంచిన మహాత్మునియేకశతాన్వయంబు లా
కారుణికాగ్రగణ్యకృపగాంచివసింతు రనంతసంతతా
ధారసముల్లసద్విభవితానవికుంఠపురీవరంబునన్. ౧౦౦

తా॥ "శ్రీరామ" అనుపదంబు నొక్కమాఱు భక్తితోస్మరించిన మానవుడు నూరుజన్మంబులందు వైకుంఠమునందు నివాసముగ నుండితీరును. 100

మూ. రాశబ్దోచ్చారమాత్రేణముఖాన్నిర్యాతిపాతకాః
పునః ప్రవేశభీత్యాచ మకారస్తుకవాటవత్. ౧౦౧

చ. గరిమరవర్ణమెన్నగ నఘంబులువాక్కుహారంబునంజనం
దిరిగి ప్రవేశభీతిని నతిత్వరితంబు మవర్ణమెన్నగా
పరగకవాటమౌనెరిగి ప్రాజ్ఞజనుల్కలివేళయింపుగ
స్మరణనుజేసిపొందుదురు శాశ్వతమైతగుముక్తిమార్గమున్. ౧౦౧

తా॥ "రామ" అను రెండక్షరములలో రకారమునుపఠించిన నమస్తపాపంబులుపోవును. ఆపాపములు మరలహృదయంబునకు జొరకుండ మ అనునక్షరము తలుపువేసినట్లు బంధించును. 101

మూ. శ్రీరామాయణమాదికావ్యమృషిణా వాల్మీకినానిర్మితం
వేదాంతార్థవిశారదైరనుదినం స్తుత్యంసురైరర్చితం
శ్రోతౄణామఘనాశనం సురతరోస్తుల్యంతు ముక్తిప్రదం
యేశృణ్వంతిపఠంతిరామచరితం తేయాంతివిష్ణోఃపదం ౧౦౨

శా. శ్రీరామాయణమాదికావ్య మగజాసేవ్యంబు వాల్మీకిచే
నారూఢంబుగనిర్మితంబు నిగమాంతార్థ ప్రబోధంబు మం
దార ప్రాయము ముక్తిదంబు విబుధ స్తవ్యంబుదీనిన్ వినన్
ఘోరాఘౌఘహరంబగున్ చదువ వైకుంఠంబు ప్రాప్తంబగున్.

మ. శివసామ్యుండగు నాదిశంకరులుమున్ శ్రీరామకర్ణామృతం
బవసన్ సంస్కృతమేర్పరించె నదిమోక్షాపేక్షచేకూరు వం
శవరాబ్ధీందు ప్రసిద్ధసిద్ధకవినే శ్రద్ధన్ తెనుగించి రా
ఘనపూదండగ నిచ్చినాడగొనుమా కల్పంబుగాసత్కృపన్. ౧౦౨

తా॥ శ్రీరాముని దివ్యచారిత్రమగు రామాయణము కార్యము
లలో మొదటిది. వాల్మీకి రచియించినది. వేదార్థబోధిని కల్పవృక్షము
వంటిది. ముక్తినిచ్చునది. దేవతలకు స్తుత్యంబు. దీనివినినను చదివినను
వైకుంఠంబుకలుగును. 102

మాలిని. విమలకమలమూర్తిః విస్ఫురన్నీలమూర్తిః
శమదమగుణవర్తిః సాదుసంతాపహర్తిః
సుమశరసమగాత్రా సూరిసంస్తోత్రపాత్రా
సమదదనుజజైత్రా క్ష్మాతనూజాకళత్రా.

గద్యరూప వృత్తము.

ఇది శ్రీరామపాదారవింద మకరందేచ్ఛాత్మునన్మత్తష
ట్పదవిజ్ఞానపదాబ్జరేణుపటల ప్రాప్తోత్తమాంగోల్లస
న్మదితాంతఃకరుణుండు సిద్ధకవిమాన్యుండైనరామావనీ
శదయాలోలనచేతజెప్పె ప్రథమాశ్వాసంబభీష్టాప్తికిన్.

శ్రీ రా మ క ర్ణా మృ త ము.

ప్రథమాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీరస్తు.

# శ్రీ రా మ క ర్ణా మృ త ము.



## ద్వి తీ యా శ్వా స ము.

శ్లో॥ శ్రీరామంకనకక్షితీశ్వరసుతా వక్త్రాంబుజాహారిణం
శ్రీమద్భానుకులాబ్ధికౌస్తుభమణిం శ్రీరత్నవక్షస్థలం
శ్రీకంఠాద్యమరౌఘ రత్నమకుటాలంకార పాదాంబుజం
శ్రీవత్సోజ్జ్వలమింద్రనీలసదృశం శ్రీరామచంద్రంభజే. ౧

శా. శ్రీమద్భానుకులాబ్ధికౌస్తుభమణిన్ శ్రీవత్సబాహాంతరున్
సోమాదిక్రతుభుఙ్మణీమకుట నచ్ఛోభాంఘ్రిపద్మున్ధరా
భామాజాన్యసరోజమిత్రు విలసత్ప్రాకారరత్నాంగు శ్రీ
రామున్ దారక నామునామదిని నారాధింతునశ్రాంతమున్. ౧

తా॥ సూర్యకులంబునకు మణియు సీతకు ప్రాణవల్లభుండును క్షేత్రక్షస్థలుండును శివుడు మొదలగు దేవతలచే సేవింపబడువాడును నగు రామునారాధింతును.

1

శ్లో॥ శ్రీరంగేశపదాబ్జలగ్నహృదయం శ్రీశంఖచక్రాన్వితం
శ్రీమన్నిజకరపాదపస్ఫుటపదం శ్రీసింహపీఠస్థితం
శ్రీవైకుంఠసహస్రమస్తకం సదోభ్ఛగాసనేశాయినం
శ్రీభూమీనుతమాయుతశ్రితనిధిం శ్రీరామమూర్తింభజే. ౨

శా. శ్రీరంగేశపదాబ్జలబ్ధహృదయుఁ శ్రీచందనస్థాన వి
స్తారావ్యన్మణ తసంస్థితుల సచ్ఛక్రాబ్జహస్తాబ్జశృం
గారాకారవికుంఠధామహరి భుక్పర్యంకశాయిన్ హరిఁ
శ్రీరామున్ ధరణీసుతాయుతు శ్రితార్థిఘ్నుంభజింతున్ మదిఁ. ౨

తా॥ రంగేశపదాబ్జలగ్న హృదయుండై శంఖచక్రాన్వితుం డును కల్పవృక్షమువలె వెస్ఫుటమగు పాదంబులు కలవాడును సింహాపీఠాధిష్ఠితుండును శేషశాయియు నాశ్రితవత్సలుండునగు రాముని స్మరింతును. 2

శ్లో॥ ఆనందనంద మరుణాధర మంబుజాక్ష
మాసీతస్త్రమతశ్రీకుసు మోజ్జ్వలాంగం
అళాంతవర్ణ మతలంత మమేయ మాద్య
మతాకృతిం రఘుపతి శరణాగతోస్మి. 3

మ. అకలంకాత్మునమేయునాద్యుహరి నిత్యానందునర్వామరా
ధిపుగంజాక్షుడువర్ణచే సధరువాదిళాంతవర్ణాత్ముదా
రకనామున్నవపల్లవాధరువరున్ రామున్ఘనశ్యాము సే
వకమందారుసుదారుధీరజనతాద్యుఁ మదిన్ గొల్చెదన్. 3

తా॥ ఆనందసముద్రుండును ఎఱ్ఱని యధరంబుకలవాడును పద్మాక్షుండును/నల్లనివర్ణమువాడును నిరంకుశప్రతాపుండును సుందరరూపుండును నగు రాముని శరణువేడెదను. 3

శ్లో॥ సాకేతేనవరత్నపంక్తింఖచితే చిత్రధ్వజాలంకృతే
వామేస్వర్ణమయేదశాష్టలలితే పద్మావిమానోత్తమే
ఆసీనంభరతాదిసోదరజనైః శాఖామృగైః కిన్నరైః
దిక్పాలైర్మునిపుంగవైః నృపగణైః స్సంసేవ్యమానంభజే. ౪

మ. తనసాకేతమునన్ మణిధ్వజలసత్సౌధంబునఁ బుష్పకం
బునహేమాష్టదళాబ్జమధ్యమమునం బొల్పొంది భ్రాతృవ్యులఁ

జనుల్ దిక్పాలుర్ గపుల్ నృపులు నాపుల్ కిన్నరుల్ సంతసం
బున గొల్వంజెలువొందు రాముదలతున్ భూపుత్రికాధీశ్వరున్. ౪

తా॥ అయోధ్యాపురంబున మాణిక్యరచిత సౌధంబునందు పుష్పకంబున బంగారుపద్మదళములమధ్య తమ్ములును దిక్పతులును రాజులును వానరులును బంధువులును కిన్నరకింపురుషాదులును గొల్వ ప్రకాశించు రాముని సదా నామానసమున దలచెదను. 4

శ్లో॥ కందర్పాయుతకోటికోటితులితం కాలాంబుదశ్యామలం
కంబుగ్రీవముదారకౌస్తుభధరం కర్ణావతంసోత్పలం
కస్తూరీతిలకోజ్జ్వలంస్మితనిభం చిన్ముద్రయాలంకృతం
సీతాలక్ష్మణవాయుపుత్రసహితం సింహాసనస్థం భజే. ౫

మ. ఘనబాణాయుతసుందరుఁ లలితకస్తూరీలలాటజ్జ్వలుఁ
కుముదశ్యాముసలక్ష్మణానిలసుతు న్సజ్యాన్వితుఁ గౌస్తుభా
ఖ్యమణియుక్తశుభాస్యకంబుగళునిఁ గర్ణావతంసాప్రభా
నుముకుందున్ మణిపీఠగుఁ గొలిచెదన్ చిన్ముద్రయాలంకృతుఁ.

తా॥ కోటిమన్మథులవలె సుందరరూపుడై వెలుంగుచు వర్షాకాలమేఘమురీతి శ్యామలుండై శంఖమువంటి కంఠంబును గౌస్తుభ మణియుకస్తూరీతిలకంబును కలిగి హనుమంతుని చేతను సీత చేతను సుమిత్రాసుతునిచేతను సేవింప బడుచుండు రాముని సదా నేను సేవించుచుందును. 5

శ్లో॥ వరాభయందివ్యరథాంగశంఖం । సకౌస్తుభం వేష్టితపీతవస్త్రం
కిరీటహారాంగదకుండలాంగం । శ్రీవత్సచిహ్నంశిరసానమామి.

మ. అరిభీకృద్దరవంకనందకగదాద్యస్త్రున్ మహాకౌస్తుభా
భరణున్ రత్నకిరీటకుండలధరున్ బీతాంబరాడంబరున్
వరదుఁ శ్రీరఘురామభూరమణు శ్రీవత్సాంకుసీతావనో
హరుగారుణ్యావయోనియోధిమదిలో నశ్రాంతమున్ గొల్చెదఁ. 6

తా॥ శత్రుభీకరుండును దివ్యరథాంగరథుండును పీతాంబర ధరుండును కిరీటహారాంగదభూషణుండును శ్రీవత్సచిహ్నుండును నగు రామునిమనసార స్మరింతును. 6

శ్లో॥ దిగంబరకింకిణిమేఖలోజ్జ్వలం । లలాటపర్యంతవిలంబితాలకం
కలద్వచస్కందమనీయనూపుర । ద్వయంకుశంరాఘవహంనమామి ౭

చ. ఘనమణినూపురద్వయుదిగంబరుగింకిణిమేఖలోజ్జ్వలుఁ
ఘనునికలాభిభాషణు నిగ్రమలలాట విలంబితాలకుఁ
జనులకుతల్లితండ్రులకు సంతసమొప్పజెలంగుబాల రా
మునువినుతించిసంతతము మ్రొక్కుచునుందు హృదంతరంబునన్.

తా॥ ఘనమణినూపురద్వ యుండును. లలాటమువఱకు వ్రేలాడు ముంగురులు కలవాఁడును చక్కనినూపురంబును కలిగియుండురామునికివందనములు. 7

శ్లో॥ మందారమలేమణిపీఠసంస్థం । సునాప్లుతందివ్యవిరాట్స్వరూపం
సబిందునాదాంతరతాంతితుర్య । మూర్ధింభపహ్నారఘువంశరత్నం

మ. అకలంకామరభూజసంస్థ మణిపీఠాసీను నిన్నాదబిం
దుకళాతీతవిరాట్స్వరూపుభగవంతుఁ సర్వలోకాధినాయ
కుసీతేశుసుధాభిషిక్తు మనువంశాంభోధిచింతామణిన్
సకలాత్ముఁ రఘురామరత్నమగు నాస్వామిఁ మదిన్ గొల్చెదన్

తా॥ మందార వృక్షమూలంబునందు రత్నపీఠంబున వసించిన వాఁడును సద్గుణవిరాజితుండును రఘువంశరత్నమువంటివాఁడును నగు రామునిహృదయంబున స్మరింతును. 8

శ్లో. అనర్ఘ్యమాణిక్యవిరాజమానం। శ్రీపాదుకాలంకృతశోభనాభ్యాం
అశేషబృందారవందితాభ్యాం । నమోనమోరామపదాంబుజాభ్యాం
ధ్వజాంబుచ్ఛత్రరథాంగశంఖం । దంభోళిపాశాంకుశ మత్స్యచిహ్నం
బ్రహ్మేంద్రదేవాదికిరీటకోటి । సంకర్షణపాదాంబుజ యుగ్మమీళే.

చ. అనుపమనూత్న రత్ననిచయ ప్రచయోజ్జ్వలనవ్యపాదుకా
వసములువారిజప్రభవవాసవచంద్ర దినేంద్రముఖ్యపా
వసమకుటాగ్రశోభితవరాణమణి సమలంకృతంబులున్
వసజరథధ్వజాంబుశరపాశ హలాంకుశపుండరీకలాం
ఛనములురామచంద్రపదసారసముల్ మదినిల్పిగొల్చెదన్. ౯

తా॥ విలువగల మాణిక్యములచే కాంతిల్లుచుండినవియు బ్రహ్మాదులచే నుతింపబడునవియు శంకచక్రపద్మాదులచేతను ధ్వజాంకుశంబుల చేతను నొప్పుచు విరాజమానంబగు రాముని పాదపద్మంబుల నాశ్రయింతును. 9

మూ. లలాటదేశోజ్జ్వలబాలభూషణం। సతాండవంవ్యాఘ్రనఖాంకకంఠ
దిగంబరంశోభితబర్బరాలకం। శ్రీబాలరామంశిరసానమామ్యహం

ఉ. ఫాలమునన్ లలామమును భాసిలతాండవమాచరింపుచున్
లీలదిగంబరత్వమును లేనగవున్ గళంబ మాన శా
ర్దూలనఖంబుముంగురులరోచులుబర్వ నఖర్వమై ఖరిన్
బాలకుడై నటించుమునిపాలనశీలుని రాముగొల్చెదన్. ౧౦

తా॥ లలాటప్రదేశమున బాలభూషగలవాడును కంఠమున పులిగోరును ధరించి నృత్యముచేయువాడును దిగంబరుండును కాంతించుముంగురులు కలవాడును నగురాముని స్మరించుచున్నాను. 10

శ్లో॥ శతాష్టదివ్యస్థమునీంద్రవందితం। శతక్రతుబ్రహ్మమరుద్గణార్చితం
శశాంకవైశ్వానరభానుమండలం। స్థితంభజేహం రఘువంశవర్ధనం.

చ. అమలశతాష్టదివ్య నిలయస్థితు వారిజసంభవాంబుభృ
ద్గమనముఖామరార్చితు సుధాకరవహ్నిపతంగమండల
స్థమితురఘూద్వహుంగనకచేలుగృపాలుని నీలుదైత్య సం
లమసదినేశురామజననాదుభజించెద నిష్టసిద్ధికిన్. ౧౧

తా॥ నూటయెనిమిది దివ్యస్థలంబులందుండి బ్రహ్మేంద్రాదులచే పూజింపబడుచు సూర్యచంద్రాగ్నిమండలస్థుండైన శ్రీరాముని నేసేవింతును. 11

మూ. కర్ణాంతవిశ్రాంతధనురుణాంకం । కదంబలక్ష్మీశ్రితరాక్షసేశ్వరం
వృద్ధశ్రవస్యందనమధ్యసంస్థం । రూపేక్షణంరామమహంనమామి

శా. పాకారాతిశతాంగమెక్కి రణభూభాగంబుగంపింపగా
నాకర్ణాంతధనుర్వ్యముక్తదృఢ బ్రహ్మాస్త్రంబునన్ రావణున్
లోకంబుల్వినుతింపద్రుంచిన బుధశ్లోకున్ సరోషాంబకుం
గాకుత్థాన్వయదుగ్ధవారినిధి రాకాచంద్రుగీర్తించెదన్. ౧౨

తా॥ ఇంద్రుని రథమెక్కి యుద్ధభూమి వడకునట్లు ధనస్సునా కర్ణాంతముగాలాగి బ్రహ్మాస్త్రమేసి రావణునిచంపి జగంబున ప్రసిద్ధినొందిన రామునికీర్తిని కొనియాడుదును. 12

శ్లో॥ సుత్రామనీలోత్పలనీలమేఘ । శ్రీనిర్జితాంగంసుతయాధరస్యాః
యుక్తంసురేంద్రాననమానసంతం। రామంభజేరాక్షసవంశనాశనం.

మ. హరినీలోత్పలమేగసంపదపహారాంగున్ ధరాభామినీ
వరపుత్రీరహితున్ సమస్తముఖ భృగ్వర్యాపనాంతర్యునిన్
ధరణీనాథసురారివంశవని నిర్ధగ్ధాగ్ని హేహూత్రుగ్ బరా
త్పరుదీనార్తిహరున్ రఘూద్వహుసుదిగ్ భావించిసేవించెదన్. ౧౩

తా॥ యింద్రనీలమాణిక్యమువంటి శరీరకాంతికలిగి సీతతో కూడి యింద్రాదులచే గౌరవింపబడుచు రాక్షసులనాశన మొనర్చిన రాముని సేవింతును. 13

శ్లో॥ రాకాచంద్రనిభాననంరతిపతి ద్వేషిప్రియంరాక్షసా
ధీశగ్రీశవిభేదనస్ఫుటపటు ప్రఖ్యాతబాహోజ్వలం
రత్నాలంకృతనాదుకాంచితపదాంభోజాం రమావల్లభాం
రాగద్వేషవిహీనచిత్తసులభం రామంభజేతారకం ౧౪

శా. రాగద్వేషవిహీనచిత్తసులభుఁ రాకేందుబింబాననుఁ
భోగీంద్రాభరణప్రియుఁ దనుజ రాణ్మూర్ధచ్ఛిదాప్రోజ్జ్వలున్
వాంగీంద్రార్చితపాదుకాంచితుల సత్పాదాంబుజాతద్వయుఁ
శ్రీగోవిందురమాధినాథువరదున్ శ్రీరాముసేవించెదన్. ౧౪

తా॥ పౌర్ణమినాటి చంద్రుని రీతినుండు మొగంబుకలిగి శివున
కు ప్రియుఁడై రావణుని శిరంబుల నరకుటచే కీర్తివంతుఁడై రాగద్వే
షవిహీనుల చిత్తంబులకు సులభుఁడై యుండురాముని సదాస్మరింతును.

శ్లో॥ ఆలోలస్ఫురరత్నకుండలధరం ధీరస్మితాలంకృతం
ఆధారాదికచక్రమండలగతం ఆనందకందాంకురం
ఆవిర్భూతకృపాంతరంగజలధిం అశ్రాంతవర్ణాశ్రయం
ఆపన్నార్తనిదాఘ మేఘసమయం రామంభజేతారకం. ౧౫

మ. అకలంకోజ్జ్వలరత్నకుండలు సమస్తానందకందున్మహా
ధికషట్చక్రనివాసురామ విభునాధిశ్రాంత వర్ణాత్ముతా
రకసంభూతకృపాంతరంగజలధిఁ భ్రాజిష్ణుత్విటాస్యేందు సే
వకపున్ నిదాఘమేఘునుత గీర్వాణుఁ భజింతున్ మదిన్. ౧౫

తా॥ చలించుకుండలములు కలచెవులును చిఱునవ్వునువినయం
బును సూచించు మొగంబును సమస్తజనుల కానందమిచ్చు చిత్తం
బును దయను దెలుపు చూపులునుకలిగి శరణనివచ్చినవారల రక్షిం
చురాముని నేను సేవించితరింతును. 15

మూ. సాకేతాంతరతారమంటప మహామాణిక్యసింహాసనే
తన్మధ్యేష్టదళాంబుజేస్ఫుటతరే చిత్కర్ణికేసంస్థితం
సౌమిత్ర్యాంబుజమిత్రసూనుభరత శ్రీవాయుపుత్రైర్వృతం
ముద్రాలంకృత పాణిసారసముజం రామంభజేతారకం. ౧౬

శా. సాకేతాంతరరత్నమంటపవి రాజత్సింహపీఠంబునం
దేకాష్టచ్ఛదపద్మకర్ణికను దానిఁపొందిశాఖామృగా

నీకంబుల్ నిజసోదరు ల్గొలువ పాణింబోధముద్రాంకుఁడవు
కాకుత్థ్సున్ రఘురాముతారకమొగిన్ గాంక్షించిసేవించెదన్. ౧౬

తా॥ అయోధ్యలో రత్నమయమండపమున బంగారుపీఠంబునసష్ట
దలపద్మంబులమధ్య చుట్టునుభరతలక్ష్మణ శత్రుఘ్నులునుహనుమదాది
వానరులునునుండి సేవచేయుచుండ వెలుంగురాముని సదాస్మరింతును.

మూ. విదాజమనోజ్జ్వలపీతవాసం । విశాలవక్షస్స్థలకౌస్తుభశ్రియం
భజేకిరీటాంగదరత్నకుండలం । నమస్తులస్యామలమాలయాంకితం

ఉ. చారుసువర్ణచేలుని విశాలభుజాంతరకౌస్తుభోజ్జ్వలున్
శ్రీరమణీయకుండల కిరీటశుభాంగద తారహార మం
జీరవిభూషణాంగు తులసీదలరాము గుణాభిరాము సీ
తారమణీహృదుత్పల సుధాముని రాముని సన్నుతించెదన్. ౧౭

తా॥ పీతాంబరధరుండును విశాలవక్షుండును కౌస్తుభరత్నా
లంకృతుండును కిరీటరత్నకుండల భూషణుండును సద్గుణాభిరాముండు
నునగు రామునికి నమస్కరింతును. 17

మూ. మూలాదిషట్సరసి జాంతసహస్రపద్మ
పత్రాంతరాళనిలయం భవబంధనాశం
నాదాంత చంద్రగళితామృత సిక్తరూపం
నాదాంతనాద మహిమాస్పద రామమీశే. ౧౮

మ. అరయన్ షట్కమలోపరిస్థిత సహస్రారాంతరాళస్థితున్
వరనాదాంత శశాంకనిగళిత దేవాహారధారా ప్రవి
స్తరసంసిక్తశరీరుభావహరుసచ్ఛారిత్రునాదాంత నా
దురమేశున్ బరమేశు రాము భజియింతునాన్వంతమం దెంతయున్.

తా॥ మూలముమొదలగు నారువేల పద్మంబులందుండి సంసా
రబంధ వినాశహేతుడై నాదాంతచంద్ర గళితంబగు రూపంబునను
దుమహిమాన్వితు నారామునినుతించెదను. 18

మూ. వందేవరప్రద మహావరదానగర్వ
లంకాధినాధకులపర్వత నాశవజ్రం
తంరావణానుజ మరుత్సుతభానుసూను
దిక్పాలసోదరగణైః పరిసేవ్యమానం. ౧౯

మ. కమలభవప్రదత్తవరగర్విత పూర్వసుపర్వనాయకో
త్తమునివధించి ముఖ్యులగు తారవిభీషణనీలజాంబవ
త్కుముదమరుత్సుతార్కజులు గొల్వదిగీశులుసోదరుల్ప్రతో
షమున భజింప నింపలరు సద్గుణధాముని రాము నెన్నెదన్. ౧౯

తా॥ బ్రహ్మయిచ్చిన వరంబులవలన గర్వించిన రావణునిచంపి ముఖ్యభక్తులగు విభీషణనీల జాంబవంత హనుమత్సుగ్రీవాంగదులు కొలువ నష్టదిక్పాలురును తమ్ములును సేవింపుచుండ నుండు రాముని నామనంబున తలంతును. 19

మూ. అజ్ఞానగాఢతిమిరాపహ భానుమూర్తి
మారక్తచారునయనాంబుజ మాదిబీజం
అంభోధిమధ్యవటపత్రశయన మాది
మధ్యాంతశూన్య మఖిలాస్పద రామచంద్రం. ౨౦

మ. అరుణాబ్జాక్షుసముద్రమధ్యవటపత్రాత్యంతరస్థాయికన్
స్ఫురదజ్ఞానతమిస్రభాస్కరు జగత్పూర్ణాత్మనాద్యంతశూ
న్యు రమాధీశ్వరు నాదిబీజున సమానున్మానితోదారు సుం
దరమందస్మితు రామచంద్రుని మదిధ్యానింతునశ్రాంతమున్. ౨౦

తా॥ అజ్ఞానమను చీకటిని బోగొట్టుటకు సూర్యునివంటి వాడును ఎఱ్ఱతామరలవంటి నేత్రంబులు కలవాడును మూలకారణుండును సముద్రమధ్యమున వటపత్రమున శయనించి మొదలు, మధ్య, తుది, లేక నన్నిచోటులనుండు రామచంద్రునకివే వందనములు. 20

శ్లో॥ మహాసముద్రాంతవిరాజమాన । ద్వీపేసితేచందనపారిజాతే
మహావనే పన్నగతల్పమధ్యే । నిషణ్ణమీశంరఘువంశరత్నం. ౨౧

శా. క్షీరాబ్ధ్యంతపితాంతరీపవిలసచ్ఛ్రీచందనాగాంతిక
స్వారానిఘ్నవిమానరత్నచయప్రద్యోతపీఠంబునం
దారూఢంబగుకాద్రవేయవరపర్యంకాంతరాసీనుఁడౌ
శ్రీరాముఁడు రఘువంశలరత్నముమదిన్ జింతింతునశ్రాంతమున్.

తా॥ క్షీరసముద్రమధనమున ప్రకాశించు తెల్లని ద్వీపంబున పారిజాతంబులతోను చందనముతోను నిండిన శేషశాయిపై మహాసనంబువై చికొనియుండు రఘువంశమణియగు రామునిస్తుతింతును. 21

శ్లో॥ స్మితాననంపద్మదళాయతేక్షణం । వినీలమాణిక్యజితాంగశోభితం
జటాకిరీటంశరచాపలాంఛనం । నమామ్యహంభానుకులాబ్ధికౌస్తుభం

ఉ. సుందరమందహాసు పరిశుద్ధసరోరుహపత్రనేత్రుఁబౌ
రందరనీలగాత్రుని విరాజిత భవ్యజటాకిరీట సా
నందనకార్ముకాస్త్రు జననాయకు భానుకులాబ్ధికౌస్తుభుం
జందనచర్చితాంగురఘుసత్తముని న్మదిలో భజించెదన్. ౨౨

తా॥ చిఱునవ్వు మొగంబునవెలయ వికసించి నేత్రంబులుచూపరుల కానందమీయ నింద్రనీల మాణిక్యములపోల్కి శరీరముదీపింప కిరీటకుండలాదుల ధరించిన సూర్యకులోద్ధారకుడగు రామునకు నమస్కారమర్పించు చున్నాను. 22

మూ. ప్రసూనబాణాంకితమిక్షుచాపం। చక్రాబ్జపాశాంకుశపంచనాళం
ధరంకరైరష్టభిరర్కవర్ణ। శ్రీకృష్ణరూపంప్రణమామిరామం.

చ. కరములనెన్మిదింట సుమకాండము వేణువు నిక్షుచాపమున్
దరముఖశాంకుశంబులు సుదర్శనపాశములుంధరించి భా
స్కరనిభవర్ణుడై మహిత సత్కరుణాకర కృష్ణమూర్తియై
బరఁగినరామచంద్రునకుఁ బావనకీర్తికి భక్తిమ్రొక్కెదన్. 23

తా॥ ఎనిమిది చేతులందును పూలనుపిల్లనగ్రోవిని ధనువును చక్రమును పాశమును అంకుశమును ధరించి సూర్యునిరీతి వెలుంగుచు

కరుణారుండైన రామచంద్రునకు భక్తితో వందనములిచ్చుచున్నాను. 23

శ్లో॥ బాహూరుపాదోదరవక్త్రలోచనం । దీప్తప్రచండానలదుర్నిరీక్ష్యం
అశేషబృందారకనాగగోచరం । భజామిదేరాఘవవిశ్వరూపం. ౨౪

మ. కరపాదోదరలోచనోరు ముఖసంక్రాంతోచ్చటా
స్ఫురితంబై కడుదుర్నిరీక్ష్యమయి । దిక్పుంజంబులన్నింటి ని
జకరవాఙ్మానసదుర్లభంబైన రాజనేభుంరామావనీ
శ్వరువిశ్వాకృతి కేనొనర్చెద నమస్కారంబులశ్రాంతముగ్. ౨౪

తా॥ కరచరణాద్య వయవంబుల భక్తులకు స్వరద్రూపుడై యు
న్నకిగూడ చూడనశక్యుడై విశ్వరూపాత్మకుండగు రామునికి నమస్క
రించుచున్నాను. 24

శ్లో॥ సహస్రనేత్రాననపాదబాహు । మనంతవీర్యంరపకోటితుల్యం
స్రక్చందనాలంకృతదివ్యదేహం । భజామ్యహంతేహరివిశ్వరూపం

మ. కరనేత్రాననశీర్షపాదములువిఖ్యాతిగ్ సహస్రాంకమై
సరసీజాప్తసహస్రకోటినిభమై స్రక్చందనాలంకృతా
స్ఫురితంబయ్యు ననంతవీర్యమయి సంపూర్ణప్రభావాఢ్యమై
పరగున్ రాఘవువిశ్వరూపముమదిన్ భావించిసేవించెదన్. ౨౫

తా॥ నేత్రంబులు మొగంబులు బాహువులు పాదంబులు వేయి
వేయి కలిగి యనంతవిక్రముండై కోటిసూర్య ప్రభావిలసితుండగుచు
చందనము పూగుత్తులు కస్తూరి మొదలగు వానిచే నిండిన శరీరంబు
కలిగిన రామచంద్రునే సేవింతును. 25

శ్లో॥ కదంబకోదండపదాబ్జసంయుతం
దంష్ట్రాకరాళాంక ధనంజయాననం
పీతాంశుకస్వర్ణ కిరీటకుండలం
భజామితేరాఘవవిశ్వరూపం. ౨౬

మ. ధరికోదండగదాకదంబయుతముఁ దంష్ట్రాకరాళాగ్ని వి
స్ఫురదాస్యంబుసువర్ణచేలధృతముఁ భూరిప్రభారత్నక
ర్బురమంజీరకిరీటకుండలమహాభూషోజ్జ్వలంబున్ శుభ
స్ఫురమౌరాఘువవిశ్వమూర్తికి నమస్కారంబులర్పించెదన్. ౨౬

తా॥ ధనువును గదను ధరించి దంతకాంతిచే వెలుంగు మొగం
బుకలిగి సువర్ణచేలంబుకట్టి కిరీటకుండలంబుల బెట్టుకొని యుండు రా
ముని భజించెదను. 26

శ్లో॥ కోదండమిక్షుజనిత స్మరపింఛబాణం
శంఖంరథాంగయుగ మంకుశ పాశవేణుం
అష్టైకరైర్ధ్నమణి ద్యుతిముద్వహంతం
ప్రద్యుమ్నకృష్ణమనిశం భజరామచంద్రం. ౨౭

చ. చెరుకువిలైదుబాణములచే ధరియించిరథాంగవేణు పా
శరుచిరశార్ఙముఖ్య ఘనసాధనయుక్తి మహోష్టబాహు సుం
దరహారినీలగాత్రు బరుదర్పకుకృష్ణు సువర్ణచేలుదా
శరథిబలాధిపుఁ శరధి సన్నుతునచ్యుతు రాముగొల్చెదన్. ౨౭

తా॥ చెరుకువిల్లైదు బాణంబులచే ధరించి వేణువును శంఖపాశం
బులును గలిగి యెనిమిదిచేతులతో ప్రకాశింపుచు నుండు రామచం
ద్రుని నుతింతును. 27

శ్లో॥ సీతాలోకనతత్పరంమణినిభం వ్యాఖ్యానచిద్రాంచితం
వామేజానునితంబహస్తమనిశం వీరాసనేసంస్థితం
మూలేకల్పతరొరనాదిమునిభిః బ్రహ్మాదిభిస్సేవితం
ముక్తాహారకిరీటకుండలధరం మూర్ధ్నాభిషిక్తంభజే. ౨౮

మ. విమలుఁగల్పక మూలసంస్థితుమహా వీరాసనుఁ జానకీ
రమణీదర్శనతత్పరున్మణినిభున్ రత్నోజ్జ్వలద్భూషణుం

బ్రమదంబొ సువిలంబహస్తువరదున్ వ్యాఖ్యానముద్రాంచితున్
సుమనఃపూర్వభవాదినిర్జర మునిస్తోత్రున్విభున్గొల్చెదన్. ౨౮

తా॥ సీతను చూచుట యందాసక్తికలిగి వ్యాఖ్యాన ముద్రాంకితుడై రత్నభూషణంబులు ధరించి మోకాలివఱకు వ్రేలాడు చేతులతో నొప్పి వీరాసనంబు వైచికొని కల్పతరుమూలమున బ్రహ్మాదులుఁనుతి సేయ విరాజిల్లు నాముని దర్శించి ధన్యుడనైతిని. 28

మూ. యద్రూప మానందకరం మునీనాం
యద్బాణమాఖండల శత్రునాశనం
యద్దైవతం సర్వజనాంతరస్థం
తత్సర్వరూపం రఘునాథమీళే. ౨౯

ఉ. ఎవ్వనిమూర్తి యోగితతి కెప్పుడు సంతసమొందఁ దా
నెవ్వనికాండ మాసురమహేంద్ర విరోధివినాశకారణం
బెవ్వఁడు విశ్వవిశ్వగతుఁ డెవ్వఁడు భక్తజనావనప్రియుం
డెవ్విభుఁడైనరాముని కహర్నిశము న్నతులాచరించెదన్. ౨౯

తా॥ ఎవని రూపముచూడ మునులానందపడుదురో యెవనిబాణము రాక్షసనాశనకరంబో యెవనినామము సర్వజనుల హృదయంబునందు నుండదగినదో యారామునికొనియాడెదను. 29

మూ. ఖశ్యామంఖగవాహనంఖరరిపుం ఖాద్యాదిభూతాత్మకం
ఖాతీతంఖగమంత్రతత్పరసదం ఖద్యోతకోట్యుజ్జ్వలం
ఖావాచ్యంఖగకేతనం ఖగతునం ఖర్వాటశృంగాలయం
ఖారార్యంచకరంధ్రవీరనిలయం రామంభజేతారకం. 30

మ. ఖరవైరిఁ ఖగవాహనున్ రవినిభున్ ఖర్వాటశృంగాలయున్
పరమార్థాంచితమంత్రతత్పరు వియద్భ్రాజిష్ణుఖారార్యు సు
స్థిరవేదాంతమయున్ విచిత్రగమనుఁ శ్రీపంచభూతాత్మకున్
వరనద్యోతు సుషుమ్నమధ్యగతు శ్రీనాథున్ బ్రశంసించెదన్. 30

తా॥ ఖరుడను రాక్షసునకు శత్రుండు పక్షివాహనముగా గల వాడును సూర్యునివలె ప్రకాశించువాడును మేఘముపోలిక నల్లనైన వాడును పంచభూతాత్మకుండును వేదాంతమయుండుననగు రాముని నుతించెదను. 30

మూ. వేద్యంవేదగురుంవిరించిజనకం వేదాంతమూర్తిస్ఫుర
ద్వేదంవేదకలాపమూలమహిమాధారాంతకందాంకురం
వేదశృంగసమానశేషనయం వేదాంతవేదాత్మకం
వేదారాధితపాదపంకజమహం రామభజేతారకం. ౩౧

శా. వేదాదారుసమస్తవేదగురునిన్ వేదాంతవేద్యుఁ లస
ద్వేదారాధితపాదపంకజయుగుఁ వేదాంతమూర్తిమహా
వేదభ్రాజితవేద్యుబ్రహ్మజనకున్ వేదాంతభావోల్లస
ద్వేదాగ్రేసరతల్పురాము మహిమాధారున్ బ్రశంసించెదన్. ౩౧

తా॥ వేదాధారుఁడై వేదగురుఁడై బ్రహ్మకుతండ్రియై వేదాంత వేద్యుండై వేదాంతమూర్తియగుచు వేదంబులారాధింపఁదగినపాదంబులతో నొప్పి వేదమహిముం డగుచు శేషశాయియగు రాముని సేవింతును. 31

మూ. మూలాధారధనంజయస్ఫుటపటు జ్వాలాసమాలింగితం
మూర్ధన్యాంతశశాంకమండలగతం క్షీరాభిషేకప్రియం
ముక్తాశోభితమాళిభిమున్వివరై రారాధితంభావయే
ప్రఖ్యాతైస్త్రిగుణైర్జనాధి పగణైశ్శాఖామృగైర్దైఁవతం.

మ. ప్రకటాధారమునన్ ధనంజయశిఖాభాసప్రచాయుక్తమ
స్తకపూర్ణద్విజరాజమండల సుధాస్రావాభిషేకప్రియున్
సుకళాశోభితమానివానరమహాక్షోణీశ్వరప్రావృతున్
సకలాస్త్రద్రిగణార్చితున్ గొలుతు భూజాతావిభున్ రాఘవున్. ౩౨

తా॥ మూలాధారుండును శివున కిష్టుండును సమస్త వానర

గణంబులచే, మునులచే, త్రిగుణంబులచే కొనియాడబడువాడును నగు రాముని స్మరింతును. 32

శ్లో॥ తారాకారవిమానమధ్యనిలయం తత్త్వత్రయారాధితం
తత్త్వాఖ్యేశ్వరయోగనిర్గుణమహాసిద్ధైస్సమారాధితం
తత్సంగంతరుణేందరం శేఖరసఖం తారాంప్రయాంతర్గతం
తస్వర్ణకిరీటకుండలయుగం రామంభజేతారకం. 33

శా. తారాకారవిమానమధ్యనిలయుఁ దత్యంతయారాధితున్
సారాచారవశిష్టసిద్ధముని సంస్తవ్యాం ప్రితత్సంజ్ఞకున్
దారాద్రీశ్వరసంతతాప్తుబరమున్ దారాంత్రయాంతర్గతున్
శ్రీరామున్ మకుటాంగదాభరణు సంసేవింతునిష్టాప్తికిన్. 33

తా॥ తారాకారమగు విమానమధ్యమున నిలిచి తత్వత్రయంబుచే నారాధింపఁబడుచు యోగులచే, సిద్ధులచే పూజింపఁబడుచు శివునకు స్నేహితుఁడై యుండు రాముని భజింతును. 33

శ్లో॥ తారంతారకమండలోపరిల సజ్జ్యోతిస్ఫురత్తారకా
తీతంతత్వమసీతివాక్య మహిమాధారంతటిత్సన్నిభం
తత్వజ్ఞానపవిత్రితత్రిభువనం తారాసనాంతర్గతం
తారాంతధ్రువ మండలాబ్జరుచిరం రామంభజేతారకం. 34

శా. తారున్ దారకమండలోపరి ప్రసిద్ధజ్యోతివిద్యున్నిభున్
తారాంతధ్రువమండలాబ్జరుచిరుఁ దారాసనాంతర్గతున్
దారాతీతునుధీపవిత్రితుని సీతానాధుసత్కీర్ణు వి
స్తార్ణుతత్వమసీతివాక్యమహిమా ధారుఁ భజింతుఁ మదిఁ. 34

తా॥ తారకాతీతుండును, నక్షత్రమండలాతీతంబగు జ్యోతియు తారాసనాంతర్గతుండును త్రిభువనంబులను తత్వజ్ఞానంబున పవిత్రమొనర్చినవాడును తత్వాధారుండు నగుచు వెలుంగు రామచంద్రుని సేవ చేయుదును. 34

శ్లో॥ కస్తూరీఘనసారకుంకుమల సచ్ఛ్రిందనాలంకృతం
కందర్పాధికసుందరంఘుననిభం కాకుత్థ్సవంశధ్వజం
కల్యాణాంబరవేష్టితంకలయా యుక్తంకళావల్లభం
కల్యాణాచలకార్ముకప్రియసఖం కల్యాణరామంభజే. ౩౫

మ. శితికంఠాప్తగీమదానుమిళిభృత శ్రీచందనాలంకృతుఁ
క్షితిపుత్రీసహితుఁ ఘనాఘననిభుఁ శ్రీరాముబీతాంబరుఁ
దతిసౌందర్యజితస్మరుఁ బ్రవిలసత్కాకుత్థ్సవంశధ్వజుఁ
హితవిద్యాధితురామభద్రు మదినేనెంతున్ గృపాకాంక్షినై. ౩౫

తా॥ కస్తూరి, మంచిగంధము, కర్పూరము వీనిని శరీరమున నలదికొని మన్మథుని తిరస్కరించు రూపంబున సీతతో కూడి పీతాంబరధరుండై శివునకు సఖుండగు యొప్పు రామభద్రుని నుతింతును. 35

శ్లో॥ మజ్జీవంమదనుగ్రహం మదధిపం మద్భావనంతత్సుఖం
మత్తాంతంమమసద్గురుంమమవరం మోహాంధవిచ్ఛేదనం
మత్పుణ్యంమదనేకబాంధవజనం మజ్జీవనంమన్నిధిం
మత్సిద్ధిం మమసర్వకంమమృతం రామంభజేతారకం. ౩౬

ఉ. మాకుగురుండనుగ్రహుఁడు మజ్జనకుండునిభుండుజీవముఁ
మాకువిమోహవర్జితును మత్సుకృతంబు సుఖంబుభావముఁ
మాకుసమస్తబాంధవనంబు ధనంబుసుకర్మసిద్ధియుఁ
మాకుసమస్తతారకము మారఘురాము నటంచునెంచెదఁ. ౩౬

తా॥ నాకు ప్రాణంబును నాకు ప్రభువును తండ్రియు గురుండును నాహృత్పద్మవాసియు నాపుణ్యరాశియు నాసుఖహేతువును బంధుండును ధనంబును కర్మసిద్ధియునగు రాముని గొలతును. 36

శ్లో॥ నిత్యంనీరదలోచనం నిరుపమం నీవారశూకోపమం
నిర్భేదానుభవంనిరంతరగుణం నీలాంగగోనోజ్జ్వలం
నిష్పాపంనిగమార్చితంగుణపదం నిత్యాత్మకం నిర్మలం
నిష్పుణ్యం నిఖిలం నిరంజనపదం రామంభజేతారకం.

శా. నిత్యున్నిర్జరితుఁ సరోజనయనున్ సీలాంగరాగోజ్జ్వలు
న్నిత్యాత్మున్ విమలు న్నిరంతరగుణు న్నిర్భేదు న్నిష్ప్రపంచున్
సత్యు న్నాత్మనిరంజనున్నిరుపము న్సర్వాత్మయోగీంద్రు సం
స్తుత్యున్నిర్గుణురాముదారకుభజింతుఁ సత్కృపాకాంక్షినై. 36

తా॥ నీరజలోచనంబులతో న్నిత్యుడై సాటిలేని వాడగుచు నిత్యాత్ముడగుచు నిరంతరగుణుండై నిర్భేద్యుడై నిష్ప్రపంచమున వేదాదులచే పూజింపఁదగినవాఁడగు రాముని సేవింతును. 37

శ్లో॥ ధ్యాయేత్వాంహృదయాంబుజే రఘుపతిం విజ్ఞానదీపాంకురం
హంసోహంసపరంపరాదిమహిమాధారంజగన్మోహనం
హస్తాంభోజగదాబ్జచక్రసుతులం పీతాంబరంకౌస్తుభం
శ్రీవత్సంపురుషోత్తమం మణినిభం రామంభజేతారకం 38

మ. హృదయాబ్జంబునగొల్చెదఁ రఘుపతిన్మోమాంబరున్నిస్సమా
నుదయాళుంధృతకౌస్తుభుఁ హరిజగన్మోహనుఁ గదాద్యాయుధుం
ద్రిదశేంద్రాంశనిభుఁ మహామహిమునిఁ శ్రీవత్సవక్షస్థలుఁ
విదితాత్మున్ పరహంసరూపుబురుషున్ విజ్ఞానదీపాంకురున్. 38

తా॥ ఓరామా! నిన్నే హృదయంబున ధ్యానించుచున్నాను. పరమహంసలకు పరముండవు. జగంబులను పుట్టించుచు రక్షించుచు నశింపుచేయుచు నాధారుండవగుచు క్రీడించుచుందువు. నీవు పురుషోత్తముడవు. నిర్గుణుండవు.

శ్లో. సత్యజ్ఞానమనంతమచ్యుతమజం అవ్యాకృతంతత్పరం
కూటస్థాదిసమస్తసాక్షిమనఘం సాక్షాద్విరాట్త్వదం
వేద్యంవిశ్వమయంస్వలీనభువనం స్వారాజ్య సౌఖ్యప్రదం
పూర్ణంపూర్ణతరం పురాణపురుషం రామంభజేతారకం. 39

మ. అరఘుంబూర్ణు ననంతునచ్యుతుని సత్యజ్ఞానమూర్తి విరా
ట్తనువిశ్వాత్మ జగన్మయున్ పరము కూటస్థాయిసాక్షి న్ననా

తనునవ్యాకృతు జీవనతత్పరు సుత్రామాదిభోగప్రతున్
ఘనునిన్ వేద్యుబురాణపూరుషున్ గాకుత్థ్ససేవించెదన్. ౩౮

తా॥ సత్యజ్ఞానంబున ననంతుండగుచు విశ్వాత్మతతో జగన్మ
యుండై వరంబులను భక్తుల కొసంగుచు స్వారాజ్యసుఖంబుల వీడి
పితృవాక్యపరిపాలకుఁడగుచు పురాణపురుషుండగు రామచంద్రుని
నుతింతును. 39

మూ. రామంరాక్షసవంశనాశనకరం రక్తాధరంరాఘవం
రక్షోరింరఘువంశవర్ధనకరం రక్తాధరంరాఘవం
రాధాయాత్మనివాసినం రవినిభం రమ్యంరమానాయకం
రంధ్రాంతర్గతశేషశాయినమహం రామంభజేతారకం ౪౦

మ. అమరద్వేషికులాటవిధహాను రంధ్రాంగన్ తాహీంద్రత
ల్పుమహాత్మున్ బఱిపూర్ణచందముఖురామున్ శ్రీరామానాయకున్
గమలాస్త్రోజ్జ్వలు బల్లవాధరు జగత్కల్యాణుశ్రీరాఘవున్
రమణీయున్ రఘువంశదీప్తుగొలుతున్ రాధాత్మసంస్థాయినిన్ ౪౦

తా॥ రాక్షస వంశనాశ కరత్వమున జగంబున కుపకరించుచు
రఘువంశమువృద్ధికి కారకుఁడై రాధాంతర్గతత్వమున విలాసభూతుఁ
డగుచు శేషశాయియై సీతాపతియగు రాముని సేవించెదను. 40

మూ. తారాకారంనిఖిలనిలయం తత్వమస్యాద్యలక్ష్యం
శబ్దావాచ్యం త్రిగుణరహితం వ్యోమమంగుష్టమాత్రం
నిర్వాణాఖ్యం సగుణమగుణం వ్యోమరంధ్రాంతరా సం
కౌషుమ్నాంతః ప్రణవరహితం రామచంద్రంభజేహం. ౪౧

మ. ప్రకటవ్యోమబలాంతరస్థసగుణుం రామాధిపున్ లోకనా
యకుధారాకృతి ముక్తిసంజ్ఞకు సుషుమ్నాంక స్థితోంకార ప
ణన్ కరాహిత్యునశబ్దునిత్యుబుధులెన్నం దత్వమస్యాది ల
క్ష్యుకులాస్థానుభజింతునిగుణనిసం గుష్ఠప్రమాణున్ హరిన్. ౪౧

తా॥ త్రిగుణరహితుండును, నిఖిలనిలయుండును, తారాకారుండును శబ్దముల కవాచ్యుండును, సగుణనిర్గుణస్వరూపుండును ఓంకారము లేనివాఁడును నంగుష్ఠప్రమాణుండునగు రామప్రభువే నాకు దిక్కు. 41

శ్లో॥ ముక్తిర్మూలం మునివరహృదానంద కందంముకుందం
కూటస్థాస్యం సకలవరదం సర్వచైతన్యరూపం
నాదాతీతం ప్రకృతిరహితం రామచంద్రంభజేహం. ౪౨

మ. మునిహృత్తోషకరుం బ్రధానరహితున్మోక్షాధినాథుం
తనుగూటస్థుని సర్వవిశ్వమయుంజేతనున్న మీకృత్స్నవం
దనసర్వాత్మముకుందులోకవరదున్నాదాంతతత్త్వాత్మన
త్వసఘున్ రామధరాసంతాధిపతినాదాతీతు భావించెదన్. ౪౨

తా॥ ముక్తిమూలమై మునుల హృదయంబులనుండి రక్షించుచు భక్తులకు వరంబుల నిచ్చుచు సర్వచైతన్యరూపుడైన రామభద్రుండే నా ప్రభువు. 42

శ్లో॥ నిజానందాకారంనిగమతురగారాధితవదనం
పరబ్రహ్మరమ్యం పరమపదయుగం పాపహరణం
కృపాపారావారంపరమపురుషం పద్మనిలయం
భజేరామంశ్యామం ప్రకృతిరహితం నిర్గుణమహం. ౪౩

మ. పరమామ్నాయతురంగసేవిత లసత్పాదాంబుజద్వంద్యుం బంకరుహాస్థాను కృపాబ్ధినిర్గుణసమాఘ ధ్వంసరముంబరా
త్పరమంబుం బురుషోత్తరం బరఁబరబ్రహ్మన్నిజానందు శ్రీ
హరి శ్రీరాముఁ బ్రధానవర్జితు ఘనశ్యామాంగు భావించెదన్. ౪౩

తా॥ పరబ్రహ్మరమ్యుండును పాపంబుల హరించువాడును వేదంబులచే స్తుతిచేయఁబడువాఁడును దయాసముద్రుండును పద్మనిలయుండును పరమ పురుషుండును నిర్గుణుండునగు రాముని కొలుతును.

శ్లో॥ శ్రీమద్వైకుంఠనాథంసురముని మకుటజ్యోతిత స్వర్ణపీఠం
నీలాంగంచంద్రవక్త్రింమణిమయ మకుటంబాణ కోదండహస్తం
పద్మాక్షంపాపనాశం ప్రణవమయమహారత్నసింహాసనస్థం
శ్రీసీతావామభాగంశ్రితజనవరదంరామచంద్రంభజేహం. ౪౪
మ. తనవయికుంఠవిభున్మణీమకుటఁగోదండాస్త్రహస్తున్సమా
గతగీర్వాణకిరీటరత్నరుచిరాక్రాంతాంఘ్రియుగ్మున్నత
శ్రితునీలాంగుశశాంకవక్త్రులసదోంకారాసనుం జానకీ
యుతుంగంజేఁకుఁ రామునిఁబాపకుహరునాద్యున్నారకుంగొల్చెదన్.
తా॥ దేవమునికోటులచే పూజింపబడుచు వైకుంఠముననుండి
సీతాదేవి పాదంబు లొత్తుచుండ శేషశయ్యపై పరుండి భక్తుల పాపం
బుల నశింపజేయుచు వరంబుల నొసంగుచు రత్నసింహాసనమునగూరు
చుండు రామునే సదా వేడెదను. 44
శ్లో॥ సాకేతేమణిమంటపేసురతరు ప్రాంతేవిమానాంతరే
పద్మేచాష్టదళోజ్జ్వలేనుత మహాసౌధే సుధామాన్వితే
సఖ్యంసూర్యజరావణానుజమరుత్పుత్రానుజై స్సేవితం
మధ్యేవాసవనీలకోమలనిభం రామంభజేతారకం. ౪౫
మ. ప్రకటాయోధ్యను కల్పమూలమున హర్మ్యంబందువిభ్రాజపు
ష్పకమధ్యాష్టదళాబ్జమధ్యమున భాస్వద్దేహమందున్సుర
ప్రకరంబుల్ రవిపుత్రముఖ్యులనుజుల్ భావింపఁదన్మధ్యమం
దకలంకుండగునీలరత్నవిభు రామాధీశుఁబ్రార్థించెదన్. ౪౫
తా॥ అయోధ్యలో మణివికారమండపమున నొకమేడలో దేవ
తలును సుగ్రీవాది వానరులును చుట్టును గొలిచియుండ నామధ్య
రత్నకుండలాదుల ధరించియుండు రాముని శరణు వేడెదను. 45
శ్లో॥ హృదయకుహరమధ్యేజ్యోతితన్మంత్రసారం
నిగమమయనుగమ్యంవేదశాస్త్రైరచింత్యం

హరిహరి విధివంద్యంతంసమం త్రాంతరస్థం
దశరథసుతమిళే దయివతందేవతానాం. ౪౬

మ. హరిభర్గాబ్జభవాదివంద్యు హృదయాబ్జాభ్యంతరజ్యోతి సు
స్థిరమంత్ర ప్రకటార్థసారతరు రాజీవాక్షుశాస్త్రాగమ
స్ఫురదాకారుయచింత్యు వేదమయు సంపూర్ణుస్వభోగమ్యు వే
మరురామప్రభుదేవదేవుగొలుతున్మంత్రాంతరాంతర్గతున్. ౪౬

తా॥ వేదశాస్త్రంబులకు లొంగక హరిహరబ్రహ్మాదులచే ను
తింపబడుచు మునుల హృదయపద్మంబుల దాగియుండి దేవతలకు
దేవుడై సత్యరూపుడైన రామచంద్రునే యాశ్రయింతును. 46

శ్లో॥ దేవేంద్రనీలనవమేఘ వినిర్జితాంగం
పూర్ణేందు బింబవదనంశరచాప హస్తం
సీతాసమేతమనిశం శరణంశరణ్యం
చేతోమదీయమభివాంఛతి రామచంద్రం. ౪౭

మ. హరినీలోత్పల మేఘసంపద మహారాంగుంధరాపుత్రికా
పరుగోదండశరోజ్జ్వలోత్కరపరుం భద్రాసనాసీనుదా
శరధిం బూర్ణశశాంకబింబవద న్సర్వాత్ము శ్రీరాము శ్రీ
కరధ క్త్రాంగణ కల్పకంబు మనమాకాంక్షించిసేవింపుమా. ౪౭

తా॥ ఇంద్రనీలమాణిక్యములవంటి శరీరము, పూర్ణచంద్రుని
వంటి మొగంబును కలిగి చేత ధనువునుంచుకొని శరణన్న శత్రువుల
గూడ రక్షించుచు నుండు రామచంద్రుని నుతింతును. 47

శ్లో॥ ఓతప్రోతసమస్తవస్తునిచయం ఓంకారబీజాక్షరం
ఓంకారప్రకృతీమడక్షరహితం ఓకారకందాంకురం
ఓంకారస్ఫుర భూర్భువస్సువరిధిం ఓఘత్రయారాధితం
ఓంకారోజ్జ్వలసింహపీఠనిలయం రామంభజేతారకం. ౪౮

శా. ఓంకారప్రకృతీ మడక్షరహితున్నా కారకందాంకు
నోంకారస్ఫుటభూర్భువస్సువరిధు నోఘత్రయారాధితున్

నోంకారజ్జ్వలసింహపీఠనిలయు నోంకారబీజాంకురున్
లంకేశాంతకుసర్వగున్ రఘువరున్ లక్ష్మీశు భావించెదన్. ౪౮

తా॥ ఓరామా! నీవు ప్రణవాకారుండవు. షడక్షరహితుం
డవు. ఓంకారయారాధితుండవు. రావణాంతకుండవు. సర్వగురుండవు.
రఘువరుండవు. నిన్నే భావింతును. 48

శ్లో॥ సాకేతేధవళే సురద్రుమతలే సౌధేవిమానాంతరే
ఆదిక్షాంతసమస్తవర్ణ కమలే దివ్యేమృగేంద్రాసనే
ఓంకారోజ్జ్వలకర్ణికే సురసరిన్మధ్యే సదేవాంతరే
వ్యాసాద్యాదిమునీశ్వరాద్యభినుతం రామంభజే తారకం ౪౯

మ. స్థిరమైనిర్మలమౌ మనస్సరసినా దిక్షాంతవర్ణాబ్ధవి
స్ఫురితోంకారవిశుద్ధకర్ణికజడేశుల్ గొల్వసాకేతమ
న్నురిమధ్యంబునఁ గల్పమూలమునభానుస్ఫూర్తి సౌధంబుం
జిరమౌపుష్పజ మధ్యపీఠలసితు శ్రీరాముగీర్తించెదన్. ౪౯

తా॥ అయోధ్యలో మందార వృక్షమూలమున నొకమహా
సౌధంబున విమానాంతరమున గంగానదిమధ్య వ్యాసాదులచే నుతింప
బడు రాముని సేవింతును. 49

మా. కోదండదీక్షాగురుమాదిమూలం
గుణాశ్రయం చందనకుంకుమాంకం
సలక్షణం సర్వజనాంతరస్థం
పరాత్పరంరామమహం నమామి. ౫౦

చ. ధరణీజారుచచర్చచందన లసత్కాశ్మీరజన్మాంకిత
స్ఫురదత్యున్నతవక్షుసర్వగు జగన్మాలానుకూలుంబరా
త్పరుపుసమిత్రియుం గుణాశ్రయుహరిం భక్తార్తిసంహారకుం
గురుకారుణ్య పయోధిరాముఁగొలుతుం గోదండదీక్షాగురున్. ౫౦

తా॥ ధనుర్విద్యాగురుండును, గుణాశ్రయుండును చందనకుం

కమధారియు సర్వజనాంతర్యామియు లక్షణసహితుండును పరాత్ప
రుండునునగు రామభజనమే చేసెదను. 50

శ్లో॥ మూలాధారసరోరుహేహుతవహస్థానే త్రికోణాంతరే
కంజేకుండలికాసుషుప్తిపటలీవాసాంతవర్ణాశ్రయే
బాలార్కప్రతిమావరాభయకరం పాశాంకుశాలంకృతం
భూతత్త్వాశ్రయమాదిపూరుషమజం రామంభజేతారకం. ౫౧

మ. అరయన్ గుంద సుషుప్తికాలలితవాసాంతక్షవ్యాప్తభా
సురమాకంజత్రికోణమధ్యమమున స్వక్రస్థలింబాలభా
స్కరసందీపితుభూలసంశయువిరాజత్పాశ ముఖ్యాస్త్రసు
స్థిరువిద్వేషి హరుం బరాత్పరునజున్శ్రీరామునేనించెదన్. ౫౧

తా॥ పద్మత్రికోణమధ్యమున శుక్రస్థలమందు బాలభాస్కరుని
రీతి విరాజిల్లుచు పాశాంకుశాలంకృతుండై పరాత్పరుండగు రామ
ప్రభునే నమ్మితిని. 51

శ్లో॥ స్వాధిష్ఠానసరోరుహే ప్రవిలసద్బాలాంత వర్ణాశ్రయం
బ్రహ్మగ్రంథిముహాన్నతేకరతలే శ్రీకుండికామాలికాం
పీఠేరత్ననిభం వరాభయకరం వాణీయుతంబిభ్రతం
సాధమనన్యమంగళకరం రామంభజేతారకం. ౫౨

మ. స్థిరమైనట్టిబలాంతవర్ణ దళస్వాధిష్ఠానకగ్రంధికా
కరుసత్కుండికమాలికున్నజనతా కల్యాణముద్రోజ్జ్వలు
న్వరతామ్రాకృతివైరిసాధ్వసకరున్వాణీయుతుందారకుం
బరుశ్రీరాముగుణాభిరాముమది సంభావించిసేవించెదన్. ౫౨

తా॥ స్థిరమయిన స్వాధిష్ఠానసరోరుహమున బ్రహ్మగ్రంధిచే
మహోన్నతంబగు కరతలంబున రత్నపీఠమున నుండు పరాత్పరుని
నారాముని భజింతును. 52

శ్లో॥ డాఫాంత్యక్షరపంకజేదళదళె మాణిక్యసంపూరితే
విష్ణుగ్రంధిమయేవరాభయకరం అశంఖచక్రాన్వితం
మార్తాండద్యుతిమంజునాభమతులం పీతాంబరంకౌస్తుభం
సర్వంసర్వగమిందిరాసహచరం రామంభజేతారకం. ౫౩

మ. ఘనమైనట్టిడఫావర్ణదళ యుక్తంబై హరిగ్రంథితం
బనజెర్వామణిపూరచక్రమున కంజాతోజ్జ్వలు రాముఁగాం
చనచేలు రిపుజైత్రుదారకుబరున్సర్వాత్మజక్రాబ్జహ
స్తునిలక్ష్మియుతుబద్మనాభుభజియింతు గౌస్తుభోద్భాసితుఁ. ౫౩

తా॥ ఘనమా మణిపూరచక్రంబున కాంతించుచు బంగారు
చేలంబు కట్టి శత్రునాశనకరుండగుచు గౌస్తుభంబును ధరియించి మిం
చిన రఘురాముని స్మరింతును. 53

శా. హృత్పద్మేనిలయార్క కోటిసదృశం కంఠాంతవర్ణోజ్జ్వలే
ప్రాణాంతప్రణవాంతరే ప్రవిలసదోర్భాణపీఠాంతరే
సూర్యేహంసమయేసదాశివపతం కోదండదీక్షాగురుం
వాసామోక్షరమాసమేతమనిశం రామంభజేతారకం. ౫౪

మ. సరగన్ భవ్యకరాంతవర్ణసహితుం బ్రాణానిలోంకారను
స్థిరుచాయాధిపహంసరూపునిలయాదిత్యాయుతోద్భాసి వి
స్ఫురితోద్భాణవసత్సదాశివసురూపు నోక్షలక్ష్మియుతుఁ
గురుభక్తింభజియింతుగాతమహా కోదండదీక్షాగురుఁ. ౫౪

తా॥ ధనుర్విద్యాగురుండును ప్రకాశయార్క కోటిసమానుండును
ప్రాణాంతస్థాకారసహితుండును హంసరూపుండును సదాశివరూపుం
డను మోహలక్ష్మియుతుండునగు రాముని శరణువేడెదను. 54

శా. సాక్షాత్షోడశదివ్యపత్రకమలే జీవాత్మసంస్థాపితే
రుద్రగ్రంధిమయేమనోన్మనిపథే జాలాంధ్రపీఠాంతరే

శుభ్రజ్యోతిమయంశరీరసహితం సంస్థం సుధాశీతలం
శబ్దబ్రహ్మనివాసభూతవదనం రామంభజేతారకం. ౫౫

మ. తనరన్షోడశపద్మపత్రమున రుద్రగ్రంథితంబై మనో
న్మనిమార్గంబునజీవనస్థలిని మాన్యంబైనజాలాంద్రపీ
ఠినిశబ్దాహ్వయబ్రహ్మకూటమున మేఘజ్యోతిరూపంబునం
ఘనతంజెన్నగు రాముదారనుసమగ్రానుగ్రహునుం గొల్చెదన్.

తా॥ షోడశపద్మపత్రంబున రుద్రగ్రంథితంబయి జీవాత్మస్థాపితం
బయి పరిశుభ్రజ్యోతిమయంబును సుధాశీతలంబును శబ్దబ్రహ్మనివాస
భూతంబును నగు రామచంద్రునే సేవింతును. 55

మూ. భ్రూమధ్యేనిగమాగమోజ్జ్వలపదే చంద్రేత్రిమార్గాంతరే
నిర్ద్వంద్వేనిఖిలార్థతత్వవిలసత్సూక్ష్మేసుషుమ్నాముఖే
ఆసీనంప్రళయార్కభాసురవరం జ్యోతిస్స్వరూపాత్మకం
కర్ణానాంచితమోక్షలక్ష్మీసహితం రామంభజేతారకం. ౫౬

మ. శ్రుతిమార్గంబునద్రైపదాంతరమునం భ్రూమధ్యమందున్సము
న్నతభాస్వత్సకలార్థతత్వాగ సుషుమ్నస్థానసంస్థానుశో
భితకల్యాగుణతేజమోక్షకమలా ప్రేమాన్వితుందారకుం
ద్యుతిమంతుం భయవర్జితున్ హరిపరంజ్యోతిం భజింతున్మదిన్.

తా॥ వేదశాస్త్రోజ్జ్వలప్రదంబయిన భ్రూమధ్యంబున ప్రళయా
ర్కుని పగిది భాసిల్లుచు జ్యోతిస్స్వరూపంబుననుండు హరి పరంజ్యోతి
యై వెలుగు రాముని భజింతును. 56

మూ. శీర్షాంభోరుహకర్ణికేనిరుపమే శ్రీషోడశాంతేశశి
ప్రఖ్యాతామృతవార్ధివీచిలహరీ నిర్వాణపీఠాంతరే
శబ్దబ్రహ్మపరం చరాచరగురుం తేజఃపరంశాశ్వతం
సత్యాసత్యమగోచరంహృదిసదా సీతాసమేతంభజే. ౫౭

మ. అలశీర్షాంబుజకర్ణికస్థుబరిపూర్ణాబ్జామృతాంభోధివీ
చిలసన్మౌక్తికమహాసనాంతరమునం జెల్వొందుసీతాసము
జ్జ్వలు తేజఃపరునింజరాచరగురున్సత్యామృతున్నాతుం
బలభిన్నీలునగోచరుందలంతు శబ్దబ్రహ్మవాచాధికున్ ౫౭

తా॥ నిరుపమానంబును, శీర్షాంబుజకర్ణికంబును శశిప్రఖ్యాతం
బగునమృతవీచికల నిర్వాణపీఠాంతరంబున చరాచరస్వరూపంబునను
శాశ్వతుండును నగోచరుండును నగురాముని దలంతును. 57

శ్లో॥ సాకేతేరవికోటిసన్నిభమహాహర్మ్యేసుసింహాసనే
నానారత్నవినిర్మితేమునిజనాకీర్ణేసదానందనే
దేవాధీశ్వరపంకజేనవసితం వామాంకసీతోజ్జ్వలం
దేవేంద్రోపలనీలకోమలనిభం రామంభజేతారకం. ౫౮

మ. తనప్రోలం గమలాప్తకోటి విలసత్సౌధాంతరానందదా
నవపీఠోజ్జ్వలరత్నపీఠమున నామ్నాయేశ్వతాఖ్యాంతరం
బునజెల్వొందిన శక్రనీలనిభు రాముంజానకీయుక్తుగాం
చనమంజీరకకిరీటకుండలవిరాట ద్భూషణుం గొల్చెదన్. ౫౮

తా॥ అయోధ్యలో కోటిసూర్యప్రభావిలసితసౌధంబునసింహా
సనంబున నానారత్ననిర్మితంబై మునిజనాకీర్ణంబైన నంతరంబున వసిం
చుచు జానకీయుక్తుండగు రాముని గొల్చెదను. 58

శ్లో॥ సాకేతేసగరేసమస్తసుఖదే హర్మ్యేంబుకోటిద్యుతే
నక్షత్రగ్రహపంక్తిలగ్నశిఖరే చాంతర్యపంకేరుహే
వాల్మీకాత్రిపరాశరానుమునిభి స్సంసేవ్యమానంస్థితం
సీతాలంకృతవామభాగమనిశం రామంభజేతారకం. ౫౯

మ. తనయూరంశరదిందుకోటినిభమై తారాగ్రహాక్రాంతశృం
గనితాంతోన్నతమైన సౌధమున సౌఖ్యంబౌతదంతస్థన

ద్వనజంబందుబరాశరాతిప భృగుదూర్వాసాదులుంగొల్వభూ
తనయాసంయుతుండై నరామవిభునిం దాసుండనై కొల్చెదన్. ౫౯

తా॥ సాకేతనగరంబున శరదిందుకోటినిభంబయి నక్షత్రపంక్తి నంటు శిఖరములుకల గృహంబులో సుఖం బగుశయ్యపై వాల్మీకాది మహామునులచే సేవింపబడుచు సీతాదేవితో నుండు రాముని నుతింతును. 59

శ్లో॥ వందేరామమనాదిపూరుషమజం వందేరమానాయకం
వందేహారకిరీటకుండలధరం వందేంద్రనీలద్యుతిం
వందేచాపకదంబకోజ్జ్వలకరం వందేజగన్మంగళం
వందేపంక్తిరథాత్మజంమమగురుం వందేసదారాఘవం. ౬౦

మ. కమలానాథుననాదిపూరుషు జగత్కల్యాణుగోదండ ది
వ్యమహాస్త్రోజ్జ్వలుహారకుండలకిరీటాలంకృతు న్నిర్జరేం
ద్రమణిశోభితగాత్రుమద్గురునజున్ రాముందశస్యందనో
త్తమపుత్రుంసుచరిత్రుమద్హృదయ మధ్యంబందుభావించెదన్. ౬౦

తా॥ ఆదిపురుషుండును రమాపతియును హారకిరీటకుండలధరుం డును నజుండును యింద్రనీల ద్యుతికలవాడును హస్తమున ధనువుండిన వాడును జగంబులకు శుభంబులనిచ్చువాడును దశరథపుత్రుండును గు రామునకు నమస్కరించెదను. 60

శ్లో॥ వందేశౌనకగౌతమాద్యభినుతం వందేఘనశ్యామలం
వందేతారకపీఠగాఢ్యనిలయం వందేజగన్నాయకం
వందేభక్తజనౌఘదేవవిటపం వందేధనుర్వల్లభం
వందేత్వమసీతివాక్యజనకం వందేసదారాఘవం. ౬౧

పరునిందత్వమసీతివాక్యజనకుం భర్తామనోరాక వాలుం
మరుచిందారకపీఠపద్మనిలయుం యుత్రామనీలోజ్జ్వలుం

సరసురగౌతమశౌవకాద్యభిమతుం సర్వేశ్వరుంజానకీ
వరుగోదండగురు న్సురారివారు భావంబందు సేవించెదన్. ౬౧

తా॥ శౌనకగౌతమాదిమునులచే కీర్తింపబడువాడును తారక పీఠమధ్య నిలిచియుండు జగన్నాయకుండును భక్తులకు కల్పకంబును ధనుర్విద్యాతిశయుండును నగు రామచంద్రునికి నమస్కారములు. 61

శ్లో॥ వందేసూర్యశశాంకలోచనయుగం వందేజగత్పావనం
వందే ప్రసహస్రపద్మనిలయం వందేపురారిప్రియం
వందేరాక్షసవంశనాశనకరం వందేసుధాశీతలం
వందేదేవకపీంద్రకోటివినుతం వందేసదారాఘవం. ౬౨

మ. హరమిత్రున్ రవిచంద్రనేత్రుదితి పుత్రారణ్యదావాగ్నినిర్జ
రశాఖామృగసేవితాంఘ్రియగు శ్రీరాముంసుధాశీతలుం
ధరణీనాధుసహస్రపత్రకమలస్థానుం జగత్పావనుం
బరమాత్మం రఘురాముచంద్రుమది సంభావించిసేవించెదన్. ౬౨

తా॥ సూర్యచంద్రనేత్రుండును జగత్పావనుండును శివునకు స్నేహితుండును రాక్షసవంశనాశంకరుండును నమృతమువలె చల్లనివాడును దేవవానరకోటిచే వినుతుండునునగు రఘురాముని సేవింతును. 62

శ్లో॥ వందేసాగర గర్వభంగవిశిఖం వందేజగజ్జీవనం
వందేకౌశికయాగరక్షణకరం వందేగురూణాంగురుం
వందేబాణశరాసనోజ్జ్వలకరం వందేజటావల్కలం
వందేలక్ష్మణభూమిజాన్వితకరం వందేసదారాఘవం. ౬3

మ. శరచాపోజ్జ్వలహస్తులక్ష్మణధరా సత్పుత్రికాయుక్తు సా
గరగర్వాపహశౌర్యధుర్యునఘుం గాధేయయజ్ఞావనుం
న్వరకుం దేశిక దేశికుం ధృతజటావల్కలం జగజ్జీవను
గరుణాంభోనిధి రామచంద్రునియతిం గాంక్షించి సేవించెదన్. ౬3

తా॥ బాణంబుచే సముద్రము గర్వమడంచినవాఁడును జగదాధారుండును విశ్వామిత్రయాగరక్షకుండును గురులకు గురుండును జటావల్కలధారియు సీతాలక్ష్మణసహితుండునగు రామునికి సదా మ్రొక్కుదును. 63

శ్లో॥ వందేపాండురపుండరీకనయనం వందేందుబింబాననం
వందేకంబుగళంకరాబ్జయుగళం వందేలలాటోజ్జ్వలం
వందేపీతదుకూలమంబుదనిభం వందేజగన్మోహనం
వందేకారణమానుషోజ్జ్వలతనుం వందేసదారాఘవం ౬౪

మ. సితకంజేక్షణుహస్తిహస్తకరు రాజీవారిబింబాస్యుభా
సితప్రావృడ్ఘనవర్ణుగాంచనలసచ్చేలు న్సుశీలుంబుధా
ర్చితునిం గారణదేహుఁగంబుగళుధాత్రీవుం జగన్మోహనుం
ధృతమాణిక్యలలాము రామవిభునెంతుం దత్కృపాకాంక్షినై. ౬౪

తా॥ తెల్లతామరలవంటి కన్నులును చంద్రబింబమువంటి మొగంబును శంఖమురీతినుండు కంఠంబును పద్మములపోల్కినుండు చేతులును పీతాంబరధరుండును జగన్మోహనకరుండును కారణాంతరంబుల మనుష్యరూపమును ధరించినవాఁడైన రామున కిదే వందనము. 68

శ్లో॥ వందేనీలసరోజకోమలరుచిం వందేజగద్వందితం
వందేసూర్యకులాబ్ధికౌస్తుభమణిం వందేసురారాధితం
వందేపాతకపంచకప్రహరణం వందేజగత్కారణం
వందేవింశతిపంచతత్త్వరహితం వందేసదారాఘవం ౬౫

మ. వరనీలోత్పలకోమలాంగు ద్రిజగ ద్వంద్యుజగత్కారణు
న్సరసీజాప్తకులాబ్ధికౌస్తుభమణి న్సర్వాత్మ దేవార్చితు
న్వరదుం బంచమహాఘనాశకుగృపా వార్ధింబరుండైత్య సం
హారషడ్వింశతితత్త్వభాసితుని రామాధీశుసేవించెదన్. ౬౫

తా॥ నల్లకలువవంటి కాంతియు జగంబులచే నమస్కరింపదగిన ప్రతిభయు సూర్యకులంబున కలంకారంబును దేవపూజితదేహంబును కలిగి దయాసముద్రుండయిన రామప్రభునకు మ్రొక్కుచున్నాను.

శ్లో॥ వందేసాధకవర్గకల్పకతరుం వందేత్రిమూర్త్యాత్మకం
వందేనాదలయాంతకస్థలగతం వందేత్రివర్గాత్మకం
వందేరాగవిహీనచిత్తసులభం వందేసభానాయకం
వందేపూర్ణదయామృతార్ణవమహం వందేసదారాఘవం.　　౬౬

మ. వరదుం సాధకవర్గకల్పకతరుం భవ్యుం ద్రిమూర్త్యాత్మకుం
సరసుం నాదలయాంతకస్థలగతున్ శాంతుం ద్రివర్గాత్మకున్
గురుసంపూర్ణదయామృతాబ్ధిరహితాంగుం సత్సభానాధు సు
స్థితునిం రాగవిహీనచిత్తసులభుం శ్రీరామునేవించెదం.　　౬౬

తా॥ సాధులకు కల్పవృక్షంబును, త్రిమూర్త్యాత్మకంబును, సరసంబును శాంతంబును కలిగి రాగహీనులకు సులభముగా గోచరించుచు సత్యభామానాధుండయిన శ్రీరామునికి నమస్కారము. 66

శ్లో. వందేసాత్త్వికతత్త్వముద్రితతనుం వందేసుధానాయకం
వందేచారు చతుర్భుజామణినిభం వందేమడంబస్థితం
వందేబ్రహ్మపిపీలికాదినిలయం వందేవిరాడ్విగ్రహం
వందేపన్నగతల్పశాయినమహం వందేసదారాఘవం.　　౬౭

మ. వరనీలాంగుమడంబరస్థితు జతుర్బాహుం సుధానాయకుం
సరసున్ సాత్త్వికతత్త్వముద్రితతనుం సర్వున్విరాడ్విగ్రహుం
బరమేష్ఠ్యాదిపిపీలికాంతనిలయుం నాంగేంద్రపర్యంక ని
ర్జరబృందారక శీలురాఘవ పరబ్రహ్మంబు సేవించెదం.　　౬౭

తా॥ సాత్త్వికతత్త్వంబుచే ముద్రింపఁబడిన తనువు కలిగి మడంబరస్థితుండును విరాడ్విగ్రహుండును సర్వజీవులందుండు వాడును నగు రామునికి వందనము. 67

మూ. అయోధ్యాపురమంటపే స్ఫురితసింహాపీఠస్థితం
వశిష్ఠముని గౌతమై భృగుశుకాదిసంసేవితం
దినేశసుతరావణానుజనహూదరాద్యామృతం
భజామిరఘునందనం ప్రణవబీజసారాత్మకం. ౬౮

మ. ప్రకటాయోధ్యసురత్నమంటపమునన్ భద్రాసనాసీనుండై
యకలంకుల్ శుకగౌతమభృగువసిష్ఠాదుల్ దినేశాత్మవు
త్రకముఖ్యుల్ దశకంఠసోదరుఁడు భ్రాతల్ గొల్వనోంకారబీ
జకసారాత్మకుడైన శ్రీజనకజాజానిం బ్రశంసించెదన్. ౬౮

తా॥ వశిష్ఠగౌతమాదులచే వినుతింపఁబడుచు నయోధ్యాపురంబున సువర్ణమంటపమున భద్రసింహాసనంబున తమ్ములు గొల్వనుండు రాముని భజింతును. 68

మూ. విలోలమణిమండలం విమలచంద్రబింబాననం
విఖండితదశాననంవితతచాపబాణోజ్జ్వలం
విమోహితజగత్త్రయం వికచపద్మపత్రేక్షణం
విభీషణసురక్షితం విజయరామమీశేహరిం. ౬౯

మ. అనుపమరత్నకుండల దశాననకంఠవిలుంఠనుక్షరా
సనశరధారణున్ వికచ సారసపత్రువిశాలనేత్రున
న్మనినుతుపూర్ణచంద్రముఖు మోహితసద్భువనత్రయున్ జనా
ర్దనునివిభీషణావనుని రాఘవునెంతు హృదంతరంబునన్. ౬౯

తా॥ చలించు మణిభూషణములును వికసించిన పద్మంబులవంటి కన్నులును కలిగి చంద్రబింబము వంటిమొగంబుతో నొప్పి రావణుని నాశన మొనర్చిన ధనువు హస్తమున మెరయ విభీషణుని రక్షించిన రాముని నామది నెంతును. 69

మూ. చలత్కనక కుండలోల్లసిత దివ్యగండస్థలం
చరాచరజగన్మయంచరణ పద్మగంగాశ్రయం

చతుర్విధఫలప్రదం చరమపీఠమధ్యస్థితం
చిదంశమఖిలాస్పదం దశరథాత్మజంచింతయే ౭౦

చ. ఘనతరకుండలోల్లసిత గండయుగున్ నిజపాదపద్మ సం
జనితసురాపగుంజరమసాజ్ఞ కపీఠనివాసితుంబరా
త్మునిసచరాచరాత్మకు జతుర్విధసిత్ఫలదున్ జిదంశురా
మునినఖిలాస్పదుఁ భువన మాహాసుదాశరథిన్ భజించెదన్. ౭౦

తా॥ బంగారుకుండలము చలింప తేజరిల్లు గండస్థలంబులు కలిగి చరాచరమయుండై గంగ తాండవమాడు పాదంబులతో ననేక విధంబులగు ఫలంబుల భక్తుల కొసంగుచుండు రామభద్రుడే నాకు దిక్కు. 70

మూ. సనందనమునిప్రియం సకలవర్ణవేదాత్మకం
సమస్తనిగమాగమాస్ఫురిత తత్వసింహాసనం
సహస్రనయనాంబుజా ద్యమరబృందసంసేవితం
సమష్టిపురవల్లభం దశరథాత్మజం చింతయే. ౭౧

చ. సనకసనందనాదిముని సత్తమసత్ప్రియురాఘవున్ సనా
తనునిగమాగమస్ఫురిత తత్వమృగేంద్రమహాసనస్థ స
న్మునిమఖవాదినిర్జరసమూహ సమర్చితువాగమాత్మ పా
వనచరితున్ సమష్టిపురవల్లభు దాశరథిన్ భజించెదన్. ౭౧

తా॥ సనకసనందనాది మునుల కిష్టుండును సమస్తశాస్త్రంబులచే నుతింపదగిన తత్వసింహాసనంబుకలవాడును నింద్రాదిదేవతలచే కొలువబడువాడును నగు దశరథపుత్రుని నామది గొలిచెదను. 71

మూ. అనర్ఘ్యమణిపూరకోల్లసిత దివ్యతేజఃపరం
అనాహతసరోరుహాం స్ఫురితహంసనాదాన్వితం
అనంతదళపంకజం స్ఫుటమృగాంకబింబామృతం
ప్లుతాంగమఖిలాస్పదం దశరథాత్మజంచింతయే. ౭౨

చ. అనుపమనూత్నతరత్నలస దద్భుతతేజుననాహతాంబర
జ్జనవరహంసనాదయుతు శౌరి ననంతదళాబ్జచంద్ర బిం
ధాబనవసుప్లుతాంగుఁ బరమం బఖిలాస్పదునాజియగ్ర నం
దనురఘురామచంద్రు వనతారకనాముమదిన్ భజించెదన్. 22

తా॥ విలువగల రత్నములచే కాంతించు దివ్యదేహుండును ననాహితసరోరుహుండును హంసనాదాన్వితుండును నఖిలాస్పదుండునగు రామునాశ్రయించెద. 72

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తికాలవిలసత్తత్త్వాత్మచిన్మాత్రకం
చైతన్యాత్మక మాదిపాపరహితం భూమ్యాదితన్మాత్రకం
శాంభవ్యాదిసమస్తయోగకుశలకం సాంఖ్యాదితత్త్వాత్పరం
శబ్దావాచ్యమహంనమామిసతతం వ్యుత్పత్తినాశాత్పరం. 23

శా. గరిమన్ శాంభవిముఖ్యయోగయుతు జాగ్రత్స్వప్నసుప్తంబులం
దురుతత్త్వాత్ముఁ జితాత్ముఁ బాపహరు నాదున్ పంచభూతాత్మకున్
బరునుత్పత్తివినాశవర్జితుని శంభుత్సేవనాత్ముంబరా
త్పరుసాంఖ్యాదిసమస్తతత్త్వపరునిన్ ధ్యానింతుశ్రీరామునిన్. 23

తా॥ చైతన్యస్వరూపుండును జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలందు తత్వస్వరూపుండును పాపహరుండును పంచభూతాత్మకరూపుండును నుత్పత్తినాశంబులులేనివాఁడును సాంఖ్యాదియోగబలుండును నగురాముని నాశ్రయింతును. 73

శ్లో॥ ధ్యాయేత్వాంనవవిద్రుమస్ఫుటతనుం బహాఁలసన్మేచకం
నాసారంజితమౌక్తికం పరిలసత్పీతాంబరంకౌస్తుభం
వేణ్యాకంబురథాంగపాశసరిఘా ప్రాప్తేషుచాపాశుగం
శ్రీరామం నవమన్మథాధిపమహం షట్కోణచక్రస్థితం. 24

మ. ప్రణుతింతుఁ నవవిద్రుమస్ఫుటతనున్ బర్హోల్లసన్మేచకున్
గణిపాశేషుధనుర్రథాబ్జ శరవేణుప్రాసముఖ్యాస్త్రని

ర్గుణుమట్కోటిఖనసరోజనాసుబరిపూర్ణున్ నాసికామా క్తికున్
మణిభూషున్ నవమన్మథాధిపతి రామస్వామి పీతాంబరున్. ౭౪

తా॥ క్రొత్తపగడమువంటి తనువును బాహువులచే విరాజిల్లు దేహుండును ముక్కున మాణిక్యముకలవాడును పీతాంబరధరుండును నిర్గుణుండును మణిభూషణుండునునగు రామప్రభుని నుతింతును. 74

శ్లో॥ సాకేతేనగరేసమస్తమహిమాధారేజగన్మోహనం
రత్నస్తంభసహస్రమంటప మహాసింహాసనేసాంబుజే
విశ్వామిత్ర వసిష్ట గౌతమ శుక వ్యాసాదిభిర్మౌనిభిః
ర్ధ్యేయంలక్ష్మణలోకపాలసహితం సీతాసమేతంభజే. ౭౫

మ. తతసాకేపురీవరంబునను రత్నస్తంభ సాహస్రభా
సితసౌధంబున భద్రపీఠమున రాజీవాసనాసీను సు
పత్రగాధేయ వసిష్ట గౌతమ శుకవ్యాసాదిభావ్యున్ సతీ
యుతుదిక్పాలక లక్ష్మణాన్వితు సముద్యోగున్ జగన్మోహనుఁ
వితతోద్యన్మహిమున్ రమాధ్వవహుని సేవింతు గృపాంతినై. ౭౫

తా॥ సాకేతనగరంబున వేయిరత్నస్తంభంబులతో నొప్పు మేడపై భద్రపీఠమున రాజీవాసనంబున గౌతమాదులు పూజింప దిగ్పాలకులతోను లక్ష్మణుతోను భార్యతోనునున్న రాముని సేవింతును.

శ్లో॥ ఏకాంతేకమలేజలేవికసితే చంద్రీకృతస్థాపితే
స్థానేతారకమంటపేతనుబిల వ్యాప్తేసుధామంటపే
అబ్జార్కానలమండలోపరిమహా శ్రీపీఠశాంతేసదా
నాదాంతేజనకాత్మజా న్వితమహం రామంభజేతారకం. ౭౬

ఉ. తారకమంటపంబున సుధాగృహమందు రహస్యలీల నిం
పారఁగృశానుభాస్కరనిశాధిప మండలి పైని సత్కళా
పూర్ణశశాంకనిర్గళిత భూరిసుధాప్లుతనాద పీఠసీ
తారమణీసమేతుఁడగు దాశరథిన్ రఘువీరునెన్నెదన్. ౭౬

తా॥ రహస్యప్రదేశంబున సుధాగృహంబునందు తారకమండపమున సూర్యచంద్రాగ్నిమండలములపై సీతాసమేతంబుగనుండు రామభద్రుని నిరంతర మేను స్మరింతును. 76

మూ. నాకేతేచమణిమంటపేసురతరు ప్రాంతేష్టవర్ణోల్లస
త్పత్రే తారకకర్ణికే ప్రవిలసత్కల్పసూనాంచితే
పద్మే వేదచతుష్కమండలసితే నాదాంతరయ్యాతలే
తంసేవే ధ్రువమండలేందునిగళే పియ్యూషధారాప్లుతం. ౭౭

మ. తనప్రోలన్ మణికుట్టిమస్థలలసత్సంతానభూజాంతికం
బునసప్తాక్షరపత్రవేదలలితాంభోజంబునం దారకం
బునతత్కర్ణికకల్పబుప్పయుతునా దాంతోరుపర్యంకుమే
ధనుగొల్తుఁ ధ్రువమండలోద్భవసుధా ధారాప్లుతున్ తారకున్. ౭౭

తా॥ తనపట్టణంబున కల్పవృక్షంబు మొదట మణిమండపమున సప్తాక్షరపద్మపత్రంబులచే లలితంబగు స్థానంబున నాదాంతమగు శయ్యపై ధృవమండలమందు పుట్టిన సుధాధారచే ప్లుతంబగుచోట నుండు రాముని సదా నేను గొలిచెదను. 77

మూ. ధ్యాయే శాంరవిమండలేందుదవళే పద్మేనిషణ్ణంహరిం
స్వర్ణాభంకరశంఖచక్రలలితం పీతాంబరం గౌస్తుభం
స్వర్ణశ్మశ్రునఖాలకంలలనయాయుక్తంకిరీటాంగదం
హారాలంకృతవక్షసంపదయుగం శ్రీపాదుకాలంకృతం. ౭౮

మ. రవిబింబాంతర చంద్రపాండురలస ద్రాజీవసంస్థానుమా
ధవుసౌవర్ణవిభాలకాంఘ్రినఖరుఁ దాంతుఁ మణిభూషణుఁ
గవిపంద్యున్ ధరచక్రగౌస్తుభధరుఁ గాశేయవాసోజ్జ్వలున్
భవబంధాపహు రాముగొల్తుమణి శుంభత్పాదుకాలంకృతుఁ. ౭౮

తా॥ రవిబింబాంతరమున చంద్రునివలె తెల్లనగు పద్మంబున నున్నవాడును కరములందు చక్రశంఖాదులను ధరించి మణిభూషల

నుంచుకొని పీతాంబరంబుల ధరించి కవులచే మ్రొక్కబడుచుండు
వాడునగు రాముని నేను వేఁడుదును. 78

మూ. వసంతాక్షరాఖ్యే చతుఃపత్రపద్మే
త్రికోణాంతకంఠేరాతత్వయుక్తే
వరాభీతిపాశాంకుశంవిద్రుమాభం
గజాశ్యేనిషణ్ణంభజేరామచంద్రం. ౭౯

మ. అరయఁగా భవ్యసహాంతవర్ణయుత ప్రత్యాబ్జత్రికోణోపను
స్థిరభూతత్వతసమేతుఁడై రిపు భయోత్సేక ప్రపాశాంకుశ
స్ఫురితుండై వరవిద్రుమప్రతిభుఁడై భూతేశపుత్రాకృతిన్
పరగంజెన్నగు రామచంద్రవిభు సద్భక్తిం బ్రశంసించెదన్. ౭౯

తా॥ వసంతాక్షరమను చతుఃపద్మమధ్యంబున త్రికోణాంతకంఠం
బునందు ధరాదేవితో కూడి వరవిద్రుమప్రతిమదేహుండయినరాముని
సేవింతును. 79

మూ. ద్విపత్రాబ్జమధ్యేమనోతత్వగమ్యో
జగత్కారణంజ్యోతిరానందరూపం
లసద్భావవిష్టంమనోభావదీపం
పరాత్మస్వరూపం భజేరామచంద్రం ౮౦

మ. తతహృత్పద్మమునన్ ద్విపత్రకమలస్థానంబునందున్ మనో
గవిదీపంబుఁబరాత్మరరూపము జగత్కల్యాణబీజంబునయి
యతులజ్యోతియునై పరాత్పరమునయిసానిందమై కేశవ
ప్రతిభంజెందిన రామచంద్రవిభు సంభావించిసేవించెదన్. ౮౦

తా॥ హృదయపద్మంబున కగమ్యమానమగు ద్విపత్రకమల
స్థానంబున జగత్కారణుండయి యానందరూపుండయి పరాత్పరుండయి
మనోభావదీపంబుచే విష్ణుప్రతిభతో వెలుంగు రామచంద్రుని నుతిం
చెదను. 80

మూ॰ సదానందదేవే సహస్రారపద్మే
గళచ్చంద్ర పీయూష ధారామృతాందే
స్థితంరామమూర్తిన్నిషే వేనిషేవే
సందయివంవసేవే నసేవేనసేవేనసేవే. ౮౧

మ. తపసాహస్రదళాప్తనిర్గళమధాధాభిషేకంబునన్
సతతానందమున్ జెలంగినరఘుస్వామిం బరంధామునా
శ్రితచింతామణి రామచంద్రుమది నేసేవింతు నిష్టాప్తికై
నితరాదిత్యుల నెంతకాలమునకున్ నేనెంచజిత్తమ్మునన్. ౮౧

తా॥ సహస్రదళాప్తంబయినిర్గళమదాధారాభిషేకంబున నిత్యానందంబునొందుచుండు రఘురాముని పరంధాముని నాశ్రితచింతామణినినే కొలుతును. ఇతరదైవములను నేతలపను. ఇది నిశ్చయము.

మూ॰ సుధాబ్ధాసితద్వీపమధ్యేవిమానే
మవర్వాణివృక్షోజ్జ్వలే శేషకల్పే
నిషణ్ణాంరమాంకంనిషేవేనిషేవె
న్యదయివంనసేవేనవేనసేవే. ౮౨

మ. తతదుగ్ధాబ్ధిని తాతనీపమున మందారోప కంఠోర్విసం
స్థితసత్పుష్పక మధ్యసోమవిలస చ్ఛేషాహితల్పంబునన్
సతతంబుఁ కమలాయుతుండగురఘుస్వామిన్ పరంధామునా
శ్రితమందారము రాముఁదప్పనొరులఁ జింతింపభావంబునం. ౮౨

తా॥ క్షీరసముద్రమున తెల్లని ద్వీపమధ్యమందు మందారవృక్షము మొదట పుష్పకమధ్య ప్రకాశించు శేషశయ్యపై లక్ష్మితోడ పైనుండ వరుండియుండు రాముని సేవింతును. ఇతరదైవముల పూజింపను.

82

మూ॰ చిరంశంసమానంద మానందకందం
నుషుమ్నాఖ్యరంధ్రాంత రాగంచహంసం

సచక్రం సశంఖం సపీతాంబరాంకం
పరంచాన్యదైవం నజానే నజానే. ౮౩

మ. సరసానందము సుషుమ్న మధ్యగత హంసస్థున్ జిదంశుంకర
స్ఫురితబ్జారిదరాదిసాధను జగత్పూర్ణాత్ముఁ బీతాంబరుఁ
వరయోగీశ్వరభావభావితు జిదానందున్ ముకుందున్ బరా
త్పరు శ్రీరాముభజింతు నన్యులను సంభావింపభావంబునన్. ౮౩

తా॥ చిరకాలమునుండి ప్రశస్తినొంది జనంబుల కానంద మిచ్చుచు తానానందించుచు సుషుమ్నమధ్యగతహంసస్థుఁడై శంఖచక్రాదుల తోనుండు రామదేవునే భజింతును. అన్యదైవమును నే చూడను. 83

శ్లో॥ సుపర్వాణవృక్షోజ్జ్వలస్వర్ణపీఠే
వనౌకాదిభిర్మౌనిభిస్సేవ్యమానం
స్థితంపుష్పవృష్ట్యావృతం రామమూర్తిం
సదాభూమిజాయుక్త మీళే హృదంతే. ౮౪

మ. చందనవృక్షమూలవిలసత్తపనీయమృగేంద్రపీఠినా
నందమునీశుఁజెన్నలరి నవ్యసుమోత్కర వర్షితాంగుఁడై
సుందరవామభాగపరిశోభితజానకియై మునీంద్రస
ద్బృందసవానరుల్ గొలువ బెంపువహించినరాముఁగొల్చెదన్. ౮౪

తా॥ కల్పవృక్షమూలమున స్వర్ణపీఠమునందు మునులచే సేవ్యమానుండగుచు పుష్పవర్షంబు గురియుచుండ సీతతోఁగూడియుండు రాముని నాహృదయంబున సేవింతును. 84

మూ. కరేదివ్యచక్రం పరేచారుశంఖం
గళేతారహారం లలాటేలలామం
భుజంగేనిషణ్ణం పరానందరూపం
సదాభూమిజాయుక్తమీళే హృదంతే. ౮౫

చ. కరముల శంఖచక్రములు కంధరమందున దారహారమున్
బరగలలాటభాగమున భవ్యలలామము తేజరిల్లువి
స్ఫురితచిదాత్మరూపకుని భూరిభుజంగ మతల్పకస్థితున్
ధరణితనూభవాసఖుని దాశరథిన్ శరణంబువేడెదన్. ౮౫

తా॥ ఒకహస్తంబున చక్రంబును రెండవహస్తంబున శంఖంబును కంఠమున ముత్యాలహారంబును లలాటమున రావిరేకయు కలిగి శేషశాయియై పరాత్పరరూపంబున సీతతోనుండు రాముని తలంతును. 85

మూ. చతుర్వేద కూటోల్లసత్కారణాఖ్యే
స్ఫురద్దివ్యవైమానికే భోగితల్పే
పరంధామమూర్తిం నిషణ్ణం నిషేవే
న్యదైవంన సేవేన సేవేన సేవే. ౮౬

చ. సతతము వేదకూటవిల సద్ఘనకారణనామధేయుడై
యతులితదివ్యపుష్పకము నందహితల్ప శయానుడై జగ
ద్ధితపరధామమూర్తియగునూహించిన రాము నెంతుగా
కితరములయినదయివముల నేనుభజింపణజింప నెమ్మదిన్. ౮౬

తా॥ నాలుగువేదంబుల ప్రకాశతకు కారణుండై దివ్యపుష్పకమున శేషశయ్యపై పరుండి జగంబులకు హితకరంబుగ నుండెడి రామమూర్తిని సదాసేవింతును. ఇతరులనే నెప్పుడును తలంపను. 86

శ్లో॥ లసద్దివ్య శేషాచలే యోగపీఠే
సదానంద మయిమానికేమాసహాయం
మునీనాం హృదానంద మోంకారగమ్యం
సదాభూమిజాయుక్తమీశౌహృదంతే. ౮౭

మ. వరశేషాద్రిల సద్విమానమునిభా స్వద్యోగపీఠంబునం
దురమాయుక్తము గావసించిమునిసంతోషాకృతిన్ గల్గిని

స్ఫురదోంకారమునన్ భజింపదగురామున్ మేఘసుశ్యాముసుం
దరకామున్ రవిధామనామయుపరంధామమున్ భజింతున్మదిన్. ౮౭

తా॥ దివ్యమగు శేషాచలంబున యోగపీఠంబున దానందలి
మానమున మునులకు సంతసముగల్గ నోంకారగమ్యుండగుచు సీతతో
నుండు రాముని హృదయంబున తలంతును. 87

మూ. మనస్సింతం మనోంతస్థ మాద్యంతరూపం
మహాచింతవర్జంచమధ్య సమీశం
మనోమధ్యహంకారచిత్తాదిసాక్షిం
పరస్వప్రకాశంభజేరామచంద్రం. ౮౮

మ. అతిచింతారహితుల్ బరేషుబరునావ్యంతున్మనాంతస్థితున్
శతపత్రేక్షణు నంతరింద్రియులసత్సాక్షిన్ మనోవాసిన
చ్యుతసర్వాత్మునచింత్యునవ్యయంజరం జ్యోతిన్ హరిన్ ప్రకా
శతుమంద స్థితు రామచంద్రుమదినేసేవింతునశ్రాంతమున్. ౮౮

తా॥ చింతారహితుండును పరాత్పరుండును హృదంతరాళుం
డును ఆద్యంతరూపుండును సర్వాత్ముండును నవ్యయుండును నగు
రామభూవిభుని నే సేవింతును. 88

శ్లో॥ పరానందవస్తు స్వరూపాదిసాక్షిం
పరబ్రహ్మగమ్యం పరంజ్యోతి మూర్తిం
పరాశక్తిమిత్రాప్రియురాధితాంఘ్రిం
పరంధామరూపంభజేరామచంద్రం. ౮౯

మ. పరమానందసమస్తసాక్షియు పరబ్రహ్మంబగమ్యంబు
భాసురవేదాంతునకున్ సనాతనుబరంజ్యోతిన్ బరాశక్తిమి
త్రరిపువ్రాతసమార్చితాంఘ్రికమలున్ రామున్ బరంధాము నుం
దరకామున్ గుణధామురాఘవునసీతాకాంతునెంతున్మదిన్. ౮౯

తా॥ పరబ్రహ్మగమ్యుండును పరమానందరూపుండును సనాతనుండును పరంజ్యోతియు శత్రుమిత్రులు సేవింపదగిన పదపద్మంబులు కలవాడును పరంధాముండును నగు రఘురాము నాశ్రయింతును. 89

శ్లో॥ పరంపవిత్రంపరవాసుదేవం
పరాత్పరంతంపరమేశ్వరాఖ్యం
గుణత్రయారాధిత మూలకంద
మాదిత్యవర్ణంతమసఃపరస్తాత్. ౯౦

చ. హరి పరవాసుదేవుఁ ద్రిగుణార్చితభాస్కర వర్ణు రాఘవున్
బరమపవిత్రు సద్భువన పాలనశీలుఁ బరాత్పరున్ బరే
శ్వరుఁ బరు మూలకారణు బ్రశస్తు శ్రుతిస్మృతికీర్తితాంఘ్రిపం
కరుహు తమఃపరస్తు జనకప్రభుజాన్వితు రాముఁ గొల్చెదన్. ౯౦

తా॥ వాసుదేవుండును పరాత్పరుండును పరమేశ్వరుండును గుణత్రయంబుచే నారాధింపబడువాడును నాదిత్యవర్ణుండును నగు రామచంద్రుని సదాభజింతును. 90

శ్లో॥ క్షీరాబ్ధౌశశిశంకమౌక్తికలసద్ద్వీపేసుధర్మాంతరే
బిందాసార్ధకళాన్వితేపరిలస న్నాగాంతరేసంస్థితం
కోటీరాంగదహారకుండలమణిగ్రైవేయహారోజ్జ్వలం
శ్రీవత్సాంచితయింద్రనీలసదృశం రామంభజేతారకం. ౯౧

శా. క్షీరాబ్ధిన్ శశిశంఖమౌక్తికలసచ్ఛ్వేతాంతరీపస్థశృం
గారాదొన్నత్యసుధర్మమధ్యమున వేడ్కంబిందువన్వీధిఁ దే
జోరాజత్కళగల్గినాదమునఁదా శోభిల్లి శ్రీవత్సముం
జీరాంచత్పరికల్పయుక్తుడగునా శ్రీరామునిభావించెదన్. ౯౧

తా॥ పాలసముద్రంబున చంద్రుడు మొదలగువానిచే ప్రకాశించు శిఖరంబులు కలద్వీపంబున సింహాసనంబున కళాన్వితంబగు బిం

దువన వీధిని శేషశాయిపై పరుండి శ్రీవత్సాంకితుఁడౌచు నుండు రామునిసేవింతును. 91

శ్లో॥ అర్ధంరక్తపద్మార్ధంనీలరుచిరం అర్ధేందుచూడార్చితం
అర్ధంరత్నకిరీటకుండలధరం తాటంకమర్ధంధను
శ్శంఖంచక్రగదాబ్జసంయుతికరం శ్రేయోమయంవైష్ణవం
పాశంచాంకుశబాణవిధృతకరం రామంభజేతారకం. ౯౨

చ. ఇరుదెసఁద్రామనీలరుచి నింపగుకర్ణకకుండలంబులన్
బరఁగిగదాదిచక్రధర పాశశరాంకుశచాపపాణియై
సురుచిరవైష్ణవాకృతివి శోభిలిశంకరసేవ్యమానమై
నిరుపమమైనతారకము నిర్మలభక్తిభజింతునెంతయున్. ౯౨

తా॥ రెండువైపులందును నల్లనికాంతికల కర్ణకుండలంబులను శంఖచక్రగదాదులను చేతులందుంచుకొని వైష్ణవాకృతితో విరాజిల్లుచు శంకరునిచే సేవ్యమానుడగు రఘురాముని దలంతును. 92

మూ. సహస్రపత్రాంబుజకర్ణికాంత
జ్యోతిః ప్రకాశం పరమాదిమూలం
తేజోమయంజన్మజరావిహీనం
శ్రీరాఘవంనిత్యమహంనమామి. 93

మ. అమలాత్మల్ మదిఁగాంచనెంచినసహస్రాబంబున్ గర్ణిక
స్థిమితజ్యోతివిభాసితుండునిజ వార్ధిక్యాదిహీనుండుకాం
తిమరయుందున్ బరమాదిమూలముశ్రితార్తిఘ్నుండుశ్రీజానకీ
రమణీయాననపద్మపద్మసఖుఁడవురాముండునన్ బ్రోవుతన్. ౯3

తా॥ వేయిరేకులుకల పద్మంబునందలి కర్ణికయందు భాసిల్లు తేజంబుకలిగి వార్ధక్యాది హీనుండై యాశ్రితుల పీడలను సంహారించువాడైన శ్రీరామునిభక్తితో గొలిచెదను.

శ్లో॥ సకలభువనరత్నం సచ్చిదానందరత్నం
సకలహృదయరత్నం సూర్యబింబాంతరత్నం

విమలసుకృతరత్నం వేదవేదాంతరత్నం
పురహరజపరత్నం పాతుమాంరామరత్నం
ఇక్ష్వాకువంశార్ణవజాతరత్నం
సీతాంగనాయవ్వనభాగ్యరత్నం
వైకుంఠరత్నంమమభాగ్యరత్నం
శ్రీరామరత్నం శిరసానమామి. ౯౪

మ. భువనపవిత్రరత్నమును భూసుతయావనభాగ్యరత్నమున్
రవిఘనబింబమధ్యగత రత్నము సర్వహృదిస్థ రత్నమున్
భవనుతరత్నముం నిగమభాసితరత్నమమేయరత్నముం
బ్రవిమలపుణ్యరత్నమినవంశజరత్నమునన్ను బ్రోవుతన్. ౯౪

తా॥ లోకంబులకు రత్నంబును సీతాదేవి మొగంబునకు చంద్రునివాడును సకలహృదయరత్నంబును సూర్యబింబముమధ్యకురత్నంబును పుణ్యరత్నంబును వేదముచే భాసిల్లురత్నంబును నీశ్వరుని తపోభాగ్యరత్నంబును యిక్ష్వాకువంశరత్నంబును సీతయావనభాగ్యమునకు రత్నంబును వైకుంఠలోకంబునకు రత్నంబును నాకుభాగ్యరత్నంబును నగు శ్రీరామరత్నంబును స్మరింతును. 94

శ్లో॥ నిగమశిశిరరత్నం నిర్మలానందరత్నం
నిరుపమగుణరత్నం నాదనాదాంతరత్నం
దశరథకులరత్నం ద్వాదశాంతస్థరత్నం
పశుపతిజపరత్నం పాతుమాంరామరత్నం
శతమఖనుతరత్నం షోడశాంతస్థరత్నం
మునిజనపరరత్నం ముఖ్యవైకుంఠరత్నం
నిరుపమగుణరత్నం నీరజాంతస్థరత్నం
పరమపదవిరత్నం పాతుమాంరామరత్నం. ౯౫

మ. విమలానందమునిస్సమానగుణమున్ వేదాంతవాసంబు స
త్కమలాంతస్థము మోక్షదంబు మునివర్గస్థానుజప్యంబు న
త్యమునాదాంతముషోడశాంతగతముఌ ద్వాదశాంతస్థ ర
త్నముజిష్ణుస్తుతరామరత్నమునితాంత ప్రేమనఌ బ్రోవుతఌ. ౯౫

తా॥ నిర్మలమగు నానందరత్నంబును నిరుపమగుణరత్నంబును వేదాంతవేద్యరత్నంబును మోక్షదంబును సత్యస్వరూపంబును పరమపదరత్నంబును యింద్రాదులచే కొనియాడబడు రత్నంబును నగు రామరత్నంబు నన్ను రక్షించుగాక. 95

శ్లో॥ సకలసుతరత్నం సత్యవాక్యార్థరత్నం
శమదమగుణరత్నం శాశ్వతానందరత్నం
ప్రణయనిలయరత్నం ప్రస్ఫుటజ్యోతిరత్నం
పరమపదవిరత్నం పాతుమాంరామరత్నం. ౯౬

మ. సుకృతస్థానము సత్యముఌ బరముజ్యోతిస్వరూపంబు తా
రకనామంబపవర్గదంబు పరమబ్రహ్మంబునోంకారనా
మకసుస్థానముసద్గుణాకరము శుంభచ్ఛాశ్వతానందమ
త్యకలంకంబగు రామరత్నము నితాంత ప్రేమనఌ బ్రోవుతన్. ౯౬

తా॥ పుణ్యంబునకును సత్యంబునకును తేజంబునకును స్థానమైనదె జ్యోతి స్వరూపమై యపవర్గప్రదంబై యోంకారంబునకు చోటై సద్గుణంబుల కాకరంబై శాశ్వతానందంబు నిచ్చు రామ రత్నంబు నన్ను రక్షించుగాక. 96

శ్లో॥ నిఖిలనిలయమమంత్రం సత్యతత్వాఖ్యమంత్రం
భవకులహరమంత్రం భూమిజాప్రాణమంత్రం
పవనజనితమంత్రం పార్వతీమోక్షమంత్రం
పశుపతినిజమంత్రం పాతుమాంరామమంత్రం

చ. సకలనివాసమున్ దురిత సంఘవినాశము పార్వతీసతీ
ప్రకటితమోక్షదాయకము పావవిభావితమున్ విదేహభూ
పకతనయానుమంత్రముఁ గపర్ధిభాస్పదమున్ మునీంద్రతా
రకమగురామమంత్రము నిరంతరమున్ మముఁ బ్రోచుగావుతన్. ౯౭

తా॥ నిఖిలనిలయమంత్రంబును సత్యతత్వంబులను వానికి మంత్రంబును సరసారహారమంత్రంబును సీతకు ప్రాణమంత్రంబును హనుమంతుడు కొనియాడు మంత్రంబును పార్వతికి మోక్షమంత్రంబును నీశ్వరుని పవిత్రమొనర్చిన మంత్రంబును నగు రామమంత్రమే నన్ను రక్షించుగాక. 97

శ్లో॥ ప్రణవనిలయమంత్రం ప్రాణనిర్వాణమంత్రం
ప్రకృతిపురుషమంత్రం బ్రహ్మరుద్రేంద్రమంత్రం
ప్రకటదురితరాగద్వేషనిర్నాశమంత్రం
బ్రహ్మరుద్రేంద్రమంత్రం రామరామేతిమంత్రం
దశరథసుతమంత్రం దైత్యసంహారమంత్రం
మునిగణనుతమంత్రం ముక్తిమార్గైకమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రం. ౯౭

మ. ప్రకటోంకారనివాసమున్ ద్రుహిణజంభద్వేషిజప్యంబు తా
రకమున్ మానినుతంబు వాజికులమంత్రం బాసురన్వంసముౕ
సకలార్యావనముౕ జగత్ప్రకటముౕ సన్ముక్తిమార్గంబు మా
మకమద్వర్గహరంబు రామవిలసన్మంత్రంబునౕ బ్రోవుతౕ. 98

తా॥ ఓంకారమును ప్రకటించునదియును యింద్రునిచే పూజింపబడునదియు జగంబును పవిత్రంబు చేయునదియు మునులచే కొనియాడబడునదియు రాక్షసనాశనకరమైనదియు మోక్షమార్గప్రదంబును నగురామమంత్రమే నన్ను కాపాడుగాత :— 98

శ్లో॥ సంసారసాగరభయాపహవిశ్వమంత్రం
సాక్షాన్ముముక్షుజనసేవితసిద్ధమంత్రం

రంగహస్తముఖహస్తవానమంత్రం
సల్యమంత్రమనిశం భజరామమంత్రం
యతుజయతుమంత్రం జన్మసాఫల్యమంత్రం
ననమరణభేదక్లేశవిచ్ఛేదమంత్రం
కలనిగమమంత్రం సర్వశాస్త్రైకమంత్రం
ఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రం ౯౯

తతసంసారసముద్భవప్రబలసంతాపాపహారంబు సం
తతసారంగధరాస్యహస్తవిలసద్ధామంబు వేదాంత స
న్నుతమున్ జన్మజరాంకదుఃఖహరమున్ మోక్షప్రదంబున్ సమా
శ్రితశాఫల్యమురామమంత్రముమదిన్ జింతింతునశ్రాంతమున్. ౯౯

తా॥ సంసారంబునందలి భయంబును పోగొట్టునదియును వే
ంతసన్నుతంబును పుట్టుకముసలితనంబుల వలని పాపంబులను హ
చునదియు మోక్షంబిచ్చునదియు నాశ్రయులకు శరణ్యమైనదియు
గు రామమంత్రమునే సదానాహృదయంబున తలంతును. 99

అజ్ఞానసంభవభవాంబుధిబాడబాగ్నిం
అవ్యక్తతత్త్వనికరప్రణవాధిరూఢం
సీతాసమేతమనుజేశహృదంతరాళే
ప్రాణప్రయాణసమయేమమసన్నిధత్తే. ౧౦౦

మ. ప్రకటాజ్ఞానభవాంబురాశిబడబప్రాయంబభివ్యక్తమ
త్యకలంకంబుసలక్షణంబవనిజాతాయుక్తమవ్యక్తమున్
సకలవ్యాపకమున్ మహాప్రణవసుస్థానంబురామాఖ్యతా
రకమున్ మానుక దృష్టిగోచరమగుణ్ బ్రాణప్రయాణంబునన్. ౧౦౦

తా॥ అజ్ఞానంబువలన పుట్టినసంసారసముద్రంబునకు బడబా
యు నభివ్యక్తంబును కళంకరహితంబును సలక్షణంబును సీతా
విత్తోకూడినదియు సస్ఫుటమైనదియు సకలవ్యాపకంబును మహా

ప్రణవస్థానంబును రామతారకమని ప్రసిద్ధినొందినదియు దృష్టిగోచరం
బును నగు రామమంత్రంబును స్మరింతును. 100

మ. శివసాయుజ్యుండగు నాదిశంకరులుమున్ శ్రీరామకర్ణామృతం
బవనిన్ సంస్కృతమేర్పరించెనది మోక్షపేక్షచేకూరువం
శవరాబ్ధిందు ప్రసిద్ధసిద్ధకవిచే శ్రద్ధం దెనుంగించిరా
ఘవపూదండగనిచ్చినాడగొనుమా కలంబుగాసత్కృపన్.

మాలినీ. హరిపదయుగధారీయార్య చిత్తానుసారీ
పరమపదవిహారీభక్తలోకోపకారీ
శరధిసరధిమిత్రాశత్రుసంఘా
సరసిజదళనేత్రాసన్మునిస్తోత్రపాత్రా.

గద్యరూపమగు మత్తేభవృత్తము.

ఇది శ్రీరామపదారవిందమకరందేచ్ఛాత్తుసన్మత్తష1 ట్పదవిజ్ఞానసదాబ్జరేణుపటప్రాప్తోత్తమాంగోల్లస । న్మదితాంతఃకరణుండుసిద్ధకవిమాన్యుండైనరామావనీ । శదయాంభోక్ష నంజెప్పెరెండవదగునాశ్వాసంబభీష్టాప్తికిన్.

ద్వితీయాశ్వాసము—సంపూర్ణము.





శ్రీరస్తు.

# శ్రీరామకర్ణామృతము.

## తృతీయాశ్వాసము.

శ్లో॥ శ్రీరామంశివచాపభంగనిపుణం సీతాంగనావల్లభం
సుత్రామార్చిత పాదపద్మయుగళం సూర్యేందునేత్రోజ్జ్వలం
కర్పూరాంగవిలేపనంఘనరుచింకారుణ్యపాథోనిధిం
వందేకల్పతరుప్రవేశతలసత్సింహాసనాధిష్ఠితం. ౧

శా. శ్రీమందారమహీరుహాశ్రితలసత్సింహాసనాసీనునిన్
శ్రీమద్భర్గధనుర్విభగ్ననిపుణున్ సీతాధినాథున్ ఘన
శ్యామున్ జందనచర్చితాంగు రవిచంద్రాక్షున్ కృపాబ్ధిన్ బరం
ధామున్ రామునిఁబురందరార్చితు మదిన్ ధ్యానింతునశ్రాంతమున్. ౧

తా॥ ఈశ్వరుని ధనువును నేర్పుగావిరచినవాఁడును సీతకుభర్తయు నింద్రుడు మ్రొక్కు పాదపద్మంబులు కలవాఁడును చంద్రసూర్యులు నేత్రంబులుగా కలవాఁడును కర్పూరమిళితదేహుండును దయాసముద్రుండును నగురామునకు నమస్కారము. 1

శ్లో॥ శ్రీరామంశితికంధరస్యధనుషీసంభేదనాప్రాపితాం
సీతాంకాంచనసన్నిభాంపరిణతామాకల్పరత్నోజ్జ్వలాం
వామాంకోపరిలజ్జయానవముఖీమాలోక్యదివ్యాననే
శ్రీమద్భానుశశాంకకోటిసదృశంపాయాత్సనోరాఘవః. ౨

మ. రవిచంద్రాయుతకోటికోటినిభుఁడై రమ్యాసనాసీనుఁడై
భవకోదండవిఖండలబ్ధవిలసత్పాణిగ్రహుఁన్మైథిలిఁ
నవరత్నాభరణాఢ్యప్రాన్వితసువర్ణాననయిజవామాంకమున
దవలోకించురఘూద్వహుండుదయనన్నశ్రాంతముఁ బ్రోవుతన్. ౨

తా॥ కోటిసూర్యచంద్రులకాంతిని మించినకాంతి కలవాడై ధనువును విఱచి సీతనుబెండ్లాడి యామె యెడమవైపున తలవంచుకొని యుండ దివ్యరత్నసింహాసనంబున రత్నాభరణుండై యుండురాముడు నన్ను రక్షించుగాక. 2

శ్లో॥ శ్రీరామంభువనయికసుందరతనుంధారాధరశ్యామలం
రాజీవాయతలోచనంరఘువరం రాకేందుబింబాననం
కోదండాదినిజాయుధాశ్రితభుజైః భ్రాంతంవిదేహాత్మజా
ధీశంభక్తజనావనంరఘువరం శ్రీరామచంద్రంభజే. 3

మ. సరసిజాయతపత్రనేత్రువిలసత్సౌందర్యపాత్రుఁసుధా
కరబింబాననునీలతోయధరసద్గాత్రున్ధరాపుత్రికా
వరుఁగోదండముఖాయుధాశ్రితభుజుఁ చందారుమందారుశ్రీ
కరురామునిరాఘవుఁరఘువరుఁ గాంక్షించిసేవించెదన్. 3

తా॥ లోకములలోకెల్ల నందమైన శరీరంబుకలవాడును మేఘమురీతి నల్లనైనవాడును పద్మలోచనుండును చంద్రబింబాననుండును స్వకీయధనువును ధరించి కాంతించు భుజములుకలవాడునగు రామచంద్రునిసదా స్మరింతును. 3

శ్లో॥ ఆరామంవైభవానామభినవనుపథంహారకేయూరకాంతం
హాసోల్లాసాభిరామం మణిమయమకుటా మంగళానాంనివాసం
మందారారామసీమాంతరమణిభవనాధిష్ఠితంశిష్టసేవ్యం
సల్లాపానందసింధుప్రణవముభినిశం రామచంద్రంభజేహం. ౪

చ. తతవిభవాభిరాముసుపథప్రవిహారుదరస్మితాననాం
చితుమకుటాంగదాభరణుసేవకసేవధిమంగళాకరు
న్నతతముకల్పభూరుహవనస్థలసన్మణిగేహమధ్యరం
జితుసరసోక్తిసంతుష్టితసింధుపురామవిభుఁ భజించెదన్. 3

తా॥ విభవంబులకు చోటైనవాడును నాకాశంబున విహరించువాడును హారంబులను కుండలంబులను ధరించి చిరునవ్వుతో వెలయు మొగంబుకలిగి కల్పవృక్షపుపీడను భవ్యసింహాసనమున గూరుచుండియున్న శ్రీరాము ప్రభుని స్మరింతును. 4

శ్లో॥ రామంరాజశిఖామణింరఘువరంరాకేందుబింబాననం
రాజీవాయతలోచనం రణహతానేకాసురం రాఘవం
సీతాచారుపయోధరాంచితలసత్కాశ్మీరగంధాంచితం
రాజత్కుండలమండితంశుభకరం రామాభిరామంభజే. 5

మ. ధరణీనాథశిరోమణుఁ శుభతరున్ దైత్యాభ్రభంజానిలుఁ
ధరణీచారుపయోధరాంకితలసత్కాశ్మీరగంధాంచితం
సరసీజేక్షణుగండమండలవిరాజత్కుండలుఁ రామునుం
దరపూర్ణేందునిభాననుఁ గొలిచెదన్ రామాభిరాముఁ మదిన్. 5

తా॥ రాజశిఖామణియు పద్మంబువలె విశాలనేత్రంబును యుద్ధమున లెక్కలేనంత మంది రాక్షసులజంపిన వాడును సీత స్తనంబులందలికర్పూరకుంకుమాదులచే నలంకరింపబడిన రొమ్ముకలవాడును రత్నకుండలముల ధరించినవాడును నగు రాముఁనే సేవింతును. 5

శ్లో॥ రామంకోమలనీలమేఘవిలసద్గాత్రంపయోజానన
కాకుత్థ్సందశకంఠబాహువిలసత్కోదండబాణాన్వితం
పాపఘ్నంవిశదాయతాక్షియుగళం సౌమిత్రిసంసేవితం
భక్తానాంపరమౌషధంమునివరంసంస్తూయమానంభజే. 6

చ. కలుషవిపాశకారిదశకంధరకంధరబాహుఖండనో
జ్జ్వలశరధారిపంకరుహ వక్త్రిబరావరు సర్వమానిమం

డలనుతుంగంజనేత్రుగరుడధ్వజునాశ్రితలోకని
ర్మలపరమపుషధంబునరాములక్ష్మణునాశ్రయించెదన్. ౬

తా॥ నల్లనిమేఘమువంటి శరీరంబుతో రావణునిచంపిన యస్త్రంబుల రాపిడిచే కాంతించుధనువు చేతియందుండి విశాలమైన నేత్రంబులతో విరాజిల్లుచు లక్ష్మణుడు సేవచేయుచుండ భక్తులకు పరమపు పథము వంటివాడయి మునివరులచే నుతింపబడు రాముని కొని యాడుదును. 6

శ్లో॥ రామంశ్యామలమేఘకోమలరుచింరాకేందుబింబాననం
రక్షోఘ్నంరవిజార్చితంరఘువరం రత్నోజ్జ్వలత్కుండలం
రాజీనాక్షమమానుషంరణబలోదగ్రంరమానుగ్రహం
రాజేంద్రరమణీయరూపమసకృద్ధ్యాయేజగన్మోహనం. ౭

శా. రాముల్ విశ్వవిమోహనుల్ రఘువరుల్ రాజేందుగంజాత్ను
త్రామారాతవిమర్దనున్ రణబలోదగ్రున్ రమానుగ్రహున్
శ్యామాంగున్ రవిజార్చితున్ గనకరత్నాకల్పదీప్తుంబర
ధాముల్ గారణమూర్తిరమ్యునిసుధాధామాననున్ గొల్చెదన్. ౭

తా॥ రమణీయగుణంబులుకలవాడును విష్ణుసమానుండును ర మ్యరూపుండును స్త్రీలకు మనోహరుండును రాజులారాధించుపాదం బులు కలవాడును సీతాదేవి స్తనములందు హస్తములనై చికొనినవా డును నగురాముని సేవింతును. 7

శ్లో॥ రామంరమ్యగుణం రమాపతిసమం రాకాశశాంకాననం
రాజన్యంరమణీతారూపమమలంరామాభిరామంహరిం
రాజారాధితపాదపద్మమనిశం రాజన్యవిద్యాన్వితం
రాకేందుప్రతిమందారాకుచయుగేవిన్యస్తరామంభజే. 8

శా. రామున్ రమ్యగుణున్ రమాధిపసమున్ రామాభిరాముల్ బరన్
ధామున్ రాజలలామురాఘవుసుధాధామాననున్ భార్గవీ
రామారత్నపయోధరోజ్జ్వలకరున్ రాకేందుసంకాశునా
సామిన్ ధాజవరార్చితాంఘ్రియుగళున్ సద్భక్తిసేవించెదన్.

శ్లో॥ రామంకౌశికభాతమప్రియకరం సీతాపతింసానుజం
రక్షోఘ్నంవనవాసినంగుణనిధింవిఘ్నవిఘ్నమాప్తార్కజం
సేతోర్బంధనధీనవానరబలం ధిక్కుంభకర్ణేంద్రజి
త్పక్తిగ్రీవసువద్యీషణమజం శ్రీరామచంద్రంభజే. ౯

మ. సరసుఁ గౌశికగౌతమ ప్రియకరుఁ దుష్టోజేసువిఘ్నఘ్నుసు
స్థిరసౌమిత్రిసమేతురాము వనవాసిన్ భానుపుత్రాప్తుసు
స్తరవారాశినిబంధనప్లవగసంతానుఁ దశాస్యాదిము
ష్కరదైత్యారివిభీషణావనురఘుస్వామిఁ బ్రశంసించెదఁ. ౯

తా॥ విశ్వామిత్రుని యాగంబును రక్షించినవాడును సీతను వివాహమాడినవాడును రాక్షసులజంపినవాడును వనంబునచాలకాలమున్న వాడును గుణనిధియు సుగ్రీవునకు మిత్రుండును విభీషణునిరక్షించినవాడును నగురాముని స్మరింతును. 9

మా. రామంకోమలనీలనీరదనిభం నీలాలకాలంకృతం
కట్యాంశోభితకింకిణీ ఝణఝణ ధ్వానైరుపోతంశిశుం
కంఠాలంబితరక్షునిర్మలనఖంకజాక్షుమజ్జచ్ఛవిం
ధాస్వంతంమకుటాంగదాదివివిధాకల్పంసరామంభజే. ౧౦

మ. హరినీలాలకునీలనీరదవిరాజాంగకిరీటాదినుం
దరసద్భూషణుగింకిణీఝణఝణధ్వానస్ఫురన్మేఖలుఁ
వరశార్దూలనఖప్రకాశితగళుఁ బాలున్ రఘుస్వామిను
స్థిరురాకేందునిభాననున్ గుణనిధిన్ శ్రీరాముగీర్తించెదన్. ౧౦

తా॥ నల్లనిముంగురులును దేహంబునుకలిగి కిరీటాములధరించి ఝణఝణధ్వనిజేయు ఘంటలచే నొప్పుమొల నూలునుంచుకొని మెడయందు పులిగోరు ప్రకాశింపుచుండ చాలరూపంబున నొప్పురాముని సద్దానుతింతును. 10

మూ. రామంసీతాసమేతం విమలరవి శతాభాసమానం రసార్ద్రం
శ్యామ దేదీప్యమానంస్మితరుచిరముఖంకుండలోద్భాసిగండం
శ్రీవత్సల శ్రీనివాసం సురతరువిలసద్రత్నసింహాసనస్థం
దివ్యాకల్పోజ్జ్వలాంగం దినిజపతినుతతంభజేహం. ౧౧

మ. సురభూజాంతికరత్నపీఠివిలసత్త్రోణిసుతాయుక్తుభా
స్కరకోటిద్యుతు శ్రీనివాసుకుముదశ్యాముబరంధామును
దరమందస్మితవక్త్రు జిష్ణుమతునానారత్నవిభ్రాజితా
భరణుఁ రామురసార్ద్రువాజిమతు శ్రీమత్సాంకు సేవించెదన్. ౧౧

తా॥ స్వచ్ఛమగు నూర్గురుసూర్యులకాంతిని మించినకాంతి కల వాఁడును రసార్ద్రుండును చామనచాయ శరీరముకలవాఁడును చిఱునవ్వు మొగంబున వెలయుచు కుండలములచే భాసిల్లుగండస్థలంబులతో శ్రీరత్సలాంఛనముతో కల్పవృక్షమూలంబున రత్నసింహాసనమున రాజిల్లురాముని దలంతును. 11

మూ. జలనిధికృతసేతుం దేవతానందతానందహేతుం
దశముఖముఖరక్షోదారవైధవ్యహేతుం
మునిజననివహానాం ముక్తిసౌఖ్యాదిహేతుం
రఘువరకులకేతుం కీర్తయేధర్మహేతుం. ౧౨

మ. తతపౌలస్త్యముఖాసురేంద్రసతివైధవ్యప్రహేతుండుసం
తతమానీశ్వరమోక్షసౌఖ్యదుఁడు మార్తాండాన్వయాంభోధిభా
సితచంద్రుండు సురప్రమోదితుఁడు రాజీవాయతాక్షుండు బం
ధితసింధుండగురామభూవిభుడుమన్నించున్ ననున్ సత్కృపన్. ౧౨

తా॥ సముద్రమునకు సేతువుగట్టి దేవతలకానందముచేసి రావణునిభార్యలను విధవలగా జేసి మునిజనులకు ముక్తిసౌఖ్యంబునిచ్చి రఘుకులమున కలంకారమై యుండురాముని కీర్తింతును. 12

మూ. సకలగుణవిధానం యోగిభిస్తూయమానం
భుజగసురవిమానంరక్షితేంద్రాదిమానం
మహితవృషభయానం. సీతయాశోభమానం
స్మరతుహృదయభాను బ్రహ్మరామాభిరామం. ౧౩

మ. వరయోగీంద్రసుతున్సురేంద్రముఖ గీర్వాణేశమానావనూ
హారమిత్రున్సుతపుష్పకున్ జనకకన్యాయుక్తహృత్పంకజాం
తరసందీపితభానుసద్గుణనిధిన్రామాభిరామున్బరా
త్పరుశ్రీరామునమేయు రాఘవపరబ్రహ్మంబుజింతించెదన్. ౧౩

తా॥ సమస్తసద్గుణంబులకు స్థానమై యోగులచే నుతింపబడుచు మునులహృత్పద్మంబుల భాసిల్లుచు యింద్రాదులచే సేవింపబడుచు వృషభంబుపై ప్రయాణించు శివుని పూజలందుచు నుండు రామనామమును స్మరించెద. 13

మూ. వరగుణమణిసింధూర్మైథిలీ ప్రాణబంధుః
కనకసిఖస్థారోక్యభూతలోద్భానుసూర్యః
దశరథనృపరత్నో దేవతాగ్రైకగణ్యో
భజితభువనభద్రో పాతుమాంరామభద్రః ౧౪

మ. సరసున్సద్గుణరత్నసింధువసుధాజాప్రాణసద్బంధువున్
ధరణీసమ్యగురుప్రభాకరుజగద్భద్రాను సంధానువ
జ్రిరధిక్షోస్థపరత్నమున్ రఘువరున్ దేవాగ్రగణ్యున్బరా
త్పరుశ్రీరామునుసుమేరుధీరుమదిసంభావింతునిష్ఠాప్తికిన్. ౧౪

తా॥ సరసుండై సుగుణసముద్రమై సీతకుప్రాణమై లోకంబులకు శుభమునుకల్పించునదై దేవతలలో మొదటస్థానము వహించిన రామనామమును నేకొనియాడెదను. 14

మూ. రామంరక్తసరోరుహాక్షమమలం లంకాధినాథాంతకం
కౌసల్యానయనోత్సుకం రఘువరం నాగేంద్రకల్పస్థితం

వై దేహీకుచకుంభకుంకుమరజోలంకారిహారిం హరిం
మాయామానుషవిగ్రహం రఘుపతిం సీతాసమేతం భజే. ౧౫

శా. కౌసల్యానయనోత్సవుం విమలు లంకానాథవిధ్వంసు సు
తాసాక్షీకుచకుంకుమాంకితలసద్వక్షుం సరోజేక్షణుం
దాసస్తోత్రు భుజంగతల్పు నరనాథస్వామి శ్రీరామునిన్
నాసామిన్ రఘునాయకుం దలచెద న్మాయామనుష్యాకృతిన్. ౧౫

తా॥ ఎఱ్ఱతామరలవంటి నేత్రంబులు కలిగి శేషశయ్యపై ప
రుండి కౌసల్యనేత్రంబులకుత్సవంబులందలికుంకుమ మేయలంకారముగా
గలిగి మాయామానుష విగ్రహుండైన రఘురాముని తలంతును. 15

మా. రామం హేమతటిత్ప్రభాంశుకధరం వీరాసనేసంస్థితం
బాలం నీలమణిప్రభం మధురిపుం దైత్యేంద్రగర్వాపహం
విశ్వామిత్రవసిష్ఠవానరవరైస్సంసేవ్యమానం సదా
నిత్యం భాస్కరచంద్రకోటిసదృశం సీతాసమేతం భజే. ౧౬

మ. వరవీరాసనసంస్థితున్ మధురిపుం వైదేహిసంయుక్తు సుం
దరవిద్యుత్ప్రభుః గాంచనాంబరధరున్ దైత్యేంద్రగర్వాపహుం
వరమున్ భాస్కరచంద్రకోటినిభు విశ్వామిత్రవైరించివా
నరసంసేవితుబాలునీలసదృశున్ రామప్రభుం గొల్చెదన్. ౧౬

తా॥ బంగారుమెఱుపువలె ప్రకాశించు పీతాంబరమునుధరించి
వీరాసనంబున గూరుచుండి విశ్వామిత్రాది మహాత్ములచే సేవింపబడుచు
రావణుని గర్వంబుపసంహరించిన రాముని స్మరింతును. 16

మా. శత్రుఘ్నో వ్యజనాంకితోపిభరతః పార్శ్వద్వయోఃపశ్చిమే
ఛత్రంచామరసంయుతంకలితవాన్ సంసేవితేలక్ష్మణః
మూలేకల్పతరోర్విమానవిలసన్మాణిక్యసింహాసనే
పద్మాస్యంమునిసేవితంరఘుపతిం సీతాసమేతంభజే. ౧౭

మ. మందారాంతికపుష్యకాంతివిలసన్మాణిక్యసింహాసనం
బందుం జామరపుండరీకధరుడై సానందుడై భ్రాతలిం

పొందఁగొల్వమునుల్ భజింప జెలువింపొందఁ బ్రకాశించునా
నంద బ్రహ్మము రామచంద్రుఁగొలుతున్ నాళీకవక్త్రున్ హరిన్. ౧౭

తా॥ మందారవృక్షమూలంబున కాంతితో ప్రకాశించు మాణిక్యసింహాసనంబున తెల్లతామర పద్మమువంటి వింజామరను ధరించి నానందుఁడై భరతాది సోదరులు గొల్వ ప్రకాశించు రామచంద్రుని నేఁగొలుతును. 17

మూ. వామాంకోపగత ప్తకాంచననిభం సీతాసమాలోకితం
హస్తాభ్యాం ధృతఛత్రచామరమహా సౌమిత్రిణాసేవితం
నిత్యంపూజితపాదపద్మయుగళం దేవైస్సురేంద్రాదిభిః
సేవ్యంమానుషరాక్షసైఃకపివరైః శ్రీరామచంద్రంభజే. ౧౮

శా. సతతంబుఁ వ్యజనాతపత్రధరుఁడై సౌమిత్రి గొల్వంగ సం
తతమింద్రాదిసుపర్వులంఘ్రికమల ద్వంద్వంబుబూజింపనా
శ్రితదైతేయకపీంద్రమర్త్యతతి సంసేవింపవామాంక సం
స్థితశృంగారధరాకుమారిగనునా శ్రీరాముసేవించెదన్. ౧౮

తా॥ సతతంబును వ్యజనాతపత్రంబును ధరించి లక్ష్మణుఁడు సేవచేయుచుండ యింద్రాదిదేవతలు జోహారులొనర్చుచుండ మునీంద్రులును మనుష్యులును సేవించుచుండ వామాంకమున సీతనిలచియుండ ప్రకాశించురాముని దలంతును. 18

మూ. కస్తూరీతిలకంఠపీంద్రహరణం కారుణ్యవారాన్నిధిం
క్షీరాంబోధిసుతాముఖాబ్జమధుపం కళ్యాణరామంనిధిం
కౌసల్యానయనోత్సుకం కపివంత్రాణం మహాపౌరుషం
కామారిప్రియమర్కకోటిసదృశం సీతాసమేతంభజే. ౧౯

శా. కౌసల్యానయనోత్సుకుఁ సరసిజా గారాననాబ్జానికై
లాసాధీశ్వరమిత్రునిఁ మృగమదాలంకారపాళస్థలున్
రానూర్ఘ్నరవికోటితుల్యు గపివర్యత్రాణుభవ్యాత్ముసీ
తాసాధ్వీయుతువాలభేదిగొలుతుఁ దాంతుఁ మహాపౌరుషు. ౧౯

తా॥ కౌసల్యానేత్రంబుల కుత్సవము చేయువాఁడును యీశ్వరునకు మిత్రుండును కస్తూరిఫాలభాగమునధరించినవాఁడును కోటిసూర్యప్రభాభాస మానుండును మహాపౌరుషుండునునగు రామునిసదాస్మరింతును. 19

మూ. విద్యుత్కోటిదివాకరంద్యుతినిభం శ్రీకౌస్తుభాలంకృతం
యోగీంద్రైస్సనకాదిభిఃపరివృతం కైలాసనాథప్రియం
ముక్తారత్నకిరీటకుండలధరం గ్రైవేయహారాన్వితం
వైదేహీకుచసన్నివాసమనిశం సీతాసమేతంభజే. ౨౦

మ. ఇనసౌదామినికోటికోటినిభుఁ గౌరీశప్రియున్ రత్నకాంచనగ్రైవేయకిరీటకుండలవిరాజిత్కౌస్తుభాలంకృతున్
సనకాదిప్రకటప్రభావయుతి సన్మాన్యున్ ధరాపుత్రికా
స్తనకుంభాంచితకుంకుమాంకితుని సీతారాము బ్రార్థించెదన్. ౨౦

తా॥ కవుస్తుభాలంకృతుండును సనకాదులచేస్తోత్రముచేయబడువాఁడును కైలాసనాథప్రియుండును ముత్యపుహారములఁకంఠముల ధరించినవాఁడును సీతస్తనంబులందు వక్షమునుంచుకొనిన వాఁడునగురామునిసేవింతును. 20

శ్లో॥ వైదేహీవర్ణనంరణజితం రత్నాకరాగారిణం
పంక్తిగ్రీవముదావహంపటిభుజం పద్మాప్తకోటిప్రభం
విష్ణుంజిష్ణుమవార్యశౌర్యనిలయం నీలాంబుదశ్యామలం
రత్నాలంకరణాన్వితంరఘుపతిం శ్రీరామచంద్రంభజే. ౨౧

మ. అవనిజావశవర్తిన్ జిష్ణురఘు రామాధీశుదోస్సారునిన్
రవికోటిద్యుతనీలనీరదనిభున్ రత్నాకరాగారురా
ఘవునన్వాత్మునవార్యశౌర్యగనకాక జల్పోజ్జ్వలున్ పంక్తికంఠవినిర్భేదవిష్ణునిన్ హృదయ పీఠంబందుభావించెదన్. ౨౧

తా॥ సీతకువశుడైనవాఁడును పరశురామునియుద్ధమున జయించినవాఁడును కోటిసూర్యప్రభాకలితుఁడును రావణుసంహరించినవాఁడును

మహాశౌర్యుడునురత్నాలంకారముల ధరించినవాడును నగురామునిసే
వింతును. 21

శ్లో॥ దేవానాంహితకారిణస్థ్భువనే కృత్వావతారం ధ్రువం
రామంకౌశికయజ్ఞవిఘ్నదనుజఘ్నం తాటకీసంహార
నిత్యంగౌతమపత్నిశాపగళనం శ్రీపాదరేణుంశుభం
శంభోర్మత్కుటచాపఖండనమహా సత్యంభజేరాఘవం. ౨౨

చ. అమరహితార్థమైధరణియం దవతారముదాల్చితాటకన్
సమయఁగఁజేసిగాధిసుత శత్రువిఘాతులసంహరించి స
త్కమలపరాగరాజి మునికాంతకుశాపముబాపిశంభు చా
పమునవలీల ద్రుంచి నశుభస్ఫురరాఘవునాశ్రయించెదన్. ౨౨

తా॥ దేవతలకొఱకై లోకంబుల కుపకారమొనర్చియవతారం
బులను ధరించివిశ్వామిత్రుని యాగంబుకాచితాటకను సంహరించియ
హల్యకుశాపమోక్షంబుచేసి శివునిధనువునువిరచి సీతనుపెండ్లాడినరా
మునిదలంతును. 22

శ్లో॥ రాజీవనేత్ర రఘుపుంగవరామభద్రం
రాకేందుబింబ సదృశానన నీలగాత్రం
రామాభిరామరఘువంశ సముద్భవత్వం
శ్రీరామచంద్ర మమదేహికరావలంబం. ౨౩

ఉ. సారసపత్రనేత్ర రఘుసత్తమనీరదనీలగాత్ర శ్రీం
గారనిధీశచ్ఛవికాసితవక్త్ర మహాత్మరాగవా
శ్రీరఘువంశవార్ధిమణి శ్రీరమణీముఖ పద్మభాస్కరా
దీనజనావనారఘువ నీయభయం బొసంగవే. ౨౩

తా॥ ఓరామా? రఘువంశోద్ధారకుడా, సీతమొగంబను పద్మ
మునకు సూర్యుడా? దీనులరక్షించువాడా! నాకుసాయమైనన్నివిధం 23
బుల కాపాడుము.

శ్లో॥ ముకురరుచిరగండం పుండరీకాభితుండం
కరికరభుజదండం రౌద్రతేజోగ్నితుండం
సమితభువనమండం భిందతో గ్రారిమండం
గుణనికరకరండం నౌమిరామప్రచండం. ౨౮

మ. గసరౌద్రజ్వలదగ్నికుండనిభు రక్షవ్యూహవిధ్వంసకున్
దనసద్భాషణుతుండితుండ సమదోర్దండప్రచండుర్ సరో
జనినాభుర్ ముకురాభగండయుగళుర్ సర్వాత్మ్మసర్వప్రపం
చనతాంఘ్రిద్వయుసద్గుణాకరురఘుస్వామిన్ మదిన్ గొల్చెదర్. ౨౮

తా॥ అద్దమువంటి గండస్థలంబులును యేనుగుతొండమువంటి భుజంబులును రుద్రతేజంబువంటి తేజంబును కలిగి శత్రుభీకరుండైన రాముని స్తుతింతును. 24

ము. కోదండకాండవినివేశితబాహుదండ మాఖండలాద్యమర వర్షితపుష్పవర్షం అయోధ్యవస్థితిరజఃపరిధూసరాంగ మవ్యాతితంరగునరేంద్రమరిప్రభేదం. ౨౫

మ. దనుజాధీశవిరోధియై ప్రకటయుద్ధ శ్రామపరాగోల్లస
త్తనుడై వాసవముఖ్యదేవతలు మందారప్రసూన వృ
ష్టినివర్షింపశరాసనాగ్రకరుడై చెల్వొందసూర్యాన్వవా
యునదీశోత్సలమిత్రురామవిభుసీతాధీశు బ్రార్థించెదర్. ౨౫

తా॥ యింద్రాదులు పుష్పవర్షంబుగురిపింప ప్రకాశించు చేతులు కలిగి రాక్షసవిరోధియై సూర్యవంశమునకు మణియైన రాముని తలంతును. 25

శ్లో॥ సేవ్యంశ్రీరామమంత్రం శ్రవణశుభకరం శ్రేష్ఠమజ్ఞానిమంత్రం
స్తవ్యంశ్రీరామమంత్రం నరకదురితదుర్వారనిర్ఘాతమంత్రం
భవ్యంశ్రీరామమంత్రం భజతుభజతుసంసారనిస్తారమంత్రం
దివ్యంశ్రీరామమంత్రం దివిభువివిలసన్మోక్షరక్షైకమంత్రం. ౨౬

చ. శ్రవణశుభస్కరంబు పటుసంస్మృతితాప నివాకరంబురా
రవముని హేతుదుష్కృతనిబర్హముభవ్యరిపుప్రతాపముఁ
భువిదివినుప్రకాశితము మోక్షదముఁనువివేకకారణం
బవురఘురామనామక మహంమనుజప్య మొనర్తునిత్యముఁ. ౨౬

తా॥ చెవులకింపయినదియు విషష్టజ్ఞానకరంబైనదియు సమస్తపాపంబుల పోగొట్టునదియు సంసారమును తరింపచేయునదియు భూమియందలి నరులకు దేవతలకుగూడ మోక్షంబునిచ్చునదియగు రామమంత్రమున సదాస్మరింతును. 26

శ్లో॥ ఆజానుబాహుమరవిందదృశంశుభాంగం
రాజాధిరాజమఘురాజితమఃపతంగం
శ్రీజానకీముఖసరోరుహమత్తభృంగం
శ్రీజానితంహృదిభజామికృపాంతరంగం. ౨౭

మ. అరవిందాయతపత్రనేత్రువరకల్యాణాంగు శ్రీజానకీ
తరుణీవక్త్రసరోజనీరధుజండై దైత్యారినాజానుబా
హురమేశుంగళపాంధకారవినాదుఁ సత్కృపాంబోధి మం
దరునిఁ రాజలలాము రామవిభునానందంబునంగొల్చెదన్. ౨౭

తా॥ ఆజానుబాహుండును పద్మనేత్రుండును శుభకరాంగుండును రాజాధిరాజులచే పూజింపబడు పాదంబులుకలవాడును పాపంబుల సంహరించువాడును దయాంతరంగుండును నగురామునిస్మరింతును. 27

పుూ. ఏకేనబాణ మపరేణ కరేణచాపం
హార్దంవహంతమ నమానజటాశిరస్కం
సీతాసహాయమనుజేన సహాయచరంతం
శ్రీరామచంద్రమనిశం కలయామిచిత్తే. ౨౮

చ. కరయుగళప్రదీప్తశరగార్ముకుడై రిపునాశకారియై
స్ఫురిజటాశిరస్కుడయి భూమిసుతాయుతుఁడై శ్రితార్తినం

హారుఁడయితారహీరధరుఁడై సహాలక్ష్మణుఁడై చరించు సు
స్థిరురఘురాము సంస్మరణజేసియభీష్టను జెందుచిత్తమా. 2!

తా॥ ఒకచేతియందు ధనువును రెండవచేతియందు బాణంబులను ధరించి సంతసించుచు జటావల్కలంబులను ధరించి సీతతోను లక్ష్మణునితోను వనంబుల దిరుగుచుండు రాముని రాత్రింబవళ్లు నా హృదయంబున తలంతును. 28

మూ. అమిాలయుందశశిరో వదనాంబుజాత
మున్మీలయన్ జనకజా నయనోత్పలానాం
ఆనందయన్ సకలజీవ చకోరరాశిం
శ్రీరామచంద్రమనిశం కలయామిచిత్తేః. ౨౯

చ. ఘనబలబాహుశౌర్యదశకంఠముఖాంబుజముల్ మొగుడ్పభూ
తనయవిశాలనేత్ర కుముదద్వయముల్ వికసింపసర్వ స
జ్జనవరచాతకావళిని సంభ్రమమొప్ప సముత్సహింపజే
సినరఘురామచంద్రనుతిచేసఫలత్వము నొందుచిత్తమా. ౨౯

తా॥ రావణుని నేత్రంబులకు కఠినముగను సీతనేత్రంబులకు శుభకరుడుగను గానుపించుచు సీతతోగూడినవాడై యాశ్రితులకే గాక సమస్తజీవకోటులకును నాధారభూతుండగు రాముని నాచిత్తంబుననసదా తలంతును. 29

శ్లో॥ రామ పురాణపురుషం రమణీయవేషం
రాజాధిరాజమకుటార్చిత పాదపీఠం
సీతాపతింసునయనం జగదేకవీరం.
శ్రీరామచంద్రమనిశం కలయామిచిత్తేః. 3౦

ఉ. రాముఁబురాణపూరుషుని రాజలలామకిరీటలసన్మణి
స్తోమవిరాజమానపరితో యురుపాద్వయురమ్యవేషునిన్
దామరసాక్షుభూసతిసు తారమణుఙ్జగదేకవీరు శ్రీ
రాముగుణాభిరామునినిరంతరముల్ స్మరియింపుచిత్తమా. 3౦

తా॥ పురాణపురుషుండును రమణీయవేషుండును రాజులకిరీటములందలి మణులచే కాంతించు పాదంబులుకలవాడును జగదేకవీరుండును సీతావల్లభుండును నగురాముని సదా స్మరింతును. 30

శ్లో॥ వైదేహ్యాసహగమ్య రాజ్యమనిశం సౌవర్ణసింహాసనే
మందారద్రుమవాటికాంతరమహా శ్రీచంద్రకాంతాలయే
కైకేయీవిజమాంజనేయమనిశం సౌమిత్రిణాసేవితం
మేఘశ్యామముదారహాసవదనం శ్రీరామచంద్రంభజే. 3౧

మ. స్థిరకల్పస్థలచంద్రకాంతవసతిన్ సింహాసనాసీనుఁడై
నిరతంబుంధరణీసుతాసహితుఁడై నీలోత్పలశ్యాముడై
ధరహాసాననుఁడై మరుత్సుత సుమిత్రాపుత్రకైకేయి స
ద్వరపుత్రార్చితుఁడై నరామజననాథస్వామి బ్రార్థించెదన్. 3౧

తా॥ స్థిరకల్పస్థలంబగు చంద్రకాంత వేదికపై నిరంతరము సీతతోకూడ సింహాసనమున గూర్చుండువాడును నల్లకలువరీతి చామనచాయవాడును చిఱునవ్వుమొగంబున వెలయు భరతలక్ష్మణులచే సేవింపబడువాడును నగు రామచంద్రుని భజింతును. 31

శ్లో॥ వైదేహ్యాపులకాంకురార్చిత తనుర్వ్యాలంబహస్తాంబుజః
హస్తే మోదితరత్నకంకణవరః కల్పద్రుమాణాంవనే
పాదాభ్యాంమణి పాదుకాద్యుతికరం ప్రేంఖన్నఖాభ్యాంచర
శ్శిష్టాలాపసుధారసోదితశతుమే శ్రీరామచంద్రోహరి. 3౨

మ. తతమందారవనాంతరంబునల సద్రత్నావళీపాదుకా
ద్యుతిజెన్నొందునఖోజ్జ్వలాంఘ్రియుతుఁడై యోషానమాశ్లేషరం
జితరోమాంచితగాత్రుడై యలరునా శ్రీరామచంద్రుండుమా
కతికారుణ్యమునిచ్చుసత్సరిస సల్లాపామృతం బెప్పుడున్. 3౨

తా॥ మందారవనాంతరమున రత్నంబులకాంతివలె భాసిల్లుగోళ్లచే భావమానంబగు పాదంబులతో సీతను కౌగలించుకొనుటచే

పులకరించిన రోమంబులతోడి శరీరముకలవాఁడై యలరు రామచంద్రుఁడు సర్వదా నన్ను రక్షించును. 32

శ్లో॥ వామాంకస్థితజానకీకుచయుగే విన్యస్తాంబుజం
ఉజ్జృంభాననిపంకజంపరిల సద్విస్పృష్టబింబాధరం
సత్తారేణవశిష్టకంకణరవే ఓంకారశబ్దాధరం
భ్రాంతంశారదచంద్రహాసమనిశం వందేసదారాఘవం. 33

ఉ. దాపలిపార్శ్వమందలరు ధాత్రిసుతాకుచకుంభయుగ్మసం
దీపితహస్తపంకజువినిర్మలశారదచంద్రహాసునిన్
శ్రీపతివిద్రుమాధరుహారిం బ్రణవోజ్జ్వల కంకణస్వనున్
తాప్మపతివిస్ఫుటాబ్జముఖు జానకిరాముభజింతునెప్పుడున్. 33

తా॥ ఎడమవైపుననున్న సీతకుచయుగంబున చేతులనుంచినవాఁడును నిర్మలమగు శరత్కాలచంద్రునినవ్వు చిఱునవ్వుకలవాఁడును పగడవంటి క్రిందుపెదవియు ప్రణవరవంబుద్దీపించు ధ్వనియు గలిగియుండు రామునిసదాభజింతును. 33

శా. వైదేహీసహితం సలక్ష్మణయుతం కైకాసుతంసానుజం
సుగ్రీవశ్చవిభీషణానిలసుతౌ నీలంవలంచాంగదం
విశ్వామిత్రవసిష్ఠగౌతమ భరద్వాజానుసంసేవితం
రామంమారుతిసేవితంస్మరతుమాం సామ్రాజ్యసింహాసనే. 34

మ. జనకాత్మోద్భవ లక్ష్మణాఖ్యయుతుఁడై సామ్రాజపీఠస్థుఁడై
దనుజేశార్కజశాయుజాంగద భరద్వాజాత్రి బ్రహ్మాత్మనం
దనదాధేయవిరోధిఘూతిభరతుల్ నానాప్రకారంబులన్
దినమున్ గొల్వఁజెలంగురామ విభునధిఁ గొల్తునిష్టాప్తికిన్. 34

తా॥ సీతాలక్ష్మణసమేతుండై సామ్రాజ్యసింహాసనమున గూరుచుండి విభీషణ సుగ్రీవాంగద హనుమదాదులు సేవింప విశ్వామిత్రవశిష్ఠగౌతమభరద్వాజాదులు చుట్టును గొల్వనుండు రామవిభుని గొలిచెదను. 34

మూ. రామః ప్రాంజలిరగ్రతోనిలసుతస్సా భ్రాత్రమాదర్శయన్
ఛత్రచామరయుగ్మభాసిత కరాన్పశ్చాత్ స్థలేపార్శ్వయోః
వామాంకేచనిజాన్ విభీషణముఖాన్ సంభావయన్ భోధయన్
ధీముద్రాకర తత్వరూపమవతాత సామ్రాజ్యసింహాసనే. ౩౫

మ. వరభద్రాసనుఁడై సతీసహితుండై భ్రాతల్ సితచ్ఛత్రచా
మరలన్ బట్టుచు పార్శ్వభాగమునఁ బ్రేమన్ దాల్పసామీరి ముం
దరకేల్మోడ్పవిభీషణాదులకుబోధన్ దెల్పుచున్ భవ్యసు
స్థిరముద్రాకరతత్వరూపియగునా శ్రీరామునేవించెదన్. ౩౫

తా॥ సీతాదేవితోఁగూడ భద్రసింహాసనమున గూరుచుండి తెల్లగొడుగును లక్ష్మణుండు పట్ట భరతుండు చామరమువైవ హనుమంతుడు ముందరచేతులను ముకుళించి కొల్చియుండగా విభీషణాదులకు తత్వబోధ దెలుపురాముని సేవింతును. 35

మూ. పౌగండేహితబాలకైఃపరివృతః పూర్ణేందుకాంతాననః
ప్రీత్యాబద్ధవిచిత్రహేమవసనే సంసక్తకాంచీగుణః
ఆజానుప్రవిలంబబాహుయుగళః శ్యామాంబుభృద్విగ్రహం
భ్రాతృవ్యానుచరశ్చరాచరగురుః పాయాత్సదారాఘవః. ౩౬

మ. వటుపౌగండవయస్కుఁడర్భక నిజభ్రాతృవ్యయుక్తుండు న
త్కటిబద్ధాంచితహేమవస్త్ర విలసత్కాంచీగుణోల్లాసి వి
స్ఫుటనీలాంబుదవర్ణవిగ్రహుఁడు సంపూర్ణేందువక్త్రుండు దు
ర్ఘటగార్యుండువిలంబబాహుఁడగు శ్రీరాముండునన్ బ్రోవుతన్ ౩౬

తా॥ విలంబబాహుండును కటియందు బంగారు పుట్టము గట్టికొని రత్నస్థాపితమయిన మొలనూలును ధరించి నల్లనిమేఘమోయన నొప్పుచు నిజసోదరులచే సేవింపబడుచుండు రాముడు నన్ను రక్షించును. 36

మూ. వైదేహీరమణీయవక్త్రవనజప్రద్యోతఖద్యోత సం
కేళిసద్మనిరత్నదీపకళికా కాంతేవసంతంహరిం

సౌరభ్యాః ప్రసవ ప్రయుక్త విలసచ్ఛయ్యాంత రేశాయినం
శ్రీమంతం రఘువంశదీపకమణిం శ్రీరామచంద్రం భజే. 36

మ. స్థిరకేళీభవనాంతరవితర్దీప్రావృతంబైన భా
సురసౌరభ్యప్రసూనతల్పమున నాక్షోణీసుతావక్త్ర తా
మరసాహస్కరుడై రహించుహరి శ్రీమంతున్ గా కుత్థాన్వయ తా
స్ఫురరత్నంబగు రామచంద్రుదలతున్ బూర్ణానుకంపానిధిన్. 36

తా॥ సీతాదేవియొక్క రమణీయమగు ముఖపద్మంబునకు సూర్యుని వంటివాడగు కేళీగృహమునందలి రత్నవికారమయిన పూల పాన్పున నుండువాడును కాకుత్థవంశరత్నంబును నగు రామచంద్రుని భజింతును. 37

మూ. రామోబద్ధపయోధి నిర్గుణదధిర్గత్వాచచారైరలం
లంకాం ప్రాప్య సకుంభకర్ణదనుజం హత్వారణేరావణం
తత్రస్థాప్య విభీషణం పునరగాత్సీతాపతిః పుష్పకం
బారూఢః పునరాగతస్సభృతవాన్ ధాత్రీం కుజఃగౌతుకః. 37

మ. బలముల్గొల్వఁగవార్ధిగట్టిరిపుప్రోల్ ప్రాపించి పౌలస్త్యము
లమర్దించికృపన్ విభీషణునకా యూరేలగావిచ్చి జె
స్నలరన్ మైథిలితోడబుష్పకవిమానారూఢుడై వచ్చిని
ర్మలసాకేతపురాభిషిక్తుఁడగు రామస్వామినన్ బ్రోవుతన్. 37

తా॥ చతురంగబలంబులును గొల్వ సముద్రమునకు సేతువును గట్టి శత్రుపురంబగు లంకను జేరి రావణుని జంపి దయతో విభీషణునకు పట్టమును గట్టి సీతతో గూడ విమానంబున గూరుచుండి వచ్చి సాకేతపురంబునకు వచ్చి పట్టాభిషిక్తుడగు రాముని దలంతును. 38

మూ. రత్నోల్లసజ్జ్వలితకుండలగండభాగం ।
కస్తూరికాతిలకశోభితఫాలభాగం ।

కర్ణాంతదీర్ఘనయనం కరుణాకటాక్షం ।
శ్రీరామచంద్రముఖమాశ్మనిసన్నిదత్తా. ౩౯

మ. కస్తూరితిలకాననుండుసుహితా కర్ణాంతనేత్రుండు దే
వస్తోత్రాంఘ్రిసరోరుహుండు కరుణాపాంగేక్షణుండంచిత
భస్తోదస్తకళాకలాపుడు మణిప్రస్ఫీతసత్కుండలుం
డస్తోకోజ్జ్వలకీర్తిరాముఁడు మదీయాత్మం బ్రసన్నుండగుఁ. ౩౯

తా॥ రత్నములను స్థాపించిన కుండలంబులను ధరించినగండస్థలంబులుకలవాఁడును కస్తూరినినుదుటనుంచుకొనినవాఁడునునగు రామచంద్రుని సేవింతును. 39

మా. హేలాభగ్నశశాంకశేఖరధనుర్యాభ్యామండలాఖండల
కణిమాళిలసద్వినుత్నమణి శ్రీర్దీప్తాంఘ్రిపంకేరుహః
కల్యాణాంజనయత్యఖ దవిభవః కల్యాణలీలోత్సవే
మార్తాండాన్వయమండనశ్చభవతాం రామస్సరామస్సదాం.

మ. ధరణీపాలకిరీటరత్న విలసత్పాదాంబుజాతుండు శం
కరకాండాసనఖండమండుధరణీ కన్యాసమేతుండు భా
స్కరవంశోద్భవమండనుండు నిజసత్కల్యాణలోత్సవా
కరుడవ్వురాముడొసంగుమాకునదయన్ కల్యాణమెల్లప్పుడుఁ. ౪౦

తా॥ రాజుల కిరీటంబు లందలి రత్నంబులచే కాంతించు పాదంబులును శివధనువును ఖండించి సీతను బరిణయంబయిన వాఁడును సూర్యకులాలంకారుండును నగు రాముడు సదా నాకు కల్యాణంబుచేయును. 40

శ్లో॥ విద్యుత్స్ఫురన్మకరకుండలదీప్తచారు
గండస్థలంమణికిరీటవిరాజమానం
పీతాంబరంజలదనీలముదారకాంతిం ౪౧
శ్రీరామచంద్రమనిశం కలయామిచిత్తే.

మ. పరవిద్యుద్ద్యుతిరత్నకుండల విభాస్వద్గండభాగుఁ బయో
ధరనీలాభ్రమణిదగద్ధగిత సత్కాల్యాణకోటీశు భా
స్కరచామీకరవిస్తృతాంబరు మునిస్తోత్రుఁ ధరాపుత్రికా
వరు శ్రీరామునిరంతరంబు మనసావాంఛన్విలోకింపుమా. ౪౧

తా॥ మెరుపులవలె మెరయు మకరకుండలములచే విరాజిల్లు గండస్థలంబులుకలిగి రత్నకిరీటమును గట్టినిండుమేఘమురీతినుండు రామచంద్రుని నాయెడదలంతును. 41

శ్లో॥ కరతలధృతచాపంకాలమేఘస్వరూపం ।
సరసిజదళనేత్రంచారుహాసంసుగాత్రం ।
విధినుతవనవాసం విక్రమోదగ్రవేషం ।
ప్రణుతరఘునాథం జానకీప్రాణనాథం. ౪౨

మ. ఘనకాలాంబుదసన్నిభాంగునకు భూకన్యామణిప్రాణనా
ధునకున్ సారసపత్రనేత్రునకు సద్ధోస్సారికిఁ జారుహా
సునకున్ కాముకపాణికిఁ బ్రకటతేజోరాజికిన్ శౌర్యధు
ర్యునకుఁ రామునకున్ వనీచరునకే నుత్కంఠతో మ్రొక్కెదన్. ౪౨

తా॥ కాలమేఘరూపుండును కరతలంబున చాపమును ధరించినవాడును సరసిజదళనేత్రుండును చారుహాసుండును బ్రహ్మచేవనవాసంబు విధింపబడినవాడును మహాశూరుండును నగు రామునకువందనమిడెదను. 42

శ్లో॥ యఃపృథ్వీభరవారణాయదివిజైస్సం ప్రార్థితశ్చిన్మయః
సంజాతపృథివీతలేరవికులే మాయామనుష్యోవ్యయః
నిశ్చక్రంహతరాక్షసఃపునరగాద్బ్రహ్మత్వమాద్యస్థిరాం
కీర్తింపాపహరాంవిధాయజగతాం తంజానకీశంభజే. ౪3

మ. అవనీధారనివారణార్థమున మర్త్యశ్రేణిపార్థింపఁగా
రవివంశంబున మర్త్యరూపతనుఁడై రక్షస్సులన్ ద్రుంచితై

భువనవ్యాప్తయశస్కుఁడై నిజపదంబుం చేరియవ్యక్తమై
శివమైయక్షరమైయచింత్యమగునా సీతేశుఁ బ్రార్థించెదన్. ౪౩
తా॥ దేవతలు ప్రార్థింపగా భూభారంబును దీర్పసూర్యవంశమున మనుష్యుఁడై పుట్టి రాక్షసుల ననేకులనుజంపి మూఁడులోకంబులందు వ్యాపించిన కీర్తిగలవాడై వైకుంఠమును చేరిస్థిరుడై యుండురాఘవుని ప్రార్థింతును. 43

శ్లో॥ విశ్వోద్భవస్థితిలయాదిషు హేతుమేకంమాయాశ్రయం। విగతమాయమచింత్యమూర్తిం। ఆనందసాంద్రమమలం నిజబోధరూపం। సీతాపతిం విదిత తత్త్వమహం నమామి. ౪౪

మ. భువనోత్పత్తిసమృద్ధినాశనకరున్ బోధస్వరూపున్ బ్రధా
నవిహీర్ను విమలున్ బ్రధానయుతు నానందున్ధరావుత్రికా
ధవుసిద్వంద్వడచింత్యుతత్త్వవిదుభక్తత్రాణపారీణుమా
నవనాథాగ్ర్యతు రామచంద్రుని జగన్నాథున్ బ్రశంసించెదన్. ౪౪
తా॥ లోకంబులపుట్టుకకు రక్షణకుచావునకు కారకుండును బోధస్వరూపుండును ప్రధానయుతుండును భువనానందుండును సీతాపతియును నచింత్యుండును జగన్నాథుడునునగురామభద్రునిస్మరింతును.

మా. శ్రీరామం నవరత్న కుండలధరం శ్రీరామరక్షామణిం
శ్రీరామంచ సహస్రభానుసదృశం శ్రీరామ చంద్రోదయం
శ్రీరామం శ్రుతకీర్తి సూకరమహం శ్రీరామముక్తిప్రదం
శ్రీరామం రఘునందనం భయహరం శ్రీరామచంద్రంభజే.

శా. శ్రీరామున్ నవరత్నకుండలధరున్ శ్రీరామురక్షామణిన్
శ్రీరామున్ శతకోటిభానుసదృశున్ శ్రీరామచంద్రానునున్
శ్రీరామున్ శ్రుతకీర్తి నాకరుపరున్ శ్రీరాముముక్తిప్రదున్
శ్రీరామున్ రఘునందనున్ భయహరున్ శ్రీరాముసేవించెదన్.
తా॥ నవరత్నకుండలముల ధరించి కోటిసూర్యప్రకాశమా

నుండై ముక్తిప్రదుండై యాదివరాహమూర్తియయి సంసారసాగరంబు
తీర్ణింప సాధకుండయి శరణులకభయమిచ్చుటలో నగ్రగణ్యుడయిన
రామప్రభునిసదాస్మరింతును. 45

మూ. రామచంద్ర చరణారవిందయో
రంతరంగచరభృంగలీలయా
తత్రసరితిచరసాశ్చతుర్భితుర్వి
ధామాకరందరసపవపంకజే. ४६

ఉ. శ్రీరఘురామపాదసరసీజములందలిమాడ్కిఁగాఁతుబెం
పారగభక్తివనయంబుఁ జరింపుచునుండుచిత్తమా
యాయరగాఁ జతుర్విధఫలాప్తికమౌ నిరతంబులయినపం
కేరుహపాలియందుఁ బరికింపరసంబొకటై ప్రవర్తిలుఁ. ४६

తా॥ ఓమనసా! రామచంద్రుని పాదారవిందములకు తుమ్మెద
రీతిగాభక్తియుక్తులతో సదాచరింపుచు చతుర్విధఫప్రాప్తిసాధకభూతం
బగుశ్రీరామరసంబును సేవింపుము. 46

మూ. రామఃపాతుసదైవమామరిభయాద్రామంసదాభావయే
రామేనైవహృదం మహత్తరతమో రామాయనిత్యం నమః
రారామాన్నాస్తి పరంపదంసులలితా రామస్యపాదాభజే
దామే ప్రీతిరచంచలాస్తు మమహే శ్రీరామమాంపాలయ. ४२

ఉ. రాముడుబ్రోచుశత్రుని కరంబులచేభయమందుకుండ
శ్రీరామునినన్నుతింతురఘురామునిచేలయమందుచాపముల్
రామునకేనుమొక్కెదను రామునకంటె బరంబులేదుశ్రీ
రామునకేనుదాసుడను రామునపై గురినిల్పియుండెదన్. ४२

మూ. రామమిందీవరశ్యామం వారిజాయతలోచనం
జ్యాఘోషనిర్జితారాతిం జానకీరమణంభజే. ४८

తా॥ రాముడునన్ను శత్రుభయములేకుండకాపాడును. ఆరా
మునినేను హృదయంబున భావింతును. రామునిచేతనేనేనుపవిత్రముచే

యబడితిమి. రామునికొఱకు నిత్యమునమస్కారము. రామునికంటెనా
కన్యదైవంబు లేదు. రామునియొక్కపాదంబులనే సేవింతును. రాముని
యందు నామనసుచంచలముగాక నుండుగాక :— 47

మ. ఘననీలోత్పలపత్రగాత్రు విలసత్కంజాతనేత్రుం ధరా
తనయామంజుకళత్రు కార్ముకమహాధ్యానాపహృద్వైరికాం
చనజేలుఁ గరుణాలవాలు వినుతత్రైలోకపాలు సద్భక్తిపా
వనసంశీలు యశోవిశాలు నిరఘుస్వామిన్ బ్రశంసించెదన్. ౪౮

తా॥ ఇందీవరశ్యాముండును వారిజాయతలోచనుండును ధను
ర్ఘోషచే శత్రువులను భయపెట్టినవాడును నగురామునిసేవింతును. 48

మూ. నానాదివ్యాస్త్రతేజస్స్ఫురదవమితభుజశ్శత్రుసంహారధీరః
కౌటిల్యోద్యోతమానభ్రుకుటియుతముఖందారయున్నంబుదా
తూణీరద్యుత్సవేగోల్లసితశరవరం తాడయిత్వాదశాస్యం (భ:
వీరశ్రీబంధురాంగస్త్రిదశపతినుతః పాతుమాంవీరరామః. ౪౯

మ. కుటిలభ్రూకుటితాస్యుఁడై కరలసత్కోదండదివ్యాస్త్రుడై
చటులారిందముఁడై జడవు జతుడై శ్యామాంగుడై ధీరుడై
పటుతూణీరవిముక్తకాండపవినిర్భగ్నా సురేంద్రాదియై
కటువృత్తింజయలక్ష్మిగొన్నధరణీకాంతుండునన్ బ్రోచుతన్. ౪౯

తా॥ నానాదివ్యాస్త్రంబులచే ప్రకాశించు [illegible]
శత్రుసంహారధీరుండును శ్యామాంగుండును కుటిలభ్రూకుటితాస్యుడై
జయలక్ష్మిని గొన్న రామచంద్రుండు నన్ను రక్షించుగాత. 49

మూ. హత్వాయుద్దేదశాస్యం త్రిభువనవిభవం వామహస్తేన చాపం
భూమావష్టభ్యతిష్ఠన్ వితతకరధృతం భ్రామయం బాణమేకం
ఆరక్తోపాంతనేత్రో శరదళితవపుః కోటిసూర్యప్రకాశః
వీరశ్రీబంధురాంగస్త్రిదశపతినుతః పాతుమాం [illegible]

మ. అరుణాంభోరుహనేత్రుఁడై శతసహస్రాదితసంకాశుఁడై
సురయోగీంద్రమునీంద్రకంటకు దశాస్యున్ ద్రుంచిచిత్రాంగుడై
ధరణిన్ గార్ముకమూని బాణ మొకచేతన్ ద్రిప్పుచున్ సన్నుతా
మరనాథుండు జయాభిరాముఁడగు రామస్వామి నన్ బ్రోవుతన్. ౫౦

తా॥ ఎఱ్ఱనిపద్మంబులవంటి నేత్రంబులును వేలకొలది సూర్య కాంతికలవాడై దేవతలకు సాధువులకు మునులకు కంటకుడయిన రావణుని చంపి ధనస్సువూని బాణ మొకచేత త్రిప్పుచు నమరనాదంబు చేయు రాముడు నన్ను బ్రోచెడిని. 50

శ్లో. సాకేతేస్వనికేతనే సురతరోర్మూలే లసద్వేదికే
హైమే రత్నమయం దధానమపరం హస్తాంబుజం జానుని
సీతాం బార్శ్వగతాం సరోవరకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం పరిపూర్ణచంద్రవదనం భాస్వత్కిరీటం భజే. ౫౧

మ. ప్రకటాయోధ్యను చందనాంతికమునన్ రత్నోజ్జ్వలద్గేహమం
దకలంకంబగు వేదికన్ మణికిరీటాలంకృతుండై సము
త్సుకతన్ జానువుమీఁద హస్తమిడి విద్యుద్భాసిపంకేరుహాం
తరతన్ మైథిలి బార్శ్వమందుగను సీతారాము భావించెదన్. ౫౧

తా॥ అయోధ్యలో చందనాంతికంబున రత్నోజ్జ్వలంబగు గేహంబున నకలంకంబగు వేదికపయిని మణికిరీటాలంకృతుండై యుత్సాహంబున మోకాలిపై హస్తంబు నిడుకొని సీతాపార్శ్వమునందు చరించుచుండ కాంతించు రాముని సదా స్మరింతును. 51

శ్లో. విద్రుద్వర్ణోపమాంగీం వికచదళముఖీం విద్రుమాబాధరోష్ఠీం
వేదండోద్ధతకుంభప్రతికుచయుగళాం వేదిమధ్యావతంసాం
శ్యామాం సంఫుల్లపద్మచ్ఛదనిభనయనాం చారుహంసాంసువా
సీతాం శ్రీరామదేవీం శ్రితజనవరదాం చింతయేనంతమూర్తిం.

మ. తతసంఫుల్లసరోజనేత్రి హరి వేదండాభకుంభస్తనిన్
శ్రితచింతామణి విద్రుమోష్ఠి నవరాజీవాననన్ జంచల

ద్యుతిగాత్రి ర్హారిరాజమధ్యనిగమస్తోత్రాద్యతాకారభా
సితనుస్యామసునాసికన్ గొలిచెదన్ శ్రీరామదేవిన్ మదిన్. ౫౨

తా॥ సంఫుల్లసరోజనేత్రియు వికచకమలముఖియు విద్రుమబింబాధరోష్ఠియు వేదండాభకుంభస్తనియు రాజీవాసనయు సింహమధ్యమువంటి మధ్యముకలదియు తెల్లనగు నాసికయుగల రామచంద్రమూర్తి భార్యయగు సీతను గొలుతును. 52

మూ. మాణిక్యమంజీరపదారవిందాం రామార్కవత్ఫుల్లముఖారవిందాం
భక్తప్రదాతృత్వకరారవిందాం । దేవీంభజే రాఘవవల్లభాంతాం.

చ. అనుపమరాముహాసువికచానన పంకజదోత్పన్నరత్నకాం
చననివనూపురాంఘ్రినవసారస యుగ్మనిజాశ్రితేచ్ఛదా
ననవకరాంబుజాతసురగుణ ప్రకతాంబుధి రామదేవి నె
మ్మనమున నిష్టసిద్ధికి సమాహితబుద్ధిం దలంతు నెంతయున్. ౫౩

తా॥ మాణిక్యములధ్వనిచే భాసమానమగు పదారవిందంబులును ఎఱ్ఱనిపద్మమువలె వికసించిన మొగంబును కలిగి భక్తులకు ధాతృత్వమును చేయు హస్తపద్మంబులు కలవాడును నగు రాముని భార్యయగు సీతను స్మరింతును. 53

మూ. జయతు విజయకారీ జానకీమోదకారీ
తపనకులవిహారీ దండకారణ్యచారీ
దశవదనకుఠారీ దైత్యవిచ్ఛేదకారీ
మణిమకుటధారీ చండకోదండధారీ. ౫౪

ఉ. ధారుణిజాను తోషకరు దామరసాప్తకుల ప్రదీపకున్
ఘోరనిశాచరాంబురుహ కుంజరుఁడచ్యుతు దండకాటవీ
చారుతరప్రచారు ధృతచాపు దశాననమర్దనున్ మణి
స్ఫారకిరీటధారి రఘుసత్తముఁడు ద్విజయప్రదుండగున్. ౫౪

తా॥ సర్వదా విజయకారియు జానకికి సంతోషకారియు సూర్యకుల విహారియు దండకారణ్యసంచారియు రాక్షసనాశంకరుండును మణిమ

కుటదా శ్రీయుతుండును చండకోదండధారియునగు రామునకు జయంబ గుగాక:— 54

మూ. చేతస్థితంచింతితచింతనీయం। చింతాహరరచింతితపారిజాతం మం
అచింతనీయంబహుచింత యేహం। త్వామేవరామం భువనాభిరా

మ. సకలాత్మస్థితు సర్వచింతుతు నిదానప్రాంగణాప్రాంత్య క
ల్పకమున్ శౌరినచింత్యునచ్యుతుఁబర బ్రహ్మంబుఁజింతాహరున్
బ్రకటానందకరున్ బరాత్పరుఁబరురాముఁ ఘనశ్యాముఁమది దా
రకనామున్ రవికోటిరాముతుది నశ్రాంతంబుఁ జింతించెదన్.

తా॥ సర్వచింతింతుండును చింతను హరించువాడును చింతిత పారిజాతుండును నచింతనీయుండును భువనాభిరాముండును చేతస్థితుండును నగురాముని సదా స్మరింతును. 55

మూ. సాకేతేశరదిందుకుందధవళే సౌధేమహామంటపే
పర్యస్తాగరుధూపధూపమండలే కర్పూరదీపోజ్వలే
సుగ్రీవాంగద వాయుపుత్ర సహితం సౌమిత్రిణాసేవితం
లీలామానుషవిగ్రహం రఘుపతిం రామంభజేశ్యామలం. ౫౬

మ. ఘనసాకేతమునందుఁగుంద సుమరాకాచంద్రదీప్తంబు వా
సదిలన్ జెన్నగధూపధూమనిభిచ్ఛాదంబు కర్పూర దీ
పనిరూఢంబగు సౌధమంటపమునన్ భ్రాతల్ కపుల్ గొల్వమిం
చిన లీలామనుజాకృతింబరగు శ్రీరాముఁజింతించెదన్. ౫౬

తా॥ సాకేతపురంబునందు తెల్లని మేడయందుమహామండపమున కర్పూరాగరుధూపంబులతోను దీపంబులతోను నిండియుండి సోదరులును కపులును గొల్చిలీలకుమనుష్యరూపంబును దాల్చి వెలుంగు శ్రీరాముని నుతింతును. 56

మూ. రామఃపితా రాఘవవమాతా
రామైవబంధుశ్చ సఖాసఖీవా

రామోగురుర్మే పరమంచదైవం
రామంవినానాన్య మహంస్మరామి. ౫౬

మ. రాముడుతండ్రి మజ్జనని రాముడెబంధుఁడు రామచంద్రుడే
రాముసుమిత్రుడున్ గురుడు రాఘవుడే పరదైవతంబగున్
రాముడెమాకుదిక్కెపుడు రామునిగొల్చెద సంతసంబు శ్రీ
రామునిదప్ప నన్యులనిరంతరమెంచదలంపనెమ్మదిన్. ౫౬

తా॥ రాముడేనాకుతండ్రి. రాముడేనాకుతల్లి. రాముడేనాకుబంధువు. అతడేస్నేహితుడు. అతడేనాకుగురుడు. అతడేదేవుడు. రాముని తప్ప యితరదైవములను నేస్మరింపను. 57

మూ. యాకృపామునిసంత్రాణే యాకృపాపినాయకే
యావిభీషణరక్షాయాం నారామమదీయతాం. ౫౭

ఉ. ఏదయవల్ల తాపసుల నేలితొ వానరశేఖరాళిపై
నేదయగల్గియుండునొ రహిన్ దశకంధరసోదరావనం
బేదయవల్లనయ్యెనను నిప్పుడు నాదయ బ్రోవుమయ్య దా
మోదరరామరాఘవ సముజ్జ్వలభూషణ భక్తపోషణా. ౫౭

తా॥ ఓరామా ! ఏదయనుచూపి నీవుమునులను కాపాడి వానరులనురక్షించి విభీషణునకభయమొసంగి దేవతలమెప్పుపొందితివో అట్టి దయనే నాయందుచూపుము. 58

మూ. దయానిధేరాఘవరామచంద్ర నిరస్యపాపానిమమాఖిలాని
త్వద్ధ్యేనభక్తింసుదృఢాంప్రయచ్ఛసైనవప్రసూతాహ్యఖిలాభిష్టాన్

ఉ. ప్రకటదయానిధీవరదరాఘవరామమదీయకల్మష
ప్రకరములెల్లబాపి తమపాదసరోజములందుభక్తిమా
మకహృదయంబునందుననుమానములేకయొసంగుమయ్య నే
మకులకభీష్టసంపదలవారిగసంభవమందునెవ్వడున్. ౫౮

తా॥ ఓరాఘవా ! నమసపాపంబులను హరిం... [illegible]

దుర్దృఢమైనభక్తినినేఁకోర్చునదియగు నీయందలిమమకారమును నా
హృదయమందు నిలుచునట్లు చేయుము. 59

శ్లో॥ అక్షణబాణతూణీర సమాయూఢీకకార్ముకః
దశగ్రీవశిరోహంతా శ్రీరామశ్శరణంమమ
శ్రీరామమేత్వంహిపితాచమాతా
శ్రీరామమేత్వంహిసుహృచ్చబంధుః
శ్రీరామమేత్వంగురుశ్చగోష్ఠి
శ్రీరామమేత్వంహిసమస్తమేవ. ౬౦

ఉ. అక్షయబాణతూణధరుఁడై గుణచాపముపిక్కటిల్లగా
రాక్షసరాట్టలంబులుగరుక్కనద్రుంచిననీవెనిక్కసం
రక్షకుఁడుగురుండును వరప్రభుఁడంబయు తండ్రిదాతయుఁ
పక్షము భ్రాతయున్ సఖుఁడు బంధుఁడుసర్వమునీవెరాఘవా. ౬౦

తా॥ అక్షయంబులగు బాణంబులను అంబులపొదులను ధరిం
చినధనస్సుకలిగి రావణుని శిరంబులను నఱికిన శ్రీరామచంద్రుఁడే నాకుర
క్షకుఁడు. రాముఁడేనాతండ్రి. రాముఁడేనాతల్లి. అతఁడేబంధువు. అతఁడే
స్నేహితుఁడు. అతఁడేగురుఁడు. అతఁడేనాకుసర్వము. 60

మా. పటుతరజలదధ్వానమాదాయచాపం
పవనజవనవేగంబాణమాకృష్యతూణాత్
అభయవచనదాయీ సానుజస్సర్వతోరో
రణహరదనుజేంద్రో రామచంద్రస్సహాయః. ౬౧

మ. జలదధ్వానసమానఘోరనినదజాయుక్తచాపంబునన్
జ్వలనాప్రోజ్జ్వలవేగబాణమువడిన్ సంధించిదృష్టించిదో
ర్బలుపౌలస్త్యవధించినిర్భయునిగాభక్తాళిగావించి దా
పలసౌమిత్రిజెలంగజెన్నఘురఘుస్వామేసహాయంబగున్. ౬౧

తా॥ మేఘగర్జనముతోసమానమైన ధ్వనికలధనువునందువాయు
వేగమును మించినవేగముకల బాణమునుధరించి శత్రువులకు గూడ

నభయంబు నొసంగుచుసోదరులతో కూడినవాడైన రాముడేనాకెల్లప్పు
డును శరణ్యుడు. 61

మూ. కౌసల్యాలసదాలవాలజనితస్సీతాలతాలింగితః
సిక్తఃపఙ్క్తిరథేనసోదరమహాశాఖీరరత్న్యున్నతః
రక్షస్తీక్ష్ణనిదాఘపాటనపటుచ్ఛాయాభిరానందకృ
ద్యస్మద్వాంఛితసత్ఫలానిభవతు శ్రీరామకల్పద్రుమః. ౬౨

శా. కౌసల్యాలసదాలవాలమిథిలాకన్యాలతాయుక్తమున్
దాసాసక్తమునాజిపోషితముసోదర్యప్రశాఖంబుర
క్షున్నిద్రానునిదాఘతప్తజనరక్షాదక్షణక్షీణ ఛా
యాసంపన్నమురామకల్పతరువిష్టార్థంబుమాకీవుతన్. ౬౨

తా॥ సీతాదేవియనుతీగతో కూడినదియు కౌసల్యయనుపాదునం
దుపుట్టినదియు దశరథునిచే తడుపబడినదియు సోదరులనుశాఖలతో
కూడినదియునగురామకల్పతరువు నాకుసంపదాదులనొసంగి కాపాడు
గాక. 62

మూ. నిగమశిశిరరత్నం నిత్యమాశాస్యరత్నం
జననుతనృపరత్నం జానకీరూపరత్నం
భువనవలయరత్నం భూమిజామేకరత్నం
రఘుకులవరరత్నం పాతుమాం రామరత్నం. ౬౩

మ. నిగమాంతోజ్జ్వలరత్నసూర్యనుచమాణిక్యంబుసీతాపతీ
సుగుణప్రాంచితరత్నమర్కకులభాస్వద్దివ్యసద్రత్నమున్
జగదత్యద్భుతరత్నమున్ సకలరాజాస్థానరత్నంబు స
ర్వగతంబౌరఘురామరత్నమునికిన్ రక్షించునశ్రాంతమున్. ౬౩

తా॥ వేదంబులచే పొగడబడునదియు జనులచేపొగడదగినరాజ
రత్నంబును సీతారూపరత్నంబును భూమికంతకురత్నంబును రఘుకు
లంబునకు రత్నంబునునగు రామరత్నమునన్ను సదాకాపాడుగాక. 63

మూ. విశాలనేత్రం పరిపూర్ణగాత్రం
సీతాకళత్రం సురవైరిజైత్రం
కారుణ్యపాత్రం జగతఃపవిత్ర
శ్రీరామరత్నం ప్రణతోస్మినిత్యం. ౬౪

చ. వికసితపుండరీకదళవిశ్రుతనేత్రు సురారిజైత్రు సే
వకనుతిపాత్రునీలఘనవాసరత్నవిరాజగాత్రు తా
రకకమలాకళత్రు త్రిపురవ్రికటాసురజైత్రమిత్రునిన్
సకలజగత్పవిత్రురఘుసత్తమరత్నమునాశ్రయించెదన్. ౬౪

తా॥ విశాలమగు కన్నులును చక్కని శరీరంబును కలిగి సీత భార్యగా గలిగి రాక్షసులకు శత్రువై దయకు సముద్రుడయి సమస్త జగంబులను బవిత్రంబుచేయు రామరత్నంబునకు సదానమస్కరింతును.

మూ. శ్రీరామచంద్రశ్శ్రితపారిజాత
స్సమస్తకల్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకో
నిరంతరంమంగళమాతనోతు
ఇందీవరశ్యామపుండరీకనిభేక్షణః
ధృతకోదండతూణీరో రామపవగతిరమ్మ. ౬౫

మ. శ్రితమందారుడుసర్వశోభనగుణశ్రీరాముడానందుడం
చితసీతావదనాబ్జషట్పదమురాజీవాయతాక్షుండుమా
నితతూణీరధనుర్ధరుండుపరుడుర్ నీలోత్పలాంభోదశో
భితుడవ్రరాముడుమాకుదిక్కయిశుభంబేనిచ్చలిచ్చుగ్గృపన్. ౬౫

తా॥ ఆశ్రితులకు కల్పతరువును సమస్తగుణంబులచే మనోహరుండును సీత ముఖపద్మంబునకు తుమ్మెదయు తెల్లతామరలవంటి నేత్రములును కలిగి నిరంతరము ధనుర్ధరుడయి యుండు రామునకు వందనము.

మూ. ఇచ్ఛామోహిమహాబాహుం రగురంబమహాబలం
గజేంద్రమహతాయాంతం రామంఛత్రావృతాననం. ౬౬

మ. అనయంబుఁ గతినీవెయంచుమతిమోహభ్రాంతినొందించునా
ఘనబాహాబలుపుండరీకధరు మేఘశ్యామునాజానుబా
హునగోత్తున్నతగరాజ్జమనుసర్వోత్కృష్టురామున్ సనం
దనగమ్యున్ రఘువీరునేనెదుటసందర్శింతుహర్షంబునన్. ౬౬

తా॥ ఘనబాహుబలుండును మేఘశ్యాముండును మోకాలివ
ఱకు వ్రేలాడు చేతులు కలవాడును సర్వగుణంబులచే నుత్కృష్టుండును
నగు రఘురాముని సంతోషమున నేసేవింతును. 66

శ్లో॥ రామోనామబభూవహుంతదబలా సీతేతిహుంతౌపితు
ర్వాచాపంచవటీవనేవిరహతస్తామాహరద్రావణః
నిద్రార్థంజననీకథామితిహరేహుంకారతశ్శృణ్వత
స్సౌమిత్రేక్వధనుర్ధనురితివ్యగ్రాగిరఃపాతునః. ౬౭

మ. తనయున్నిద్దురబుచ్చుతల్లిబలికెంధాత్రీస్థలిఁ రాఘవుం
దనజెన్నొందినభార్యగాదశరథుండంపన్వనింజేరసీ
తనుగొంపోయెదశాస్యుడన్నవినినంతన్ వ్యగ్రుడై లక్ష్మణా
ధనువుందెమ్మనుబాలరామునికటూక్తంబుల్ ననున్ బ్రోవుతన్. ౬౭

తా॥ కొమారునినిద్రబుచ్చుటకు తల్లిఅనగనగానొక రాముడని
యు నతనిభార్యసీతయనియు వారిద్దరును పంచవటీక్షేత్రంబున దశరథు
ని యానతిచే నుండరావణుండను రాక్షసుడుదానిని హరించెను. వాడు
నిద్రనిమిత్తమై చెప్పయూకథనువినుచు హఠాత్తుగాలేచి లక్ష్మణా నా
ధనువు నిటుతెమ్మను రామునిమాటలు నన్నురక్షించును. 67

శ్లో॥ శ్రీరామచంద్రేతిదయాపరేతి।భక్తప్రియేతిభవబంధవమోచకేతి
నాథేతినాగశయనేతిసదాస్తువన్తం।మాపాంహిభీతమవిశంకృపణ
[illegible]ం. ౬౮

చ. హరిరఘురామచంద్రుఁడుదయాపరుఁడాశ్రితవత్సలుండు భ
స్తరభవబంధమోచనుడు సర్వశరణ్యుడువిశ్వనాథుఁ డం

చరసినిరంతరంబుహృదయంబున నెంచగ నెంతవాడ ము
ష్కరుడమలుబ్ధుడన్ దురితకర్ముడ బ్రోవుము రామ రాఘవా. ౬౮

తా॥ ఓదయాపరుడా! శ్రీరామచంద్రుడా! భక్తప్రియుడా! సంసారబంధనమును నాశనమును జేయువాడా! క్షేమళాయియా! రామా! అనిశదాస్త్రము చేయు నన్ను కాపాడుము. 68

శ్లో॥ రామచంద్రచరితామృతపానం । సోమపానశతకోటిసమానం
సోమపాంత్రిశతకోటిభిరేవ । జన్మనేతిరఘునాయకనామ్నా. ౬౯

చ. అరయగ రామచంద్రచరితామృతపానసమానతగున్
గురుతరసోమపానశతకోటులుతద్విధసోమపానని
ర్భరులకు జన్మల్గలవు రామసమాఖ్యనిరంతరంబు సు
స్థిరతజపించువారల జేకురనేరవుజన్మకర్మముల్. ౬౯

తా॥ విచారింపగా నూఱుయాగంబు లొనర్చితద్యాగంబులందు త్రావెడిసోమపానంబులకు రామచరిత్రమను అమృతపానము సమానమగును. ఆసోమపానముచేసినవారికి జన్మలున్నవి కానియీయమృతమును త్రావినవారికిజన్మలు లేవు. 69

శ్లో॥ రామరామదయాసింధో రావణారేజగత్పతే
త్వత్పాదకమలాసక్తిర్భవేజ్జన్మజన్మని ౭౦

చ. హరిహరి రామరామకరుణాంబునిధీజగదేకనాథదా
శరథిదశాననాద్రికులిశాయుధమామకవిన్నపంబునా
దరమునచిత్తగింపుక్రమతన్ భువిజన్మము లెన్నిగల్గినన్
సరసభవత్పదాంబుజరజఃకణసేవయొనర్చునట్లుగన్. ౭౦

తా॥ ఓదయాసముద్రుడా! రావణువిరోధీ! జగంబులకు ప్రభువా! రామచంద్రా! ప్రతిజన్మయందును నాకునీపాదంబులందు భక్తి కుదురునట్లుగా చేయుము. 70

శ్లో॥ శ్రీరాఘవంరామచంద్రం రావణారింరమాపతిం
రాజీవలోచనంరామం తంవందేరఘునాయకం

ఉ. శ్రీరఘురామచంద్రునకు శ్రీకరమూర్తికి రావణారికిన్
శ్రీరమణీమణీపతికి సేవితయోగిహృదబ్జవాసికిన్
సారసపత్రనేత్రునకు సన్నుతమాని సుపర్వకోటికిన్
శౌరికి రాఘవేంద్రునకు సంతతమే నమస్కరించెదన్. ౭౧

తా॥ రావణునకు విరోధియు లక్ష్మీపతియు రాజీవలోచనుండును రఘుకులమునుద్ధరించినవాఁడును నగు రామచంద్రునకు నమస్కరింతును. 71

శ్లో॥ యత్పాదపంకజరజశ్శ్రుతిభిర్విమృగ్యం
యన్నాభిపంకజభవః కమలాసనస్స్యాత్
యన్నామసారరసికో భగవాన్ పురారి
స్సం రామచంద్రమనిశం హృది భావయామి. ౭౨

ఉ. ఎవ్వని పాదపద్మరజమెల్ల శ్రుతుల్వెదకంగ నేరకుం
డెవ్వని నాభికంజమున నేర్పడ సంభవమొందె గీర్వరుం
డెవ్వని నామసారము భజించి బుధాగ్రణియయ్యె శంకరుం
డవ్విభు రామభూధవుని హర్నిశము న్మది సంస్మరించెదన్. ౭౨

తా॥ సమస్త వేదంబులు కూడ నెవని పాదరజంబును వెదకిగన జాలవో యెవని బొడ్డునందలి పద్మంబున బ్రహ్మ జనించెనో, భగవంతుం డైన శివుడు యెవని నామమునందలి తత్వమో యా రామచంద్రుని మనం 72
బున సదా స్మరింతును.

శ్లో॥ యస్యావతా చరితాని విరించిలోకే
గాయంతి నారదముఖా భవపద్మజాద్యాః
ఆనందజాశ్రుపరిషిక్తకుచాగ్రసీమా
వాగీశ్వరీ చ తమహం శరణం ప్రపద్యే. ౭౩

మ. ప్రకటంబైన విరించిలోకమున నేభవ్యాత్ముదివ్యావతా
రకథల్ కీర్తనజేతురబ్జభవ శర్వాణీశ ముఖ్యామర

ప్రకరంబార్యులునారదామలునుగీర్వాణూమహానందబా
హ్యకథార్ద్రనసయైస్మరించునెపుడాత్మేజేశునేవించెదన్. ౨౩

తా॥ నారదాదిమహామునులు యెవనిచరిత్రంబును బ్రహ్మలోకమునునిరంతరమును గానముచేయుదురో, బ్రహ్మరుద్రాదిదేవతలు నిత్యమును వినుచుందురో సరస్వతిస్మరించుచుండునో యారామచరితంబును రాముడును నాకురక్షకులు. 73

శ్లో॥ జాతిభ్రష్టోపిపాపీపరధనపరదారేషునిత్యోద్యతోవా
స్తేయీబ్రహ్మఘ్నమాతాపితృవధనిరతోయోగిబృందాపకారీ
ధ్యేయంకర్ణామృతంయఃపఠతిహిసతతంరామచంద్రస్యభక్తః
యోగీంద్రైరప్యలభ్యంపదమపిలభతేసర్వదేవైశ్చసేవ్యం. ౨౪

మ. పరభామాపరవిత్తసంగ్రహుఁడువిప్రఘ్నుండుచోరుఁడు దు
స్తరపాపాత్ముఁడుమాతృపితృహుఁడువంశభ్రష్టుడార్యోత్తమో
త్కరనిందాస్పదుడైనచోనియతుడైకర్ణామృతంబు పఠిం
పరహీ యోగులకందరానిపదముం ప్రాప్తించుగాథంబుగాన్. ౨౪

తా॥ జాతినుంచి తరిమివేయబడినవాడు బ్రహ్మహత్యాది పాపంబులను జేసినవాడును పరధనంబును పరభార్యలను దొంగిలించినవాడును చోరుండును బ్రాహ్మణులనుశిశువులను గర్భిణీస్త్రీలను జంపినవాడునుతల్లిదండ్రులను చంపినవాడును యోగులకపకారంబుచేయువాడును రామచంద్రుని చరిత్రమునుపఠించినచో వాడుగొప్పతపశ్శాలురగు యోగులకందరాని రామసాయుజ్యమును పొందును. 74

మ. శివసామ్యుండగునాదిశంకరులుమున్ శ్రీరామకర్ణామృతం
బవనింసంస్కృతమేర్పరించెనది మోక్షాపేక్షచేకూరు వం
శవరాబ్ధిచంద్రుప్రసిద్ధకవినే శ్రద్ధందెనుంగించి రా
ఘవపాదండగనిచ్చినాడగొనుమా కల్పంబుగాసత్కృపన్. ౨౫

మాలిని. వనదనిభశరీరా వర్ణితామర్త్యవారా
కనకశిఖరధీరా కంధిగర్వాపహారా

దనుజఘనసమీరా ధాత్రిజాచిత్తచోరా
మునిజనసువిచారా మోక్షలక్ష్మీవిహారా.

గద్యరూపమగు, మత్తేభవృత్తము.

ఇది శ్రీరామపదారవిందమకరందేచ్ఛాత్మసన్మత్తష
ట్పదవిజ్ఞానపవాబ్జరేణుపటల ప్రాప్తోత్తమాంగోలస
న్మదితాంతఃకరణుండు సిద్ధకవిమాన్యుండై నరామావనీ
శదయాలోకనజెప్పెమూడవగునాశ్వాసంబభీష్టాప్తికిన్.

తృతీయాశ్వాసము సంపూర్ణము.





శ్రీరస్తు.

# శ్రీరామకర్ణామృతము.



## చతుర్థాశ్వాసము.



శ్లో॥ శ్రీరామంజనకాత్మజాకుచతటీ శ్రీగంధపంకోల్లస
ద్వక్షోనిధిముదారమాశ్రితముని ప్రాచుర్యవత్కల్పకం
బ్రహ్మేశానముఖాసురస్తుదనుజం బ్రహ్మాండభాండాధిపం
వందేకోసలకన్యకాసుతమహం వారాశిగర్వాపహం. ౧

శా. శ్రీసీతాకుచకుంభవ్యాప్తలసచ్ఛ్రీచందనాలంకృతున్
కౌసల్యాత్మజు మౌనికల్పము శ్రీకంఠాబ్జభూముఖ్యగో
దానస్తోత్రుసముద్రగర్వహరణున్ బ్రహ్మాండభాండాధిపున్
రాసూమనువితీర్ణజన్మరహితున్ రామప్రభుఙ్గొల్చెదన్. ౧

తా॥ సీతాదేవికుచంబులందలి గంధంబుచే ప్రకాశించు వక్షస్థలంబుకలిగి మునులచే నాశ్రయింపబడుచు బ్రహ్మరుద్రాదులచే పొగడబడుచు సముద్రము గర్వమణచిన కౌసల్యాదేవి పుత్రుడగు రామునికి వందనము. 1

శ్లో॥ సాకేతేమణినిర్మితే ప్రవిలసత్సౌధాయుతానాంశతే
అంతర్గేహమతీతభానునిలయే చంచత్పతాకోజ్జ్వలే
హర్మ్యేభర్మఘృణాం ఘనా ఘుసరవద్ఘట్టాశతైరావృతే
డోలాకల్పిపహారిణం రఘుపతిం సీతాసమేతంభజే. ౨

మ. తత్రప్రత్యగ్రమణీశతాశతాయుతలసత్సౌధప్రయాపోపశో
భితసాకేతమునన్ పతాకయుతమై బెంపొందునంతర్గ్రహా

స్థితచామీకరఘంటికారవయుత శ్రీడోలికాశయ్యపై
ధృతిపుత్రీయుత కేళీజెన్నలగునా శ్రీరామునేవించెదన్. 1

తా॥ అనేకంబులయిన మాణిక్యంబులచే నిర్మించిన మేడలతో నిండిన సాకేతపురంబునందు చలించు జండాలచే ప్రకాశించు నొక దివ్యసౌధంబున ఘణఘణమని ధ్వనిచేయు తూగుటుయ్యెలవయినుండు రామచంద్రుని నేగొల్తును. 2

శ్లో॥ సాకేతేసౌధబద్ధధ్వజశతమహితే రాజమార్గే విశాలే
ఘంటారావైరుపేతే కనకకుధయుగే గంధవాగేవసంతం
విద్యాకల్పోజ్జ్వలాంగం రథగజతురగై రావృతం సుప్రసన్నం
రామం శ్వేతాతపత్రావృతముఖకమలం చింతయామ్యంతరంగే. 3

మ. సరసంబై శతకోటి కేళివనలసత్సౌధాళిసాకేత స
త్స్ఫురితఘంటాపథమార్గమందున మణీభూషాంచితుండైన లం
కరణేభేంద్రము నెక్కినై జతురంగంబుల్ ప్రవేష్టింప వి
స్ఫురితచ్ఛత్ర సముజ్జ్వలుండయిన రాముం గొల్తునాత్మస్థితుం. 3

తా॥ సరసంబయి నూఱంచులుకల మణివికారంబులగు సౌధంబులచే నొప్పు నయోధ్యలో ఘంటాపథమార్గమునందు మాణిక్యభూషణంబుల ధరియించి రథగజతురగవ్రాతులు వెంటనుండ నొకభద్రగజంబు నెక్కి ఛత్రచామరాదులచే సోదరులు సేవచేయుచుండ వెలుగొందు రాముని నేనుసదా భజింతును. 3

మా. సాకేతేమణికోటిభిన్సుఖచితే దివ్యాంబరాలంకృతే
హేమస్తంభసహస్రకోటిఘటితే తారాపథాత్యున్నతే
రమ్యస్వర్ణమయేవిచిత్రభవనే దివ్యాంతరిక్షేముదా
రామంస్మేరముఖాంబుజం రఘుపతిం సీతాసమేతంభజే. ౪

మ. ప్రకటాయోధ్యమనూత్నరత్నమయమై రమ్యంబునై తారకా
నికరాత్యున్నతమైసౌవర్ణమణిసందీప్తాయుత స్తంభ వ

త్స్వరంబై విమలాంబరోజ్జ్వలితమహా చోద్యాలయావాసుడై
నలక త్రుండుదరస్మితాస్యుడగునా త్మేశుసేవించెదన్. ౪

తా॥ నూత్నరత్నమయంబయి రమ్యంబయి నక్షత్రగణంబుల
కంటునంతటి పొడుగయి బంగారమునందు. రత్నములను స్థాపించినస్తం
భంబులచే నిండినదయిన మేడయందు సీతాదేవితోకూడ చిరునవ్వు
మొగంబున వెలయుకాంతించు రాముని సేవింతును. 4

శ్లో॥ సాకేతేమణితోరణాంచితలస ద్వీథీశతప్రాంగణే
సానందంభరతాదిభిస్సహచరై రత్యంతమోదాపరై
క్రీడంతంమణికందుకైః కరగతై రన్యోన్యమత్యుజ్జ్వలైః
పౌరస్త్రీనయనోత్సవైః ప్రతిదినం పూజ్యంభజేరాఘవం. ౫

మ. తతసాకేతపురంబునందు మణిసంతానస్ఫురత్తోరణాం
చితవీథీశతచత్వరంబుదమణి శ్రేష్ఠోజ్జ్వలత్కందుక
స్థితహస్తుండయిసోదరాదియుతుడై స్త్రీచాలనేత్రోత్సరా
ర్చితుండయినిత్యము క్రీడలన్మెలగు నశ్రీరాముసేవించెదన్, ౫

తా॥ అయోధ్యయందు మాణిక్యముతో నిండినతోరణంబులు
గలవీధులందు చేతులందు మణివికారంబులయిన బంతులను బట్టుకొని
సోదరులతోగూడ స్త్రీలుమోహంబున జూచుచుండ నాటలనాడు
రామునిస్మరింతును.

5

శ్లో॥ సాకేతేకనకాద్రిశృంగఘటితేకల్పద్రుమైరావృతే
వైడూర్యాదిమణీంద్రకాంతిలతితే దేవేంద్రనీలోజ్జ్వలే
కుత్వంతంమణినాయకం మణిగృహే మాణిక్యపీఠేభజే
పుత్రౌమన్మథసుందరాకుశలవౌ సంసేవమానాదిమహా. ౬

మ. ప్రకటాయోధ్యసుమేరుశృంగనిభమైభవ్యామరానోకహ
ప్రకరప్రావృతమైమణిస్థగితమైరంజిల్లుసద్మంబునం

దకలంకంబగురత్నపీఠినుమశస్త్రికారులై నట్టివు
త్రకయుగ్మార్చితపాదపద్ముడగు శ్రీరామాధీపుగొల్చెదన్.

తా॥ సాకేతనగరంబున మేరుపర్వతముయొక్క శిఖరంబులతో సమమయి యనేకములయిన మందారాదివృక్షములతో నిండి ప్రకాశించుగృహంబున రత్నపీఠంబునందు మన్మథావతారంబులగు కుశలవులను యిద్దరకుమారులచే సేవింపబడుచునుండు రాముని గొలిచెదను. 6

మూ. సాకేతేపనసీకరార్చితలసత్కస్తూరికాసుందరే
మాత్తికజాలకంశశినిభే స్వర్ణాంకితింవర్తులం
చూడాలంబమనోజ్ఞహారకలితం బిభ్రాణమత్యుజ్జ్వలం
రామంకోసలపుత్రికావరయుతం సీతాసమేతంభజే. ౭

మ. నుదుటన్ కస్తురిబొట్టుతల్లియును సన్ముక్తాలలామంబుప
ర్వదినె దూజ్జ్వలమైనువర్ణమయమైరంజిల్లసాకేత స
త్సదనుండై రమణీయహారధృతుడై స్వస్థానుడై భక్తలో
కదయాళుండగుకౌసలేయుగొలుతున్ లక్ష్మీశురామప్రభున్. ౭

తా॥ తల్లినుదుట కస్తూరిబొట్టుగావెట్టి మెడలోహారంబులను వేసి ముద్దిడిపంపగా చంద్రునివలె ప్రకాశింపుచు సాకేతనగరవీథులందు షికారుచేయు రామునిభజింతును. 7

మూ. సాకేతేసరయూజలేతివిమలే ప్రోత్ఫుల్లపద్మాంకితే
దివ్యశ్రీశతకోటినృత్యరుచిరే స్వర్గాపగాసుందరే
పశ్యంతీషుసురాంగనాసుశపథం క్రీడంతముర్వీసుతాం
బాహుభ్యాంవిమలోదకేనరుచిరం సీతాసమేతంభజే. ౮

మ. అనులంబై కవిచాజ్జమైదివిజకన్యాజాలలీలార్హమై
యమరద్వీపవతీసమానసరయూప్రోదిన్సురస్త్రీసమూ

హాములుంగాంచసభార్యుఁడై కరములం దంభోవిహారంబు చి
త్తమురంజిల్లగ జేయు రాఘవున యోధ్యానాథు సేవించెదన్. ౭

తా॥ అయోధ్యలో పద్మములచే సుందరమయి గంగానదివలె సుందరమయిన నదీజలంబునందు సీతతో కూడినవాడయి దేవతలుచూచుచుండ జలకేళిందేలు రాముని సేవింతును. ౮

మా. కదాసురతరుస్థలేకనకమంటపేపుష్పగే
వరాసనముపేయుషం వసుదళారవిందోజ్జ్వలే
కరేణహృదయస్యకృశాకలితముద్రచిన్ముద్రికా
మమస్ఫురతువాసనామనసిద్ధవీసనా.

మ. ఒకకాలంబునకల్పశాఖికడ జెన్నొప్పారుసౌవర్ణర
త్నకనన్మందిరమధ్య హేమదళపద్మభ్రాజితంబైన పు
ష్పకమధ్యంబునరత్నపీఠనిజవక్షస్న్యహస్తుండు తా
రకచిన్ముద్రకరాంబుజుండువిబుధారాధ్యుండుపీరాననుం
డకలంకుండగు రామచంద్రుండుమదీయాత్మస్థలిన్ భాసిలున్. ౯

తా॥ ఒకకాలంబునందు కల్పశాఖికడ సువర్ణరత్నపీఠంబున బంగారుపద్మదళ మధ్యంబున పుష్పకమునందు సింహపీఠంబున హస్తంబునుంచుకొని దేవతలచే నారాధింపబడువాడగు రాముని స్మరింతును. 9

శ్లో॥ నదీరమణబంధనంబుబిరుతాముదారంధనం
జకద్విహితరంధనం సకలకామనిష్యందనం
విలిప్తహరిచందనం వినుతయాతసంక్రందనం
భజామి రఘునందనం పవననందనస్యందనం॥ ౧౦

ఉ. చందనచర్చితుండు రఘునత్తము డంబుధిబంధనుండుసం
క్రందనవందితుండు పవిత్రరాజయుదారధనుండు సంతతా
నందుఁడుగంధవాహనప్రియనందనవాహనుడిష్టదాయిపో
రందరనీలకర్ణుడగు రామపదాబ్జము లాశ్రయించెదన్. ౧౦

తా॥ సముద్రమును బంధించినవాఁడును దేవేంద్రునకు వందనీయుండును హరిచందనము బూసికొనినవాఁడును జగంబులకు మేలుచేయువాఁడును హనుమంతునిపై నెక్కి విహరించువాఁడును నగు రాముని భజింతును. 10

శ్లో॥ రక్తాంభోరుహలోచనంకువలయశ్యామంకపోలంధనుః
కోటిన్యస్తకరాంబుజంధృతతనుత్రాణంజటామండితం
జేతారంఖరభూషణత్రిశిర సామాబంధగోధాంగుళీ
త్రాణంమార్గణపూర్ణతూణయుగలంకోదండరామంభజే. ౧౧

మ. శరసంపూర్ణనిషంగియుగ్మకవచియై శ్యామాంగుఁడై విశ్వప్ర
ద్గురుఁడై శోణసరోజనేత్రయుతుఁడై గోధాంగుళిత్రాణుఁడై
ఖరముఖ్యాసురయూథసంహరణుఁడై కాండాసనాగ్రస్ఫుర
ద్గురుహస్తుండగునాజలుం గొలిచెదన్ కోదండరామప్రభున్. ౧౧

తా॥ ఎఱ్ఱతామరలవంటి నేత్రంబులును నల్లకలువలవలె నల్లని శరీరంబును ధనస్సునందు బాణములను ధరించినవాఁడును కవచంబు ధరించి బ్రహ్మకు గురుఁడు ఖరుఁడు మొదలగు రాక్షసులను హరించిన కోదండరామ ప్రభుని సదా స్మరింతును. 11

శ్లో॥ శ్రీమత్కల్పద్రుమూలేసకలమణిమయే మండపేపుష్పకాఖ్యే
తన్మధ్యేసూర్యబింబద్యుతిసరసిరుహేశోభమానాష్టపత్రే
పశ్యన్నిష్టాగజనకతనయాం వామభాగోపసేవ్యాం
సౌమిత్రింభానుపుత్రం పవనసుతయుతం పాతుమాంరామచంద్రః

చ. సురతరుమూలనూత్నమణిశోభితమంటపమధ్యపుష్పకాం
తరరవిదీపితాష్టదళతామరసాంతర భాసియైధగా
వరసుతవామభాగమున భాసితలక్ష్మణవాయుజాది స
త్పురుషసమర్చితుఁడై నభూపతిరాముఁడు నన్ను బ్రోవుతన్. ౧౨

తా॥ సురతరు మూలంబున మణిశోభితమంటపము మధ్య

ష్పకాంతరమున నష్టతామరదళమధ్యమున సీతవామభాగమున నుండ
లక్ష్మణహనుమదాదులచే సేవింపబడు రాముని నుతింతును. 12

శ్లో॥ వినీలజలదోపమంవిమలచంద్రబింబాననం
వినిద్రమణికుండలంవికచపుండరీకేక్షణం
విభిన్నదనుజాధిపంవిధృతబాణబాణాసనం
విభీషణవరప్రదంవిజయరామమీడేనిశం. ౧౩

మ. హరినీలాంబుదగాత్రుదామరసపత్రాక్షున్ శరచ్చంద్రభా
సురవక్త్రున్మణికుండలాంచితధనుస్తూణీరబాణోజ్జ్వలు
న్సురవిద్వేషణపోషణాంతకమునిస్తుత్యున్ దశగ్రీవసో
దరసన్మోదవిధాయకున్వరదుసీతారాము జింతించెదన్. ౧౩

తా॥ నల్లనిశరీరంబును తామరసనేత్రంబులును శరత్కాలచం
ద్రునివంటిమొగంబును మణివికారకుండలంబులను బాణంబులను ధను
వును ధరించి రావణునిసంహరించిన రామునిసదాస్మరింతును. 13

మా. రాజద్రాజీవనేత్రం రఘుకులతిలకం రంజితాశేషలోకం
వామాంకాలోకసీతం వరకరధనుషం కుండలోద్దీప్తగండం
శ్యామంశాంతంప్రసన్నందరహసితముఖం వజ్రసింహాసనం
రామరాజత్కిరీటంరవిశదవిశదం రాజరాజైకమీడే. ౧౪

చ. సరసిజనేత్రుచాపధరు శాంతుప్రసన్ను దరస్మితాస్యభా
స్కరకరులోకరంజితుబ్రకాశకిరీటుసువర్ణకుండలున్
ధరణిసుతావలోకనుపతంగశతోజ్జ్వలువజ్రపీఠకం
ధరనిభనీలురాజవరుదాశరథిన్ శరణంబువేడెదన్. ౧౪

తా॥ సరసిజనేత్రుండును చిఱునవ్వు మొగంబున వెలయువాడు
ను భాస్కరలోకరంజితుండును సువర్ణకుండలుండును వజ్రపీఠుండును
నగు రాముని నుతింతును. 14

శ్లో॥ భద్రవ్యాఖ్యానముద్రాంకరసరసిరుహే దక్షిణేధారయంతం
సవ్యేజానున్యుదారంకరమవిచముదా ధారయంతంస్ఫురతం

పశ్యంతేవామభాగే కరధృతకమలం చిత్రభూషావశేషాం
వైదేహీంకాంచనాఢ్యాం స్తనభరనమితాం భావయేరామచంద్ర.

మ. ఒకహస్తాబ్జముజానువందునిచి వేరొక్కటవ్యాఖ్యానము
ద్రకరంబూనిసువర్ణవర్ణధృతపద్మన్ చిత్రభూషాన్వితున్
ప్రకటోత్స్థలజాతినమ్రయగుభార్యన్ దాపలంగాంచు తా
రకనాముక్ రవికోటిధాముడగు శ్రీరామున్ బ్రశంసించెదన్. ౧౫

తా॥ ఒకచేయి మోకాలియందుంచి వేరొకచోట వ్యాఖ్యాన ముద్రను ధరించి సువర్ణవర్ణ పద్మంబున చిత్రభూషములతో కూడి వినయవంతురాలగు భార్య దాపటనుండ రవికోటిధాముండగు శ్రీరామచంద్రప్రభుని కొనియాడుదును. 15

మూ. విబుధవిటపిమూలే జానకీలక్ష్మణాభ్యాం
సహిత మనిలవేగం బాణమాదాయచాపం
బహుళశరపటుతూణం రమ్యపుష్పోపహారం
విబుధభరణచిత్తం చింతయేరామచంద్రం. ౧౬

మ. అమరాంగస్థలధారుణి సుతసుమిత్రాపత్యసంయుక్తుడయి
సుమదామాంచితుడై యనేకశరసంశోభానిషంగాస్యుడై
యమరత్రాణధురీణుడై పవనవేగా జివ్వాగ్రాస్త్రిస్తుడై
కమనీయాకృతియైన రామధరణీకాంతున్ మదిన్ గొల్చెదన్. ౧౬

తా॥ కల్పవృక్షమూలంబున జానకీలక్ష్మణులతో గూడ వాయువేగమువంటి వేగముకల బాణమును ధనువునధరించి రమ్యపుష్పవనవిహారంబు సేయుచు నుండురఘురాముని సదానుతింతును. 16

మూ. జానాతిరామతవతత్వగతిం హనూమాన్
జానాతిరామతవసఖ్యగతింకపీశః
జానాతిరామతవయుద్ధగతిందశాస్యో
జానాతిరామధనదానుజ ఏవసత్యం. ౧౭

ఉ. తావకమిత్రభావనలు తామసా ప్తసుతుండెఱుఁగుమీ
పావనతత్వలక్షణము పావకమిత్రసుతుండెరుంగుధా
త్రీవరనీదుసంగరగతిందశకంఠు డెరుంగు భక్తిలో
తావననీదుసత్యముదశాస్యునితమ్ముడెరుంగురాఘవా. ౧౭

తా॥ ఓరామా ! నీతత్వమార్గంబును హనుమంతుడెఱుంగును. నీపావనతత్వలక్షణమును సుగ్రీవుండెఱుంగును. నీయుద్ధతత్వంబును రావణుండెరుంగును. నీసత్యతత్వంబును విభీషణుండెఱుంగును. 17

శ్లో. హేరామ హేరమణ హేజగదేకవీర
హేనాథ హేరఘుపతేకరుణాలవాల
హేజానకీరమణ హేజగదేకబంధో
మాంపాహిదీనమనిశం కృపణంకృతఘ్నం. ౧౮

శా. ఓరామాజగదేకవీరరమణా యోజానకీనాయకా
యోరాజేంద్రకృపాలవరదా యోవిశ్వవిశ్వవనా
యోరాజీవదళేక్షయోరఘుపతే యోనాథమన్నింపునా
నేరంబేమకృతఘ్నుడ న్కృపణుడ న్నిన్నేమదిన్నమ్మితిన్. ౧౮

తా॥ ఓరామా ! జగదేకశూరుడా ! జగదేకబంధుడా ! దయాసముద్రుడా ! జానకీరమణా ! నన్నునీవేరక్షింపుము. 18

శ్లో. అయోధ్యానాథరాజేంద్ర సీతాకాంతజగత్పతే
శ్రీరామపుండరీకాక్ష రామచంద్రనమోస్తుతే. ౧౮

మ. స్థిరసాకేతపురాధినాథునకు ధాత్రీపుత్రికాభర్తకున్
ధరణీశేంద్రునకున్ జగత్పతికిదైత్యధ్వంసికిన్ నవ్యవి
స్ఫురితాంభోరుహ పత్రనేత్రునకుఁ దేజోరాశికిన్పావని
స్తుతికిన్శ్రీరఘురామచన్ద్రునకునశ్రాంతంబునేమ్రొక్కెదన్. ౧౯

తా॥ అయోధ్యాపతియు రాజేంద్రుండును సీతనాథుండును జగత్పతియును పుండరీకాక్షుండును రామచంద్రఖ్యాతినొందినవాడును నగు రాముని నుతింతును.

19

మూ. దక్షిణేలక్ష్మణోయస్యవామతో జానకీశుభా
పురతో మారుతిర్యస్యతం నమామిరఘూత్తమం. ౨౦

ఉ. దాపటజానకీపతిముదంబుననుండగరక్షణంబునం
జాపముదాల్చిలక్ష్మణుడుసన్నుతిజేయపురోపకంఠమున
దాపవనాత్మజుండు వినయంబున గొల్వజెలంగునట్టిధా
త్రీపరిపాలశీలునకు శ్రీరఘురామునకేను మ్రొక్కెదన్. ౨౦

తా॥ ఎడమవైపునసంతోషంబునసీతయు కుడివైపున ధనువును ధరించి లక్ష్మణుండును ముందుభాగమున నమస్కారముచేయుచు హనుమంతుడును వినయంబున గొల్వనుండురఘురామునకు నదానమస్కరింతును. 20

మూ. రామంరాక్షసమర్దనంరఘుపతిం శక్రారివిధ్వంసినం
సుగ్రీవేప్సితరాజ్యదంసురపతేః పుత్రాంతకంశార్ఙ్గిణం
భక్తానామభయప్రదంభయహరం పాపౌఘవిధ్వంసినం
సీతాసేవితపాదపద్మయుగళం రామంభజేశ్యామలం. ౨౧

శా. రాముణ్ రాక్షసమదర్ఘుపతిన్ రాజేంద్రుపాపాపహున్
శ్యామాంగున్ రవిజేప్సితున్ వరదుభక్తార్తిఘ్ను శార్ఙ్గిపరం
ధాముణ్ వాలివిమర్దనున్ ధరణిజాతాసేవితాంఘ్రిద్వయున్
శ్రీమంతున్ భయసంహరున్ గొలిచెదన్ శ్రీరామచంద్రప్రభున్.

తా॥. రాక్షసమర్దనుండును యింద్రశత్రుసంహారియు సుగ్రీవుని యిష్టప్రకారము రాజ్యమొసంగినవాడును వాలినిజంపినవాడును భక్తులభయమొసంగువాడును భయంబును బోగొట్టువాడునునగు రామచంద్రప్రభునిసదావినుతింతును. 21

మూ. భవభయహరమేకం భానుకోటిప్రకాశం
కరధృతశరచాపం కాలమేఘావభాసం
కనకరుచిరవస్త్రం రత్నవత్కుండలాఢ్యం
కమలవిశదనేత్రం సానుజంరామమీడే. ౨౨

చ. భవభయమోచనుఁ వికచపంకజలోచను కాంచనాంబరుఁ
రవిశతకోటితుల్యమణి రంజితకుండలకర్ణయుగ్ము రా
జపరలలాముహస్తధృతచాప శిలీముఖుకాలమేఘభా
శివిమలుసానుజున్ వరదు శ్రీరఘు రాముసమాశ్రయించెదఁ.

తా॥ భవభయహరుండును వికసించినపద్మములవంటి నేత్రం బులుకలవాఁడును సూర్యకోటిప్రకాశమానుండును బంగారుకుండలము ధరించినవాఁడును తమ్ములతోఁగూడి యుత్సాహవంతుఁడయి యుండువాఁడునునగురామప్రభుని స్మరింతును. 22

మూ. రామంశ్యామపయోదనీలమమలం రాజీవనేత్రంసదా
హల్యాశాపనివారణప్రణయ పాదాంభోజముర్వీశ్వరం
విద్యుత్కోటిసహస్రదీధితిల సత్కోటీరముస్తోజ్వలం
ధ్యాయేత్తారకనామమీశ్వర సంఖండైతేయవంశాపహం. ౨౩

మ. మునికాంతాగతశాపమోచన పదాంభోజాతు ప్రావృడ్ఘనా
ఘనగాత్రున్ వికచాబ్జనేత్రుగిరిజా కాంతాపుద్దైత్యారిసా
వనవిద్యుచ్ఛతకోటిదీప్తమకుట భ్రాజోత్తమాంగున్ జనా
ర్దనునిన్ తారకనాము రాముని మతిన్ ధ్యానింతున శ్రాంతముఁ. ౨౩

తా॥ రాజీవనేత్రుండును నీలమేఘశ్యాముండును అహల్యాశాపవిమోచనుండును భక్తులకు వరంబులనొసంగువాఁడును తారకప్రసిద్ధనాముండునునగు రామచంద్రునిధ్యానింతును. 23

మూ. దశరథసుతమీశందండకారణ్యవాసం
శతమఖమణినీలం జానకీ ప్రాణలోలం
సకలభువనమోహం సన్నుతాంభోదదేహం
బహుళనుతసముద్రంభావయే రామభద్రం. ౨౪

చ. శతమఖరత్ననీలఘన సన్నిభగాత్రుని దండకాటవి
స్థితుజనకాత్మజాధిపునధీపతి సన్నుతవిశ్వమోహనున్.

క్షితిపతినీశ్వరేశ్వరుని చిన్మయుదాశరథిన్ దయానిధిన్
వితతచరిత్రుసత్యురఘువీరుపదాబ్జము లాశ్రయించెదన్. ౨౪

తా॥ యింద్రనీలమాణిక్యములకు సమానమైన దేహముండును దండకారణ్యనివాసియు జానకీప్రాణనాథుండును సమస్తభువనంబులను సంతోషపెట్టువాడునునగు రాముని సదాస్మరింతును. 24

మూ. సరయూతీరవనేలతానివసనే సద్రత్నవేదీతలే
సునుపర్యంకతలేవిదేహతనయాహ్యర్ధంపరిక్రీడతా
సూరీఘనసారచందనమిళద్గట ధోల్లసత్పావనీ
పాయాన్మాం త్రిరసాన్మయూరఘుపతేర్భద్రాత్మికానోనిశం. ౨౫

మ. సరయూతీరవనిన్ లతాగృహమునన్ సద్రత్నవేదిస్థలిన్
విరిశయ్యన్ జనకాత్మజాసహితుఁడై వేడ్కన్ లకచ్ఛందక
స్తురిసంయుక్తసుగంధలేపమునన్ శోభిల్లిక్రీడించు నుం
దరసన్మూర్తియనామయుండు రఘునాథస్వామినన్ బ్రోవుతన్. ౨౫

తా॥ సరయూతీరవనంబున లతాగృహంబున రత్నంబులతోకట్టినవేదికపయిని పూలపాన్పుమీద సీతతోకూడికస్తూరికలపినమంచి గంధమునొంటినిండనలదికొని క్రీడించుసుందరస్వరూపుండగు శ్రీరామమూర్తి నన్నురక్షించును. 25

మూ. వైదేహీప్రియవల్లభంవిజయినం వాతాత్మజాధీశ్వరం
వాణీవారధివానరాధివినుతం నందారుమందారకం
విశ్వామిత్రవశిష్టవాసవశివా వాగీశశ్వన్నుతం
దేవేశంవినతాత్మజాభివినుతం వందేసదా రాఘవం. ౨౬

మ. ధరణిజాప్రియవల్లభున్ జయకరున్ దాసామరానోకహున్
గరుడాంభోధిసరస్వతీప్లవగ సంఘస్తోత్రు బ్రహ్మేశని
ర్జరనాథాత్రివసిష్టగార్గ్యముని విశ్వామిత్రసంసేవితున్
వరదున్ రాఘవువాయుపుత్రవిభుగీర్వాణేశ్వరున్ గొల్చెదన్. ౨౬

తా॥ సదా జయశీలుండు సీతకు బ్రియుండును హనుమంతునిచే గొలువబడువాడును గరుత్మంతునిచే సముద్రునిచే సరస్వతిచే కపికోటులచే స్తోత్రంబు చేయబడువాడును వసిష్టాత్రిగార్గ్యుండు మొదలగు మునులచే సేవింపబడువాడు నగు రాముని గొల్తును. 26

శ్లో. విశాలనేత్రం పరిపూర్ణగాత్రం
సీతాకళత్రం సురవైరిజైత్రం
జగత్పవిత్రం పరమాత్మతంత్రం
శ్రీరామచంద్రం ప్రణమామిచిత్తే. ౨౭

చ. వికసితపుండరీకదళవిస్తృతనేత్రు జగత్పవిత్రు సే
వకనుతితిపాత్రు నీలఘనగాత్రు సురారిజైత్రు సదా
రకు బరమాత్మతంత్రు రఘురాము ధరాధిపతిన్ విదేహభూ
పకలనయాకళత్రు నదపంకజసేవయొనర్చు చిత్తమా. ౨౭

తా॥ విశాలమైననేత్రంబులును పరిపూర్ణగాత్రంబును గలిగి సీత భార్యగా నొప్పి రాక్షసవంశనాశంకరుండై జగజత్పవిత్రుండయి పరమాత్మరూపుండయిన రామచంద్రునకు వందనమిడెదను. 27

శ్లో. సౌమిత్రిమానార్ణవపూర్ణచంద్ర
సీతాలసల్లోచనపూర్ణచంద్ర
సురారివక్త్రాంబుజపూర్ణచంద్ర
సంరక్ష మాం రాఘవరామచంద్ర. ౨౮

చ. ధరణికుమారునేత్రకుముదప్రమదప్రదపూర్ణచంద్రుడా
సురవిసరాననాంబురుహసోముడు లక్ష్మణభవ్యమానసా
గరిపరిపూర్ణచంద్రుడు జగత్పరిపూరితకీర్తిసాంద్రుడం
బరమణివంశచంద్రుడసమానుడు రామనుడు రాముడు నన్ను బ్రోవుతన్.

తా॥ సీతాదేవినేత్రంబులకును లక్ష్మణునిమానసమను సముద్రమునకును దేవేంద్రునిముఖపద్మంబునకును చంద్రునివంటివాడవయిన శ్రీరామచంద్రా! నన్ను నీవే యెల్లవేళల రక్షించుచుండుము. 28

శ్లో॥ యస్యకించిదపినోహారిణీయం
చర్మకించిదపినోచరణీయం
రామనామచసదాస్మరణీయం
లీలయాభవజలంతరణీయం. ౨౯

ఉ. ధారుణినేమహాత్ము నవతారనుకర్మలుబోరిడంగరా
దేరికివన్యకర్మములనించుకసేయుటపాడిగాదు దు
ర్వారధురంతపాపజలరాశితరింపగహేతువై నయా
శ్రీరఘునామమున్స్మరించదగున్ పరమాత్మసిద్ధికిన్. ౨౯

తా॥ భూమియందేమహాత్ముని దశావతారంబులందలి కర్మలు
ను యితరులకునాచరింపసాధ్యము కానివియో యెవని నన్యకర్మంబులిం
చుకయునితరులు చేయలేనివియో యామహాత్ముడగు రామచంద్రుని
నామంబుస్మరించినంతమాత్రముననే సంసారసముద్రము దాటిజన్మలే
నివాడగును. 29

శ్లో॥ రంగమాణమభితోగృహాంగణే
భృంగనీలమలకావృతాననం
మంగళప్రదమమంగళాపహం
సృంగృణేదశరథాత్మజంహృది. ౩౦

చ. అళినముదాయనీలచికురావృతవక్త్రసరోజుడై సము
జ్జ్వలభవనాంగణప్రకటసంతతోసంచరణాఢ్యుడై యమం
గళపరిహారుడై లలితకాంచనభూషణభూషితాంగుడై
యలరినరాఘవున్ దశరథాత్మజ చిత్తమునందునిల్చెదన్. ౩౦

తా॥ తుమ్మెదగుంపురీతి నల్లనగుముంగురులతో వ్యాప్తమగు
మొగంబుతో గృహాంగణమందు సదాచరించుచు నమంగళంబులపోగొ
ట్టుచు శుభంబులనువృద్ధిచేయుచు బంగారునగలచే నలంకరింపబడినవా
డయియుండు రాముని నాచిత్తమున తలంతును. 30

శ్లో॥ పీతాంబరాలంకృతమధ్యకాయ
పితామహేంద్రామర వందితాయ
పిత్రేస్వభక్తస్య జనన్యమాత్రే
నమోస్తురామాయసలక్ష్మణాయ. ౩౧

మ. అరవిందాసనశైలనిర్దళనముఖ్యాదిత్యపూజాంఘ్రిపం
కరుహద్వంద్వునకుఁ లక్ష్మణునకున్ క్ష్మాభర్తకున్ గాంచనాం
బరసందీప్తకటిప్రదేశునకురామస్వామికిఁ సేవకో
త్తరమాతాపితృసన్నిభాత్మునకుసద్భక్తిఁ వెసన్మొక్కెదన్. ౩౧

తా. బ్రహ్మేంద్రాది దేవతలచే పొగడబడువాడును పీతాంబరమును ధరించినవాడును తనభక్తులను తల్లిదండ్రులట్లుచూచువాడును నగు రామునకును లక్ష్మణునకును వందనము లిచ్చుచున్నాను. 31

శ్లో॥ నమోనమస్తేఖిలపూజితాయ
నమోనమస్తేందునిభాననాయ
నమోనమస్తేరఘువంశజాయ
నమోస్తురామాయసలక్ష్మణాయ. ౩౨

చ. సకలజగజ్జనార్చితలసత్పదపద్మునకుఁ పయోరుహా
ప్తకులసముద్రచందునకుపంకజనేత్రునకున్ ధరాధినా
యకునకులక్ష్మణాన్వితున కాన్త్యతిరస్కృతపద్మవైరికిన్
ప్రకటయశోవిశాలునకు రామునకేను నమస్కరించెదన్. 32

తా॥ సమస్తజనంబులు నమస్కరింపదగిన పాదపద్మంబులును చంద్రబింబమువంటి మొగంబును కలిగి రఘువంశము నుద్ధరించుటకా వంశమున లక్ష్మణునితోగూడ జనించినరామునకు వేయివందనములు.

శ్లో॥ ఇమానిరత్నానిత్రిసంధ్యం యఃపఠేన్నరః
సర్వపాపవినిర్ముక్తస్సయాతిపరమాంగతిం॥

చ. అనుదినముం త్రికాలముంయందతిభక్తినిపంచరత్నము
లనులుపఠించినం దురితజాలవిమోచనులై యిహంబునం

దనయము సౌఖ్య సంపదల నంది ముదంబును జెందియంతమం
దనుపమ మోక్షమున్ కరతలామలకంబుగ గాంతురెంతయున్. 33

తా॥ ఉదయ మధ్యాహ్న సాయంకాలములందు శ్రీరామచంద్రుని దివ్యచరిత్రమును పఠించిన మానవులు సమస్తపాపంబులనుండి విముక్తులై యంతమున రామునిసాన్నిధ్యమున కేగుదురు. 33

శ్లో॥ శ్రీరామకల్పవృక్షోమేని రామస్సకరాపదః
అభిరామస్త్రిలోకానాం రామః క్షేమంకరోతునః. 34

చ. సరసిజమిత్రధాముండు నిశాచరభీముండు రాఘవుండు స
ద్వరభువనాభిరాముండు సుపర్వమహీరుహమే దదీయదు
స్తరవినదోత్కరంబుల హతంబొనరించి నిరంతరంబును
స్థిరతరసౌఖ్యసంపదలు క్షేమ మొనర్చి కృతార్థు జేయుతన్. 34

తా॥ రాక్షసులపాలిటికి భీముండును సూర్యుడు లోచనంబుగా గలవాడును లోకంబులందు నభిరాముండును నగు శ్రీరాముండను కల్పవృక్షము నా సమస్తపాపంబులను హరించి నాకు క్షేమము చేయుగాక.

శ్లో॥ హృదయసదయచిత్తం నుత్తనాథం గుణానా
ముదధిముదిత నిమ్నం నిమ్నగాలంకృతాంఘ్రిం
జనకపతితనూజాస్వాంత కాంతోత్పలస్య
స్ఫురణకరణచంద్రం రామచంద్రం భజేహం. 35

చ. క్ష్మారమణీసుతాహృదయకైరవమిత్రు భవ్యబృం
దారకవాహినీజనననవ్యపదాంబుచి త్తనాథుగం
భీరగుణామృతోదధి యమేయగుణాకరు భక్తవత్సలున్
శ్రీరఘురామభూభుజు భజింతు నిరంతర మిష్టసిద్ధికిన్. 35

తా॥ సీతహృదయంబను కలువకు చంద్రునివంటివాడును గంగాదేవి తనపాదంబునందు పుట్టుటచేత భవ్యుండును గంభీరగుణుండును భక్తవత్సలుండును నమేయగుణుండును నగు రామచంద్రుని భజింతును.

శ్లో॥ వదతువదతువాణి రామమేతినిత్యం
జపతుజపతునిత్యం రామపాదారవిందం
వదతువదతుదేహం చింతయేద్రామచంద్రం
నభవతుమమపాపంజన్మజన్మాంతరేషు. 3౬

చ. సతతమురామరామయని సంస్మరియింపుచునుండుగాక సం
తతమునురామపాదనలినద్వయమున్ దపియించుగాక స
మ్మతిరఘురామచింతనము మానకొవర్పునుకాకమద్వచ
ప్రతిలిటులైనజన్మపాపసమాజమునన్నుబొందునే. 3౬

తా॥ నావాక్యము లెప్పుడును రామరామయనియే యనుచుండుగాక! నేనెల్లప్పుడును రామనామమునే జపింతుగాక! నాదేహమెప్పుడును రామచంద్రునిసేవకే వినియోగింతునుగాక! అట్లుచేసిననాపాపంబులన్నియు హరించి నేను పవిత్రుండనగుదును. 36

శ్లో॥ చాపబాణధరస్సీతాకామదః కాంతిమాన్నదరః
సీతాలక్ష్మణసంయుక్తః పాతుమాంరాఘవేశ్వరః. 3౭

మ. జనకాపత్య మనోరథ ప్రదుండు భాస్వన్మర్త్యసద్విగ్రహుం
డనగుండస్త్రశరాసనాంచిత మహాహస్తుండు సౌమిత్రిభూ
శశిసంకాశిత పార్శ్వభాగుమమహీజాని సమారాధ్యస
ద్వనజద్వంద్వుండురామభూధవుఁడు నిత్యంబున్ననుంబ్రోవుతన్. 3౭

తా॥ సీతామనోహరుండును ధనుర్బాణంబుల ధరించినవాఁడును కాంతివంతుఁడును జగంబుల తాపంబునుబాప మనుష్యరూపమును ధరించినవాఁడును సీతాలక్ష్మణులతోఁకూడిన వాఁడును నగు రాముఁడు నన్ను మన్నించుగాక. 37

శ్లో॥ ప్రాతస్స్మరామి రఘునాథముఖారవింద
మందస్మితంమధురభాషితవిశాలఫాలం

కర్ణావలంబిచలకుండలగండభాగం
కర్ణాంతదీర్ఘనయనం నయనాభిరామమ్. ౩౭

ఉ. సుందరమందహాసపరశోభితమై మధురోక్తియుముక్తమై
కుందనసన్మణీఘటితకుండలమండితమై విశాలకా
ద్రేందునిభాళికంబై రహింతతనేత్రయుగాభిరామమే
యందముగుల్కు రామువదనాబ్జముకల్యమునన్ స్మరించెదన్. ౩౮

తా॥ మధురముగా మాటలాడువాడును విశాలమగు నుదురుండువాడును చెవులవఱకు వ్యాపించిన కుండలంబులును దీర్ఘనేత్రంబులునుకలిగి మనోహరుండైన రాముని ప్రాతఃకాలమున స్మరింతును.

శ్లో॥ ప్రాతర్భజామిరఘునాథపదారవిందం
రక్షోగణాయభయదం వరదంనిజేభ్యః
యద్రాజసంసదివిభిద్యమహేశచాపం
సీతాకరగ్రహణమంగళమాపసద్యః ౩౯

చ. జనకసభాస్థలిన్ భవునిచాపముఖండన మాచరించియా
జనకసుతాకరగ్రహణసౌఖ్యత తత్క్షణమొందినట్టి న
జ్జనవరదున్ నిశాటగణసాధ్యసదున్ రఘుచంద్రు పా
వనచరణారవిందములు భక్తిభజింతునహర్ముఖంబునన్. ౩౯

తా॥ జనకుని సభామండపమున శివునిధనువునువిఱచి సీతనుపెండ్లాడినవాడును భక్తులకు వరంబులనొసంగువాడును రాక్షసనాశంకరుండునునగు రామునిపాదపద్మంబులను ప్రాతఃకాలమున స్మరింతును. ౩౯

శ్లో॥ ప్రాతర్నమామిరఘునాథపదారవిందం
పద్మాంకుశాదిశుభరేఖశుభావహం మే
యోగీంద్రమానస మధువ్రతసేవ్యమానం
శాపాపహంసపదిగౌతమధర్మపత్న్యాః. ౪౦

మ. అరవిందాంకుశశంఖముఖ్య శుభరేఖాలంకృతంబుల్మనో
హరముల్యోగిమనోమధుప్రతతి సేవ్యంబుల్ యహల్యాసతీ
దురితాంతోపలరూపశాపపలనిర్ధూతప్రభావప్రభా
కరమౌరామపదాంబుజద్వయియమః కాలంబునన్ మ్రొక్కెదన్.

తా॥ పద్మముశంఖము మొదలగు శుభకరములయిన రేఖలు కలిగి యహల్యను పవిత్రముచేసి యోగులహృదయంబులందు నిరంతరముదాగియుండురామునిపాదద్వయంబును ప్రాతఃకాలముననేస్మరింతును.

శ్లో॥ సజానన్ జానకీజానే రామేతత్వమపిప్రభా
ధీఃకుర్యాద్యమదూతాన్ మోనరన్తత్వమీహతే. ౪౧

చ. ధరణిసుతాధినాథుడగుదాశరథిన్ రఘురాముచిత్తమం
దెరుగకయున్న నయ్యినకులేశ్వరుతత్వమునందుకాంక్షను
స్థిరమతిగల్గువారలు ప్రసిద్ధముగాయమదూతలన్ తిర
స్కరణముజేతురట్టి త్రిజగత్ప్రభు నెంచిభజింతునిత్యమున్. ౪౧

తా॥ సీతాదేవిభర్తయగు రాముని చిత్తమందుస్మరింపక పోయి, నను నా రామభూవిభునితత్వమునందు కాంక్షగలుగువారలు యమదూతలకు తిరస్కరించి విష్ణులోకంబునకేగుదురు. 41

శ్లో॥ రామోమేహృదిసన్నిధింరమయతాం రామంభజేదుష్కృతం
రామేణాపహృపంనమోభగవతే రామాయరామాత్సుభం
లక్ష్యేశ్రీరఘునందనస్యసుకృతేరార్ధాసోస్మ్యహంసర్వదా
నిత్యంకోపలకన్యకాప్రియనుతే రామేమనోవర్తతాం. ౪౨

ఉ. రాముడునిల్చుహృత్కమలిని రామునహర్నిశమున్భజింతు, శ్రీ
రామునిచేనఘంబణగు రామునికై నతులేనొనర్తు, శ్రీ
రామునివల్లభద్రము చెరామునకున్పరిచర్యజేసెదన్
రామునియందువామదినిరంతర మేమనకన్ ప్రవర్తిలున్. ౪౨

తా॥ రాముడునాహృదయంబున నుండుగాక. రాముని నేభజింతును. నాహృదయము రామునిచేహరింప బడినది. రామునికొఱకువందనములు. రామునికంటెయితరుని తలపను. రామునకునేనుదాసుడను. రామునందునుసీతయందును నామనముసర్వదా యుండునుగాక. 42

శ్లో॥ కోదండనిర్ముక్తశరాగ్రఖండనం
ప్రచండవిశ్వద్భుజదండమండనం
ప్రచండచండాంశుసమానభండనం
భజామిరామంరణరంగమండనం ౪౩

చ. సమదభుజాబలాఢ్యులగు శత్రులనైజ ధనుర్విముక్తబాణములవధించిదీక్షకిరణప్రవిభాసితచండమూర్తియై
ననురధరాభిరాముడయి సజ్జనబృందనుపర్వభూజమై
యమరినరామభూధవునహర్నిశము న్భజియింపుచుండెదన్. ౪౩

తా॥ ధనువునందు బాణమును బ్రయోగించినవాడును కోటిసూర్యప్రభాభాసమానుండును రాక్షసులనుయుద్ధమున వధించినవాడును రణమునకలంకారుండును నగురామునిస్మరింతును. 43

శ్లో॥ సింహాసనస్థంముని సిద్ధసేవ్యం
రక్తోత్పలాలంకృతపాదపద్మం
సీతాసమేతంశశిసూర్యనేత్రం
రామంభజేరాఘవరామచంద్రం. ౪౪

ఉ. రవిజైవాతృకనేత్రుడై మునిపర్వశ్రేణిసంసేవ్యుడయి
నవరత్నోజ్వలపీఠికోల్లసితుడయి సవ్యస్ఫుటాంభోజకోయి
రవసంపూజితపాదపద్మడయి గొ రామామతాయుక్తుడై
భువనేశుండగురామభూభుజహృదాంభోజంబునం జేర్తునన్. ౪౪

తా॥ మునిసిద్ధులచే సేవింపబడు వాడును ఎఱ్ఱకలువలవలె నున్న పాదపద్మంబులుఁ గలవాడును సూర్యచంద్రులు నేత్రములుగా గలవాడును భక్తులపాలిటి కల్పవృక్షంబును నగురాముని సేవింతును. 44

శ్లో॥ దయారూపే భూపే రఘుకులకలాపే సుహృదయే
భుజాస్తంభే దంభేతరవిజయగుంభే విరహితాం
మహావిశేధీశే దశరథకుమారే పరిసర
ద్గుణారామే రామే దశముఖవిరామే మనుమనః ౪౫

మ. సదయుండై ధరణీశుడై సుహృదుడై సర్వాత్ముడై ధీరుడై
మదశాత్రిఖండచండభుజుడయి మార్తాండవంశాబ్ధిప్రా
ముదితాబ్జుండయి వాజిసూనుడయి నాద్యుండ యుదశాస్యాదిభీ
ద్భిదురంబౌ రఘురాముసందెపు నావేశించు మత్స్వాంతమున్. ౪౫

తా॥ దయారూపుడయి సార్వభౌముండయి యార్తులకుసహృదయుండై రఘువంశమునకు మణియయిమదించిన శత్రులనుసంహరించుసఖండభుజబలంబు కలిగిసూర్యవంశమను సముద్రమునకు చంద్రుని వంటివాడయి దశరథునికుమారుడయి రావణునకుమారకగ్రహమైన రామచంద్రునిస్మరింతును. 45

శ్లో॥ గతేష్వనేకేషుభవేషు పాప్యతే
వ్యపరాత్తేషువయోగతీర్తేః
విత్రస్తసర్వేష్వనృణాంకులే స్వే
నంజాయతేభక్తిరనంతనిజాడే. ౪౬

మ. అలయోగ వ్రతతీర్థయాత్రరహితంబై కల్మషానక్రమై
యుపజన్మంబులనేకముల్జరిగె నేనేకాలముల్ రాఘవు
దలచ నేరకపోతినిప్పుడయిసందాసానుదాసుండనై
కొలుతుం గద్రఘురామచంద్రునిమదింగోర్కుల్ ఫలింపన్వేసన్. 46

తా॥ అనేకంబులయిన వ్రతంబులను చేయుచుతీర్థయాత్రలు చేయుచు యోగాభ్యాసంబులం జేయుచునానేక జన్మములందుచునేను

యింతదనుక రామచంద్రమూర్తి నామమును స్మరింపనైతిని. ఇప్పుడా రామునకు దాసాను దాసుండనయి కొలిచెదను. 46

శ్లో॥ శ్రీరామభద్రాశ్రితయోగివర్య
పాదాబ్జయుగ్మం సతతం భజేహం
యచ్చక్షుషీధామనజ పవేశం
తచ్చక్షుషి పశ్యతియస్య చేతః ౪౮

ఉ. శ్రీరఘురామపాదసరసీజములెప్పుడునాశ్రయించు స
త్పూరుములయినయోగిజనపుంజన పుంజపదంబుంగొల్చియాశ్రితా
ధారుణి [illegible]మునదా పరింపుచు రెట్టినాపుచే
వారయుచుండునా హృదయమందునిరంతరమట్టి చూపునన్. ౪౮

తా॥ శ్రీరామచంద్రుని పాదపద్మంబులను జపించి తరించిన యోగిజనులను నామనంబున స్మరింతును. ఆయోగిబృంధమెట్టి చూపులచేనామహామహుని చూచుచుందురో యాసర్వేశ్వరునినే నాచూపులతోడనే చూతును. 47

శ్లో॥ నగ్రస్తస్తమసానబాహ్నిమలినోదర్శేననోకర్శితో
నైవాస్తంగతవాన్ నచాంకితతనుర్నోపాక్షికశ్రీరపి
లోకాలోకనగేంద్రలంఘనవిధౌనోపంగుభావంగతో
నిర్దోషాగుణసాగరాద్రఘుపతి స్తేజోయశశ్చంద్రమాః. ౪౯

మ. ఒకపక్షంబుననే ప్రకాశిలడు రాహుగ్రస్తుడుంగాడు ద
ర్శకృశింపఁడు కళంకముంగనడు యేరీతింపగల్ దీప్తిబో
వక యుండున్వరచక్రవాళమెగరం పంగుండుగాడ స్తమిం
పరయుండాజిజనీగుణాబ్ధిభవ శుంభత్కీర్తిమాత్రేయుడుణ్. ౪౯

తా॥ ఒకపక్షంబుననే కాంతించువాడును రాహువుచే మ్రింగబడువాడును కాడు. అమావాస్యకు కృశింపడు. కళంకములేదు. ఎప్పుడును పగలు కాంతి దక్కకయుండును. పంగుడుగాను మహాకీర్తివంతుడు.

శ్లో॥ నాగానామయుతంతురగలనియుతం స్థానంరథానామిరిశతం
పాదాతాశ్శతకోటియుద్ధదళితాన్నృత్యన్కబంధోరణే
ఏవంకోటిబంధనర్తనవిధౌ చంచచ్చలద్ఘంటికా
యామార్థంపరమాత్మనోరఘుపతేఃకోదండగంటారవః. ౪౯

మ. అలరన్వేయుగజంబులుందశసహస్రాశ్వంబులున్స్యందనం
బులునూటేబదినూరుకోట్లసుభటుల్ భూమింబడందట్టమై
లలిన క్తంచరకోటివేలువరుసన్నర్తింప శ్రీరాముచే
విలుఘంటారవమొప్పనట్లు మెరసెన్విఖ్యాతియామార్థముల్. ౪౯

తా॥ శ్రీరామచంద్రమూర్తి రావణుని జంపునప్పుడు వేయి
యేనుగులును పదివేలగుఱ్ఱంబులును నూటయేబదిరథంబులును నూరు
కోట్లభటులును భూమిపై పడగా వేలకొలది రాక్షసులు భయంబుచే
నాట్యముచేయుగా రామచంద్రుని ధనస్సు అర్ధజాముకాలము మహా
ధ్వని చేసినది. 49

శ్లో॥ భజేహంసదా రామమిందీవరాభం
భవారణ్యదావానలాభాభిధేయం
భవానీహృదా భావితానందరూపం
భవాభావహేతుం భవానీప్రసన్నం. ౫౦

మ. కలుషారణ్యదవానలాహ్వయులుమాకాంతాత్మసంభావితో
జ్జ్వలపాథోజాతగారునుత్పలాభుని బవాభావాదిహేతున్భవా
ని ర్మలునానందమయుల్ శ్రీతార్తిహరుసన్మాణిక్యభూషుందినే
ట్యులవార్థిందునిరామచంద్రునిమదింకోర్కుల్ దీరభావించెదన్. ౫౦

తా॥ పాపంబులను నశింపజేయువాడును పార్వతీహృదయప
ద్మంబుచే నారాధింపబడినవాడును సంసారనాశనమునకు కారణుండును
[illegible] ప్రసన్నుడయినవాడును నగురాముని తలంతును. ౫౦

శ్లో॥ సురానీకదుఃఖౌఘనాశైకహేతుం
నరాకారదేహం నిరాకారమీడ్యం
పరేశంపరానంద రూపంవరేణ్యం
హరింరామమీశంభజేభారనాశం. ౫౨

మ. ధరణీభారనివారణుం దివిజసంతాపార్తివిచ్ఛేదనున్
హరిమాయామనుజాకృతింపరు పరానందస్వరూపుం పరా
త్పరురూపాహ్వయశూన్యకేవలపరంధామున్వరేణ్యుంపరే
శ్వరునిన్ శ్రీరఘురామభద్రుమదిసంభావించిసేవించెదన్. ౫౨

తా॥ దేవతలదుఃఖములను నశింపజేయుటకు మానవరూపము
ను ధరించినవాఁడును నిరాకారుండును పరానందస్వరూపుండును నగు
రాముని భజింతును. 52

శ్లో॥ ప్రపన్నాఖిలానందదోహప్రపన్నం
ప్రపన్నార్తినిశ్శేషనాశాభిధానం
తపోయోగయోగీశభావాభిభావ్యం
కపీశాదిమిత్రంభజేరామచంద్రం ౫3

మ. సుజనార్తిఘ్నసమాహ్వయున్మునిజనస్తోమార్చితున్యోగిరా
డ్హృజహృద్భావితుసుప్రసన్నశ్రితవర్యశ్రేణికానందునం
బుజమిత్రాత్మజముఖ్యనారసఖుంభూపుత్రికాధీశ్వరుం
భజియింతున్నిరతంబురాఘవపరబ్రహ్మంబునిష్టార్తికిన్. 53

తా॥ సమస్తజగదానందుండును ఆశ్రితుల పాపంబులను భ
యంబును పోఁగొట్టువాఁడును యోగిహృదయంబులనుండు వాఁడును
సుగ్రీవాది మిత్రుండును నగురాముని స్మరింతును. 53

శ్లో॥ స్ఫురద్రత్నకేయూరహారాభిరామం
ధరాభారభూతాసురానీకదానం
శరచ్చంద్రవక్త్రంలసత్పద్మనేత్రం
దురాసాధ్యపారంభజేరామచంద్రం. 54

మ. వనజాతాయతనేత్రచంద్ర విలసద్వక్త్రుం దురాసాధ్యనా
నిధాత్రీతలభారదైత్యగణ నిర్ఘాతాగ్నిసాదృశ్యకాం
చనమాణిక్యకిరీటకంకణవిరాజత్కుండలాలంకృతుం
ఘనవర్ణున్ రఘురామభూభుజుని కాంక్షం గొల్తు నశ్రాంతమున్. 54

తా॥ రత్నమయంబయి ప్రకాశించు హారంబులతో నొప్పు వాఁడును భూభారమునుదీర్ప రాక్షసులను జంపినవాఁడును శరత్కాల చంద్రునివంటి మొగంబును పద్మనేత్రంబునునగు రాముని భజింతును.

శ్లో॥ మరాధీశనీలాభ నీలాంగకాంతిం
విరాధాదిరక్షోగణానీకనాశం
కిరీటాదిశోభం పురారాతిలాభం
భజే రామచంద్రం రఘూనామధీంద్రం. ౫౫

చ. సురవరనీలరత్న పరిశోభితగాత్రు విరాధముఖ్యదు
ష్కరధనుషాంధకార హృతసారసమిత్రును రాజితుఖ్య క
ర్పరమకుటాద్యలంకరణు పుష్కరరత్న కులాబ్ధిచంద్రు శ్రీ
కరరఘురామభద్రు మదికాంక్షలుదీర భజింతునిత్యమున్. ౫౫

తా॥ ఇంద్రనీలమాణిక్యంబులచే కాంతించు శరీరంబుకలిగి విరాధాదిరాక్షసులకు నాశంకరుడయి కిరీటాదికాంతులచే ప్రకాశింపుచుండు రాముని భజింతును.
55

శ్లో॥ సదాభోగభాజాం సుదూరేవ్యభాతం
ముదాయోగభాజా మదూరేవిభాతం
చిదానందకందం సదా రామవేశం
విదేహాత్మజానంద కందం ప్రపద్యే. ౫౬

మ. తతభోగాను విషాదచిత్తులకు బొందందూరమై భక్తిసం
యుతయోగీంద్రుల కెల్లదానగుచు వేద్యుండై చిదానందుఁడై
క్షితిపుత్రీ హృదయప్రమోదకరుఁడై జెల్వొందు శ్రీరాము
న్మతిఁ[illegible]బు వేడెదను మోక్షశ్రీరమాకాంక్షినై. ౫౬

తా॥ సదా భోగములనుబొందువాడును దూరముగా కాంతించువాడును సంతోషముచే యోగంబులను పొందువాడును చిదానందకరుండును వనవిహారంబు సల్పువాడును నగు రామునిస్మరింతును. 55

శ్లో॥ మహాయోగమాయావిశేషాను
యుక్తావిభాశీక లీలానరాకారవృత్తిః
త్వదానందలీలా కథాపూర్ణకండా
సదానందరూపా భవంతీహలోకే ౫౬

మ. లలితంబయిన భవత్కథామృతము చాలంగ్రోలుచున్నట్టిని
శ్చలులానంద మనస్కులై మరయ స్వాందేహమా భక్తవ
త్సలలీలా మనుజాకృతీ ప్రకృతియోషా యుక్తకాకుత్స్థవం
శలసద్వార్థి శశాంకరామధరణీశా వేదవేదోత్తమా. ౫౬

తా॥ రామా ! నీకథామృతమును గ్రోలు నిశ్చలులానందస్వరూపులై యీలోకంబున సమస్తసుఖంబు లనుభవించుచు బరలోకంబున నీసాయుజ్యమును పొందుదురు. 56

శ్లో॥ యస్య ప్రాణ నివారణావనకృతే స్వాంతాంనిదానౌవిభో
రైంద్ర ధ్వ్యంతఃపతే కృపాజలనిధౌ కోపప్రసాదాముదే
భూయీద్వాసవ నీలసన్నిభతనుర్వామాంక సేవ్యద్వధూః
సోయందుష్టనిశాటపాటనపటు శ్శ్రీరాఘవోవస్సదా. ౫౭

మ. తత ప్రాణా వనశిక్షహేతుడయి గోపధ్వంసిసమ్మంధగ
ర్వితకాకాసురు నందు క్రోధుడయి యర్థింపం బ్రసాదాత్ముడై
శతమన్యూపలవర్ణుడై సదయుడై క్ష్మాపుత్రికాయుక్తుడై
హతదుష్టాసురుడై సరాఘవుడు నన్నశ్రాంతముం బ్రోవుతన్. ౫౭

తా॥ కాకాసురుని ప్రాణంబులను దీయసమకట్టి కోపంబుకలవాడయి యతనికి వేఱుదిక్కులేక తననే ప్రార్థింప నారాక్షసుని కరుణించి సీతతోకూడ సుఖుడయి యున్న రాముడు నన్ను కాపాడును. 57

శ్లో॥ దుష్టావాకలుషాత్మకోపిపిశునో దుర్మార్గసంచారివా
మాతృఘ్నోపిపితృఘ్న వర్ధనరతో సన్మౌనినిందాపరః
యోయంస్మృత్య మృతంహితం మధురసంవక్త్రాచ శ్రోత్రాలిలిఖ్య
ప్రాప్నోతినిరంతరై హికసుఖం నిర్వాణ సౌఖ్యంతతః. ౫౮

మ. కలుషాత్ముండును మాతృపితృహుండు దుష్కర్ముండునై మౌనివ
ర్యులనిందించునతండు దుష్టుడుమహా క్రోధాంధుఁడై నందినం
బులుకర్ణామృతముఁ లిఖింప శ్రుతుం గ్రోలన్ పఠింపన్మహిఁ
కలకాలంబు సుఖంబులం గనిమహా నందంబునొందున్మదిన్. ౫౮

తా॥ ఓరామా ! మహా పాపాత్ముండయినను దుర్మార్గముగా వంచరించువాడయినను తల్లిని జంపినను తండ్రిని జంపినను మునుల నిందించినను నీనామంబు నొక్కసారి స్మరించినంత మాత్రమున యీలోకమున సమస్తసుఖంబులను బొంది చివర నీకడకుజేరి జన్మలేని వాడయి సుఖించును. 58

మ. శివపాద్యుండగు నాదిశంకరులుఃముఁ శ్రీరామకర్ణామృతం
భవతిన్ సంస్కృత మేర్పరించె నదిమోక్షాపేక్ష చేకూరువం
శవరాబ్ధీంద్రు ప్రసిద్ధకవినే శ్రద్ధఁ దెనుంగించిరా
ఘవపాదండగ నిచ్చినాడగనుమా కల్పంబుగాసత్కృపన్. ౫౯

మాలిని. రఘుకులవరనాథో జానకీప్రాణనాథః
పితృవచనవిధాతా కీశరాజ్యప్రదాతా
కృతనిశిచరనాశం ప్రాపరాజప్రవేశః
విహితభువనరక్షః పాతుపద్మాయతాక్షః. ౫౯

గద్యరూపమగు మత్తేభవృత్తము.

ఇది శ్రీరామపదారవిందమకరందేచ్ఛాత్మసన్మత్తష
ట్పదవిజ్ఞానపదాబ్జరేణుపటల ప్రాప్తోత్తమాంగోల్లస
న్మదిశాంతఃకరణుండుసిద్ధకవిమాన్యుడైనరామావనీ
శదయాలోకనజెప్పెనాలుగవయాశ్వాసంబభీష్టాప్తికిన్.

శ్రీరామకర్ణామృతము సంపూర్ణము.

---